


సంపాదకుడు.

నడింపల్లి వెంకట లక్ష్మీనరసింహారావు
ఎం. ఏ. ఎల్. ఎల్ బి. బారిష్టరు.

శీలం జగన్నాథరావు,
ఎం. ఏ. బారిష్టరు

| | | |
|---|---|---|
| ౩ వత్సరము. | ఆషాఢము, క్రోధన.<br>మచిలీపట్టణము, 15 జూలై ౧౯౨౫ | సంపుటము ౧<br>సంఖ్య ౩ |


# శాస్త్రము - ప్రమాణము.



( నిడుమోలు శశశ సుందరంగారు. బి. ఏ. (ఆనర్సు)



"చూపులు మోసకత్తె" లన్నసామెత అసత్యము కాదు. ఒకనూతన పురుషుని గూర్చి ప్రథమసందర్శన సమయమున నేర్పడిన యభిప్రాయములు చిర పరిచయముచే విరుద్ధములుగ దోచుట యనేకుల యనుభవమై యున్నది. అటులనే ప్రకృతి ప్రపంచము నందును వస్తువులు బాహ్యస్వరూపములు స్ఫురింపజేయు నపోహలు నిరాధారములని పరిశీలన దృష్టితో చూచినపుడు తోచు చుండును. శాస్త్రవేత్తల శిక్ష

దృక్కుల యెదుట నజ్ఞాన ప్రపంచము నావరించిన యంధకారము పటాపంచలగును. అజ్ఞానము అసత్యమున కాలవాలము. మానవుని చక్షురింద్రియముల కగోచరములగు వస్తువులును సృష్టియందలి భావములగు వస్తువులును నేకసమ్బద్ధములని తర్కశాస్త్రము పాటించుచున్నదట, కాని, విజ్ఞాన విషయము లనేకములు మనకంటికి కగుపడనంత మాత్రమున నసంబద్ధములని త్రోసిపుచ్చుటకుతర్కమునిపించుకొనును. కంటికగుపడని దంతయు మిథ్యయనియెడి నాస్తికవాదమొక ప్రక్కకును, కంటికగుపడు నదంతయు మిథ్యయనియెడి వేదాంత వాదమొక ప్రక్కకును నీడ్చుచుండగా, శాస్త్రకారుడు నిశ్చలుడై నిలిచి, తనకగుపడు వస్తువిషయ పరంపరలయందు కారణ కర్మముల యొక్క అవినా భావ సంబంధములను సవితర్కముగ పరిశీలించి సత్య మార్గము నన్వేషింపఁ బూనుకొనుచున్నాడు. అతడెట్టి స్వల్పవిషయమునైనను, మూఢవిశ్వాసముతో నంగీకరింపక నందలి సత్యాసత్యములను విమర్శన దృష్టితో పరిశీలించి నిర్ణయించును. చిరకాలానుగతములగు నభిప్రాయములైనను అతనికి నిరాధారములని తోచినపుడు వానిని విసర్జించుట కాతనికి హక్కుకలదు. ప్రకృతియందలి సత్యములు జనులయొక్క ఆదరానాదరముల వలన వ్యత్యస్తములు కాజాలవు. శాస్త్ర ప్రపంచమున నిర్హేతుకములగు నభిప్రాయములు నిరర్థకములు.

ప్రపంచమున ప్రతిజాతి యందును మూఢ విశ్వాసములనేకములు ప్రబలియున్న వనుట నిజము. కాని మన దురదృష్ట వశమున, ప్రపంచము నందెల్ల హిందూదేశమే మూఢాచార పరాయణత్వమున ప్రథమ స్థానమున నున్నదని పాశ్చాత్యులు ప్రకటించుచున్నారు. నవనాగరికతకు నిలయములగు దేశములందును కూడ నిట్టిమూఢ విశ్వాసములు ప్రచారములో నున్నవి. మన దేశమునందును అట్టి వనేకములు లేకపోలేదు. కానియవి పరదేశీయులు వర్ణించునంతటి విపరీతముగా నున్నవాయని సంశయించుటకు తావుకలదు. ప్రజాసమూహమునకు విశ్వాస పాత్రమగు నేవిషయమైనను సులభముగ త్రోసిపుచ్చరాదు. అందలి నిజానిజములను పరిశీలించుట శాస్త్రజ్ఞుల విధి. అటుల పరిశీలింపకయే నది యబద్ధమని యెవరును వాదింపరాదు. కాని, యట్టివిచారణా ఫలితముగ ప్రజాభిప్రాయము ఆధార రహితమని స్థిరమగునపుడు మనము శాస్త్రసమ్మతమగు నభిప్రాయమును సహేతుకముగ సూచించుటతప్ప నింకేమియు చేయజాలము.

సూర్య సంచారము

శాస్త్రప్రమాణ రహితము లయ్యు, ప్రజాసామాన్యమునకు చిరకాలము విశ్వాస పాత్రములై యుండిన కొన్ని విషయముల గూర్చియిట ముచ్చటింతును, ప్రాతఃకాలమున సూర్యుడు తూర్పున నుదయించుచున్నాడు. అంతట క్రమక్రమముగ నాకసమున నధిరోహించి, పశ్చిమమున గ్రుంకుచున్నాడు. మరల మరునటి నాడుదయమున ప్రాగ్దిశను దోచుచున్నాడు. వేరొండు విశేషమెద్దియు గమనింపనపుడు, సాధారణముగా, సూర్యుడే భూమిచుట్టును ప్రద

క్షిణ మొనర్చు చున్నాడని తలపవలసి వచ్చును. సూర్య సంచారమునకు సంబంధించిన యన్యవిషయముల గమనింపని మానవుడట్లే తలచి యుండెను. సూర్యుడు భూమి చుట్టును అనుదినము ప్రదక్షిణము నొనర్చు చున్నాడను నమ్మకము ఎన్ని వేల సంవత్సరములు మానవ ప్రపంచమున నవిచ్ఛిన్నముగ ప్రబలి యుండెనో మనమూహింప జాలము. సర్వ ప్రజాసామాన్యమునకును విశ్వాస పాత్రమైన ఆసిద్ధాంతము యొక్క సత్యము నందు ప్రథమమున నెవ్వరికేనుమానము కలిగెనో మనమెరుగము కాని, ఆయనుమానమే క్రమక్రమముగా ప్రబలమయ్యెను. పగటి యందు సూర్యుడెట్లు భూమిచుట్టును ప్రదక్షిణముల నొనర్చునట్లు అగపడు చున్నాడో అటులనే, రాత్రులందు అనంతకోటి నక్షత్ర మండలములును క్రమము తప్పక భూమి చుట్టును తిరుగుచున్నవని మానవుడు కనుగొనెను. ఈనక్షత్ర మండలములు భూమి కంటె చాలరెట్లు పెద్దవియనియు, భూమికనేక కోట్లమైళ్ల దూరమున నున్న వనియు, శాస్త్ర పరిశోధనము వలన నిర్ణయింపబడెను. సూర్యమండల మొక్కటి భూమికంటె 331,100రెట్లు బరువుగ నున్నది. సూర్యమండలము కంటెను పెద్దవియగు నక్షత్రములనేకములు కలవు అవి ఆకసమున నన్ని దిక్కులను కలవు. ఇట్టిసందర్భములలో, భూమికంటె చాలరెట్లు పెద్దవియు, నొకదాని కొకటి చాలదూరము నందున్నవియు నగు నక్షత్ర మండలములు నియమితకాలములో (అనగా సుమారు 24గంటలలో) అల్పమగు భూమిచుట్టును తిరుగుట సాధ్యమా? అట్లు కానియెడల, నివియన్నియు తిరుగుచున్నట్లు ఏకారణము వలన మానవునకు దోచుచున్నది? యని శాస్త్రజ్ఞుడు ప్రశ్నించుకొనెను. నక్షత్రముల నడుమప్రదేశ మంతయు శూన్యమైయున్నపుడు, అవియన్నియును క్రమము తప్పక భూమిచుట్టును ప్రదక్షిణముల నొనర్చుటకు భూమియందు గల విశేషమేమి? పరిమాణమును గణింతుమా, అనంతమగు నాకాశమునందు భూమి యొక పరమాణువు. ఆనక్షత్రములకును భూమికిని నడుమగల దూరములను చూతుమా, అతివిస్తారములు. ఒక్కొకటి భూమికంటె శతసహస్రాంశములు పెద్దవియగు శతసహస్ర నక్షత్రమండలములును క్రమము తప్పక అనుదినము భూమి చుట్టును ప్రదక్షిణ మొనర్చుటకు కారణము నిరూహ్య మయ్యెను. అంతియే కాదు. భూగోళము యొక్క చుట్టుకొలత సుమారు25000 మైళ్ళు. భూమితనలో తానొక దినములో నొకప్రదక్షిణము చేయునెడల భూమిపైనున్న ప్రతిమానవుడును కనురెప్ప పాటులో సుమారు 500 గజముల దూరమునకు తానెరుగకయే కొనిపోవబడుచున్నాడు. నిశ్చలములగు చెట్లును పుట్టలును కూడ నంత వేగముగనే కదలుచున్నవి. ఇంత వేగముగ నడచు వస్తువులను మనము భూమిపై కని యెరుగము. అదియునుగాక, మనము కదలుచున్నట్లు మనకు తెలియుటయే లేదు. ఐనను భూమి తనలో తాను తిరుగుట లేదని యెంచి నక్షత్రమండలములే భూమిచుట్టును తిరుగుచున్నవని యెంచిచూతము. Centauri లేక నరాశ్వము, అనునది నక్షత్రములలో నెల్ల భూమికతి సామీప్యము

మున్నది. అనగా 25, 60, 000కోట్ల మైళ్ల దూరములో నున్నది. ఇది భూమిచుట్టును ప్రదక్షిణము చేయుటకు, దినములో, 8, 046, 000కోట్ల మైళ్లదూరము తిరుగ వలసివచ్చును, అనగా, క్షణములో 93కోట్ల మైళ్లదూరము కదలి పోవలెను. కావున నక్షత్ర మండలములు లోకము మారుగ భూమి చుట్టును తిరుగుచున్నవని యెంచిన యెడల, భూమికి చాలచేరువలోనున్న నక్షత్రము క్షణమునకు 93కోట్లమైళ్లు కదలుచుండ వలయును భూమియే తనలోతాను తిరుగు చున్నదని యెంచిన యెడల, నది క్షణమునకు 500గజములు కదలుచుండ వలయును. వీనిలోనే యూహాసమంజస మైనదో నిర్ణయించుకొనుట కిపుడెట్టి కష్టమును లేదు.

భూ భ్రమణమును నిరూపించుటకు పైన వివరింపబడిన రెండు కారణములేగాక శాస్త్రప్రమాణము లనేకములు లభించినవి. కాని పై కారణములే సూర్యుడును నక్షత్ర మండలములును భూమిచుట్టును తిరుగుచున్నదను నపోహమును విమర్శించుటకు తావొసగినవి. కాలక్రమమున నిప్పటికది యెల్లరివలనను అంగీకరింపబడు చున్నది. అనర్థకమగు నాత్మగౌరవమును నిలువబెట్టుకొనదలచెడు నహంకారులు తప్ప సత్యము నాకాంక్షించు సజ్జనుడెవ్వడును తననివాస స్థానమగు నీభూమియే నక్షత్రమండల మార్గములకు కేంద్రస్థానమని గర్వింపడు. ఖగోళము యొక్క కేంద్రాధిపత్యమును యథేచ్ఛగననుభవించుచున్న మానవులనీ నూతన సిద్ధాంతము పదచ్యుతుల నొనర్చినది. భూమి తనలో తాను తిరుగుచు సూర్యుని చుట్టును ప్రదక్షిణము లొనర్చెడి గ్రహములలో నొకటియని శాస్త్రజ్ఞులు స్థాపించినపుడు మానవుడు తనస్థాన భ్రష్టత్వమును గాంచి తల్లడిల్లెను. అన్యమత సహనము నుగ్గుపాలతో ద్రావిన హిందువులీ నూతన సిద్ధాంత కర్తలను సాదరముగ భావించి నటులనే తోచుచున్నదిగాని పురాతన పాశ్చాత్యనాగరికతకునిలయముగు గ్రీకుదేశమీనూతనసిద్ధాంతమును నిరసించి తత్కర్తలపై దాడివెడలి వారిని పలుబాములకు గుడిపించినది. గెలిలియో కోపర్నికస్ మొదలగు శాస్త్రజ్ఞులు పడినపాట్లు చరిత్రాత్మకము లైనవి.

కాని తుట్టతుదకు శాస్త్ర ప్రమాణములపై నాధారపడిన సత్యమే విజయమొందినది. ప్రస్తుతకాలమున నాలోచనాపరులగు మానవులెల్లరును యీసిద్ధాంతమునే విశ్వసించుచున్నారు. బుద్ధితెలిసిన ప్రతిబాలుడును మనకనుదినము నగుపడుదృశ్యము దృష్టిలోపమనియు భూమియే సూర్యుని చుట్టును తిరుగుచున్నదనియు నేర్చుకొని దానిని నమ్ముచున్నారు. దీని నెరుగనివారు మూఢులుగను పిచ్చివారలుగను మన మెంచుచున్నాము.

### పిడుగు

కంటి కగుపడిన యొక విషయము శాస్త్రజ్ఞుని యాలోచనమువలన నెట్లుమార్పుజెంది సుస్థాపిత మైనదియు వివరించుటకు సూర్యసంచారమును గూర్చి పైనవివరించియుంటిని. ఇక శాస్త్రప్రమాణ రహితమయ్యు నేటికిని ప్రజాసామాన్యము నకు విశ్వాసపాత్రమైన వేరొక దృష్టాంతరమును వివరింతును.

ఆకసము నావరించు సాంద్రతర మేఘములలోనుండి అగ్నిజ్వాలతో కూడుకొనిన లోహపదార్థము మహావేగముతో భూమిపై కురుకుననియు నది పడినచోటు నెల్ల నాశనము గావించుననియు మనము నమ్ముచున్నాము. అర్జునుడు వర్షాగమ సమయమున తన శ్వేతాశ్వములరథము నెక్కి మేఘములపై మహావేగమున పోవుచుండుననియు ఉరుములనియెడి మేఘగర్జనము లారథ చక్రములు మేఘములయొక్క సంఘట్టనము వలనకలిగిన శబ్దములే యనియు పిడుగనునది ఆరథచక్రముల శీలయనియు నొకపుక్కిటి పురాణముకలదు. అర్జునుని దశనామస్మరణము వలన నాతడు సంప్రీతుడై తన రథాంగమగు పిడుగును భూమిపై పడకుండ నుపసంహరించుననివిశ్వసించియే భక్తిపరుడగు హైందవుడు మేఘగర్జనములను వినినపుడెల్ల "అర్జునః ఫల్గునః పార్థః" యను శ్లోకమును పఠించుచున్నాడు.

ఆకసమున మేఘ శకలపరంపరల నడుమ ప్రవహించువిద్యుచ్ఛక్తి (Electricity) యే ఉరుములు మెరుపులు పిడుగులు మొదలగు వాని కన్నిటికిని కారణభూతమని ఆధునిక శాస్త్రజ్ఞు లెంచుచున్నారు. అయినను పిడుగు మేఘములలోనుండి లోహరూపమున భూమిపైకురుకునని అనేకులిప్పటికిని భ్రమపడుచున్నారు. కాని యిందులకెట్టి యాధారము నగుపించుటలేదు. మేఘములలోనుండి బయల్వెడలిన పిడుగు నేటివర కెవ్వరికిని లభింపలేదు. భూమిలో నేర్పడిన కొన్ని లోహపు ముక్కలును విద్యుచ్ఛక్తి వలన ఘనీభవింపబడిన యిసుక రాళ్లు మొదలగునవియు తగినంత పరిశీలన దృష్టితో చూడని వారికి పిడుగులనెడి భ్రమను కలుగజేసి యుండవచ్చును.

లోహశిలా స్వభావములుగల పదార్థములు కొన్నిఅప్పుడప్పుడు ఆకాశమునుండి పడుచుండును. కానియవి మేఘసంఘట్టనముల వలన జనించినవి కావు. అవి మేఘములకు పైన ననంతదూరమున శూన్యప్రదేశమునుండివచ్చుచున్నవి. భూమి సూర్యునిచుట్టును తిరుగు మార్గములో నప్పుడప్పుడు కొన్నిలోహశిలాపదార్థ సమూహముల నెదుర్కొని స్వకీయమగు నాకర్షణశక్తివలన వానిని తనవైపునకు లాగుకొనును. ఆపదార్థములు భూమియొక్క వాతావరణమును ప్రవేశించి అనగా భూమికి సుమారు 5, 6 మైళ్ళదూరములోనికి వచ్చినపుడు గాలియొక్క రొరపిడి వలన కలుగు వేడిమి చేత తెల్లబడుచున్నది. అంతట నగ్నిలోనికురుకు కీటకమువలెనది విదగ్ధమై పోవుచున్నది. కాంతివంతమగు నాపదార్థము భూమిని సమీపించుచుండగా చూచినవారు నాపిసి భూభూమిపై రాలుచున్న నక్షత్రములని భ్రమించుటయు కలదు. కొన్నిసమయములందు ఆపదార్థములు చాల పెద్దదిగ నుండుటవలన నవి భూమియొక్క వాతావరణముగుండ ప్రయాణ మొనర్చినను సంపూర్ణముగ విదగ్ధముకాక ఘనపదార్థరూపమున భూమిని చేరుచున్నవి. వీనినే సూదియంటురాళ్ళని మనము పిలుతుము. ఇట్టివికొన్నితులముల మొదలుకొని కొన్ని బారువల వరకును బరువుగల ముక్కలు అనేకములు ప్రపంచమునందనేక చిత్రవస్తు ప్రదర్శన శాలలయందు పదిల పరుప

బడి యున్నవి. అవి భూమిని సమీపించు నపుడొక విధమైన ధ్వనిని కలుగ జేయును కాని మేఘ గర్జనములతో వానికెట్టి సంబంధమును లేదు. వానిని పిడుగులని పిలచుట సమంజసము కాదు.

భూతత్వ శాస్త్రజ్ఞులు సైకత శిలలు (Fulgarites) అనిపిలిచెడిపదార్థము లేపిడుగులని యనేకులు పొరబడి యున్నారు. విద్యుచ్ఛక్తి వ్యాపకమువలన నిసుక రేణువులు కరగి ఘనీభవించి యిట్టిసైకత శిలలుగా నేర్పడు చున్నవి. ఇంగ్లాండులో ఇర్టు (Irt) నదీ ముఖమున నలుబది యడుగులలోతు వరకును యీసైకత శిలలు వ్యాపించియున్నవి. మాకిల్సు ఫీల్డు (Macclesfield) అను ప్రదేశము నయిరువది రెండడుగులలోతువరకు నివివ్యాపించియున్నవి. ఉరుములు మెరపులు దట్టముగా నున్న సమయమున విద్యుల్లత యొకటి యిసుక ప్రదేశముపై వ్యాపించినప్పుడు అచట నేర్పడు సైకతశిలలను గాంచి యవియే పిడుగులని మనము భ్రమపడుట సహజము కావచ్చును. కాని జూవులు మోసకర్తెలను సామెతనిచట మరల జ్ఞాపకము చేసికొనవలెను. మనము పిడుగు అని పిలిచెడి విద్యుల్లతా ప్రవాహములోనుండి లోహ శిలాస్వభావ సమన్వితమగు ఘనపదార్థము సృష్టింపబడుట అసంభవమని అధునిక శాస్త్రివేత్తలెవను వాదించుట లేదు కాని పిడుగు అనియెడి పదార్థమింతవర కెవ్వరికిని లభింపలేదని మనము నిరాఘాటముగ చెప్పవచ్చును. అట్టిది నేడెవరి వద్దనైన నున్నయెడల దానినొకకింత సామ్మైన నిచ్చెడి శాస్త్రివేత్తలు పరిశోధనాభిలాషులును అనేకులు కలరు. అట్టిది నేడెవరివద్ద నులేనియెడల మేఘ గర్జనములలో పిడుగనియెడి ఘనపదార్థము జనించి భూమిపై కురుకుచున్నదని యెంచుట అశాస్త్రీయమని సూచించినచో క్షమింతురుగాక.



# చిత్రశాల.



(అయ్యంకి వేంకట రమణయ్యగారు.)



విశాలానగరమునందొక శిల్పియుండెను. ఆతని పేరు శ్రీలేఖకుడు; యౌవనుడు. ఆపట్టణ మందలి కోటీశ్వరుని పుత్రికయగు సునతయను విదుషీమణి చెలికత్తెయగు కాంతికను వెంటనిడుకొని చిత్రశాలకు వచ్చి చిత్తరువులను విలోకింపుచు తన్మయత్వము నొందుచుండెను.

శ్రీలేఖకుడు:— సునతాదేవీ! మీయాగమనమువలన నేనుధన్యుడనైతిని. చిత్రశాల ధన్యమాయెను.

సునతాదేవి:— శిల్పీ? నాకీదినము సుదినముగదా!! కామ్రిలిప్త మొదలు తక్షశిలవరకునుండు జనులెల్లరు నీపేరు వినగనే భక్తిభరమున తలవంచుచున్నారు. నీకుంచెనుండి బయల్వెడలు జీవరేఖలు వందలకొలది స్త్రీపురుషుల హృదయముల నాకర్షించి పరమానంద భరితులుగ నొనర్చుచున్నవి. సుఖసాగరమున ముంచుచున్నవి. కాని శిల్పీ? కళా మందిరమందలి మహదైశ్వర్యముగాంచి యానందించు భాగ్యమెంత మందికిలభించును?

శ్రీ:— నీవంటి విదుషీమణి పావనమొనర్చిన చిత్రశాలలెన్నిగలవు?

సు:— శిల్పీ! ఈపటమందలి విషయమేమి?

సు:— తపోనిరత యగు పార్వతీదేవి. ఎట్లున్నది?

శ్రీ:— చెప్పవలెనేమి? నిరుపమానము: శిల్పీ! ఈమె మోమున సాధనా జనితమగు లావణ్యాతిశయ విలాసములు మిన్నుముట్టినవి. వాని నీవెట్లువికసింప చేయగలిగితివి?

శ్రీ:— సునతా? నీవుమరచియుందువు. ఉషఃకాలముననే లేచి యేకలింగస్వామి దేవళమునకేగుచుంటిని. అప్పుడు స్నానమొనర్చి దేవుని పూజించుటకొకయువతి వచ్చుచుండెను. ఆయువతిని నేను తదేక నిష్ఠతో గాంచుచుంటిని. కాని సునతా? నిజముచెప్పుదును. నీవుమాత్రము గోపగించ జనదు. ఆమె మోమునందలి యనింద్య సుందరశుచిత్వమే నేనిందు వికసింప చేయగల్గితిని.

సు:— ఆ... కాదనుట యెందుకు! నీమాట నిజమని యనుకొనెదను. కాని యట్లొనర్చుట న్యాయమా? నాముఖమండల జ్యోతిని దేవతలమోమున నర్పించుట సముచిత మనుకొనను.

శ్రీ:— అవును. నీవు చెప్పినమాటలు నిజమే. కాని యొకదేవత ముఖమండలజ్యోతిని మరియొకదేవత ముఖమండలమున నర్పించితిని. ఇంతకంటె నేనొనర్చిన దేమున్నది?

సు:— శిల్పీ! ఇష్టమువచ్చినటుల మాటలాడుచున్నావు. ఇట్టి మాటలవలన పాపము చుట్టుకొనును సుమా!

శ్రీ:— సునతాదేవీ! కుతూహలచిత్తమున పాపమునకేమారు లావణ్యనిధి యుంటిని. నీకటికెంతు

మూర్ఖుగాదు. నిజముచెప్పు చున్నాను. వేయిమార్లాహ్వానించితిని.

సు:— శిల్పీ? ఈతడుమన్మథుడుగాడా!

శ్రీ:— అవును. వృక్షముల చాటున పొంచుండి మృదుమధుర మందహాసమున శరసంధాన మొనర్చుచున్నాడు. తపోనిరతుడగు మహేశ్వరుని గొట్టుచున్నాడు.

సు:— బాగున్నది. కాని యీతని చిరునగవునందొక యింగితము గనపడుటలేదా!

శి:— శిల్పియొక్క కోరికలిచ్చటనేగదా మూర్తీభవించును. కానియావిషయమును తెలుపు చెప్పు మెట్లు!

సు:— శిల్పీ? యీశరములెన్ని? ఇవియన్నియు వికసించునా?

శ్రీ:— అత్యనిర్ఘుష్టమైన శరము సంధింప బడినప్పుడవి యన్నియు వికసించును. ప్రస్ఫుటము వందలి పుష్పములన్నియు ముకుళితమై శిల్పి హృదయ మందంకురించిన కోరికవలెనున్నవి. ఈప్సితము హృదయమును స్పర్శించినకాలమున నవి యన్నియు వికసించును.

సు:— ఇదేమి? స్వర్ణప్రయత్నమందలి యస్పష్టమగు నారీమూర్తియేనాయిది?

శ్రీ:— అవును. శోకాకుల. మదనవియోగ విషాదము గలవ మగనాస్థయం దున్నది. ప్రేమయొక్క చిరంతన వ్యథయే యిందలి రహస్యవిషయము.

సు:— ఇంత ధూమమేలను?

శ్రీ:— హృదయాగ్ని బహిర్గతమగుటకు మార్గము గాన్పించలేదు. అత్యంతమగు నిరాశ ధూమాకారమున దీర్ఘశ్వాసగ బహిర్గత మగుచున్నది.

సు:— దీనితర్వాతవిషయమును దెల్పు. పార్వతీపరమేశ్వరులచిత్తరువు లేగదా?

శి:— హృదయమునందున్నంతవరకు చిత్రించితిని.

సు:— పార్వతీ పరమేశ్వరుల కలయికను దెల్పు చిత్తరువును చిత్రింప నంతవరకిది యసంపూర్ణమేగదా?

శి:— అట్టిచిత్తరువును చిత్రింపగల సౌభాగ్యము నాకులభించునా

సు:— శిల్పీ; ఈ చిత్తరువు వెవరిది?

శ్రీ:— ఇది రాజకుమారియగు చంద్రరేఖ చిత్తరువు. రాజుగారి యాజ్ఞ ప్రకారము చిత్రించుచున్నాను. కాశీ పురాధీశుని పుత్రునకు చంద్రరేఖనిచ్చి వివాహ మొనర్చెదరట. ఆరాయబారము దీనికొనివచ్చిన బ్రాహ్మణుని చేతికిచ్చి యీచిత్తరువును కాశీ యువరాజునకు బంపుదురు.

సు:— శిల్పీ! ఈచిత్తరు వెవరిది? ముఖమునకు వస్త్రము గప్పియున్నదేః

శి:— కునతా! ఆచ్ఛాదనమునుదొలగించెదను. (పటముమీద వస్త్రమునుదీసి) చూడు? ఎట్లున్నది. ఇది యెవరి యాలేఖ్యమై యుండును?

సు— శిల్పీ! తండ్రియాజ్ఞానుసారము నాప్రతిబింబము చిత్రించి వారికొసంగి యుంటివి. కానియిదితిరిగి నీకెట్లులభించినది?

శ్రీ— ఇదిపటమా! ఆపటమును నప్పుడే యిచ్చితిని. కానియిది నాకళాలక్ష్మి—శిల్పియొక్క మానసమూర్తి.

సు:— అమూలనున్న పటము లట్లుపడియుటకు కారణమేమి? దుమ్ముపడియున్నవి?

శ్రీ:— వానిమాట యటుంచుము. అవి యసంపూర్ణములు. ఇక సంపూర్ణమగుట కష్టము. కాని నాకళాలక్ష్మినిగూర్చి చెప్పెదను వినవా? నేనుకోటీశ్వరుని గృహమందు చిత్తరువుల చిత్రించుటకాహ్వానింప బడినప్పటినుండియు నామనోలోకమున నీమూర్తియే క్రీడించుచున్నది. ఆరుమాసములుగ నామూర్తినే యనేక దేవతల రూపరేఖలయందు బంధించి యుంటిని. కాని నేడు నామనమునుండి యీమూర్తి తరలిపోవునాయేమి?

సు:- ఏగదు. (అనియామె పక్కనున్న పటముల మీది దుమ్మును చేలాంచలమున దులుపుచుండును) వినియుంటివి దుమ్ము గ్రమ్మెటెలను?

శ్రీ:- సునతా? ఇదియేమిసి ఈ సామాన్యచిత్తరువులను మిక్కిలివిలువగలవి చేలాంచలమున దుడిచెదవేల? మకిలి యంటుకొనదా?

సు:- అంటుకొనిననేమి! ఈపటములకంటె చీనాంబరముల వెలమిక్కుటమా? అట్లని నే నెప్పుడును తలంపను.

శ్రీ:- సునతా? నిజము చెప్పెదను. చిత్రశాల నంతను నీకు సమర్పించు సౌభాగ్యము నాకు లభించునా? సునతా?

సు- ఈ చిత్తరువు కరుణారసమున నోలలాడుచున్నది. పేరేమి?

శ్రీ- నా ప్రశ్నకిది ప్రత్యుత్తరమా?

సు- కాదు. ఈ పటవిషయ మేమియని యడుగుచున్నాను.

శ్రీ- తెల్లవారు జామున నే నాకు మెలకువ వచ్చుచుండెను. ప్రభాత గానముల వినుచుంటిని. కాని నీవు....

సు- ఇదేమి!

శ్రీ- పురస్త్రీలు స్నానమొనర్చి పాటలుబాడుచు నా శయనాగారము ప్రక్కనుండి పోవుచుందురు. కాని యెప్పుడును వారియందు నిన్ను గాంచలేదు. నిన్ను చూచిన దినము నుండియు—

సు- చిన్నిపటమెవ్వరిది?

శ్రీ- కాదు. నన్ను పూర్తిగ చెప్పనిమ్ము. ఆదినము నుండియు నా శిల్పమును నీకర్పించితిని. కోపగించకుము. ఇంకను చెప్పవలసిన విషయము మిక్కుటముగ నున్నది. నీవు వినవలయును.

సు- శిల్పీ! నా కింకను చెప్పివినిపించవలయునా? చెప్పవచ్చును గాని, ముందీ చిత్తరువునుగూర్చి చెప్పుము.

శ్రీ- దీనితర్వాత నే చెప్పనున్న మాటలవిందువా! నిజముగా విందువా?

సు- సరే. చెప్పు. ఈపటమెవరిది?

శ్రీ- ఇది చాల చిత్రమైనచిత్తరువు. ఇందలివిషయము మనోహరము. మహారాజునకు నామీద యమిత ప్రేమముగలిగి ప్రతిదినము పుష్పమాలల నాకొసంగుచుండుమని మాలాకారున కాజ్ఞాపించెను. అటులనే ప్రతిదిన ముదయమున నా కాతడు ఫలపుష్పములు, మాలలకును బంపుచుండెను. అతని కుమార్తె చిత్తరువిది. ఇక నా విషయమును చెప్పెదవినుము.

సు- ఆకన్నియను నీ వెట్లు చూచితివి.

శ్రీ- ఆకన్యయే నాకు మంచిసువాసనగల పుష్పముల కోరి మాలలుగట్టి తెచ్చియిచ్చుచుండెను. ఒకదినమున సుసౌందర్యమున వలరారు నా బాలికను గాంచినప్పుడు నా కానందము గలిగెను. ఆ విచలిత నేత్రముల సౌందర్యమును నేను వర్ణింపజాలను. ఆ యువతిని గాంచి "రేపుదయమున నీవురా, నీచిత్తరువును చిత్రించెదను" అని చెప్పితిని. అటుల మరుదిన మున్షఃకాలమున నా కన్నియ వచ్చి మాద్వారముకడనిలచెను. అపూర్వ సౌందర్యమామె మోమున నుట్టిపడుచుండెను. ఏదో విధముగ గబగబ నా కళ్యాక చిత్తరువును చిత్రించి యామె చేతికిచ్చితిని. వెంటనే గాని నాయునతి నా చేతికిచ్చి యేడ్చుచు వెడలిపోయెను. ఆ మరుసటి దినమునుండియు నా కాకన్నియ కనపడలేదు. పూలహారములతోడ కోటపరిఖయందు కాలుజారి పడిచని పోయెనని వినియుంటివి.

సు- తర్వాత.

శ్రీ- ఇంకనేమున్నది? ఆపటము నాకడనె యున్నది. అదియేయిది. పద—అగదియందుగూర్చుందము.

ఇంకను పలోకవసరేక విషయములగూర్చి మాట లాడవలయును.

సు— ఆ విషయము నిశ్చాందోళన పరచుటలేదా! ఆవిషయమునుగూర్చి యోచించుటలేదా!

శ్రీ— యోచించుటకేమి. ఆకన్నియ తాళ్ళావన యందె న్యాయము నిల్వలేదు.

సు— ఆ...

శ్రీ— పద సునతా. ఈపటముకడ నిలుచుటవలనలాభ మేమి? నీకుచెప్పవలసిన విషయములు చాల యున్నవి.

సు— ఆ...శాంతికి యెచ్చట?

శ్రీ— అక్కడచిత్తరువుల చూచుచున్నది.

సు— శాంతికా? ఇంతసేపటినుండి యెచట నున్నావు.

1-పద ఇంటికి బోవుదము.

శ్రీ— ఒక్కనిముస ముండుము సునతా? మాయిల్లం తయుచూచివెళ్ళుము. గృహములోనికిరమ్ము.

సు— కాదు కాలసమగ నున్నది. ఇంటికి వెళ్ళవల యును.

శ్రీ— నాగృహమందుగూడ మంచిపటములు గలవు. వానినిగూడ గాంచి పొమ్ము.

సు— క్షమింపుము శిల్పీ? మరియొక దినము వత్తును. శాంతికా పద...

శ్రీ— నామాటవినవుగదా?

సు— శిల్పీ ఆయువతిచిత్తరువే నీశిల్పోత్కృష్టతకు నిద ర్శనము. దానిని నీశిల్పపీఠముకడ నుంచు కొనుము.

# యెవరిదితప్పు?

(రవీంద్రుని గీతము)

గీ. ఉదయమునఁ బుష్పమాలిక న్గూర్పబోవ
సుమములన్నియు జారుచు భువిని బడిన
పొంగి పొంలెడి చూపుల బ్రియుడనీవు
గాంచుచుండెదు క్రుమ్మిలినాదుసుఖము;
వన్నుగడవన్ను నీమురిపెంపుకనుల
ప్రియుడ! యదుగునయపరాధమే రిదంము.

౨

భావమిగుల్గొత్తఁ జేతము పల్లవింప
గానముపరింప వీణను గొనినయపుడు
గద్గదరవంబు వెడలెనా కంఠసీమ
నేలొకోయంచు నినుజూడ నినుమోము
చిరునగవు వెన్నెలలరహి జెలగుచుండె.
పంకజంబున సీధువు బెరిమనాని

లీనమై మఱచు భృంగంబు రీతిదనర
మానముద్రను దాల్చె నాగళరవంబు
ఆననిడి వేగకారణం బరయునీదు
పెదవినటియించు హాసంబు నిపుడునాథ!

3

అపకిరదిక్కటమునను నుపత్తమింపె
ముకుళభావము నొందెఁబద్మంబులిచట.
సెల వొసంగుము నాథ! నీచెంత జేరి
యాకసంబున నుడుకాంతియలరుచుండ
నెద్దిరొప్పఁగనద్దాని జేయనిమ్ము
మానమందున నాదుపెదవుల నిపుడు.

వ న మా లి,

# యోసకురా



( జపాను కథ )



'యోసకురా' యను వృక్షముయొక్క చరిత్ర నెరుంగనివారు లేరు. ఇదియొక గ్రామ సమీపమందుండెను. ఫలపుష్ప భరితమై నయనానందమును గొల్పుచుండెను.

ఆచెట్టు క్రింద గుడిశె వేసుకొని యొకడు తేయాకు నీటి నమ్ముచుండెను. ఆ గ్రామ మందలి జను లుషయముననే లేచి పనిపాటలకేగుచు నాను కాణము కడకువచ్చి తేయాకునీటిని ద్రావిపోవుచుండిరి.

ఆదుకాణదారుడు బీదవాడు. అందువలన తేయాకు నీటినమ్మి జీవించుచుండెను. నమ్మకస్థుడగుట వలన నీతని బేరము క్రమముగ వృద్ధి కాజొచ్చెను. తెల్లవారునప్పటి కీతని దుకాణమునకు వందల కొలది జనులు వచ్చి తేనీళ్ల్రద్రావి పోవుచుండిరి. ఈతని కూతురు భార్యయు వచ్చినవారికి తేనీటి నందించుచుండిరి. ఆతడు సిద్ధము చేయుచుండెను.

కొన్ని వత్సరములు గడచెను. ఆతడు ధనికుడాయెను. అప్పుడాతడు గడ్డిపాకను విప్పివైచి కొయ్యతోడ మంచి మందిరమును గట్టెను.

'యోసకురా' అనుచెట్టు వలననే వీనికి దరిద్రముపోయి భాగ్యము వచ్చిన దని యెల్లరనుకొనజొచ్చిరి. ఆతడునునీ చెట్టువలననే భాగ్య మబ్బినదని సంతసించుచు దానిని దైవసమముగ బూజించుచుండిన కొలదిని దానియందాతనికి ప్రేమమిక్కుటమాయెను. అందువలన దాని సమీపమున కెవనిని బోనీయకుండెను.

ఈతని యైశ్వర్యము గూర్చి జనులు చెప్పుకొనిన కొలదిని చెట్టును చూచుటకు జనులు గుంపులు గుంపులుగ వచ్చుచుండిరి. ఆచెట్టుకొమ్మను రెమ్మను చివరకు రెబ్బనయినను దీసికొని వచ్చియింట నుంచుకొనిన యెడల మహదైశ్వర్యము గలుగునని జను లనుకొనజొచ్చిరి.

ఒక దినము రెండుగంటల వేళయందు కాణ దారుడు కూర్చుండి యుండెను. అప్పుడు మొలయందు కత్తియు, చేతనొక బాకును గలిగిన సైనిక వేషమున నున్న హంతకు డొకడు వచ్చి యాతని చూచి కఠోరస్వరమున నిట్లనియె 'యోసకురాను చూచుటకు వచ్చితిని"

దుకాణదారునకు వాని చూపులకు—మాటలకు—కోపమువచ్చియిట్లనియె "చూచుటకు వచ్చినావా! చూడు. దానినినేను పెట్టెయందు పెట్టిదాచలేదే?

హాంతకుడు:- దాని కొమ్మనాకు గావలయును? ఆకొమ్మయుండిన దరిద్ర ముండదని చెప్పుకొను చున్నారు. అందు కొరకు వచ్చితిని.

దుకాణదారు:— ఈయను. ఇచ్చుటకు వీలులేదు. దూరమునుండి చూడవలసినదే కాని దాని నెవ్వరు ముట్టగూడదు. ముట్టనీయను.

హాం:— (వచ్చుచు) నీమాటలకు భయపడి వెళ్లు వాడనుగాను. నాకా కొమ్మ గావలయును.

దుకా:— నీకుభయ మున్నను భయములేకున్నను నీ కాకొమ్మ మాత్రము లభింపదు. వెళ్లు. ఈమాట లకు హాంతకుని శరీరము కంపింపజొచ్చెను మరు మాటాడక వరలోని కత్తిని లాగి చెట్టుకడకు పరువిడెను. దుకాణదారుడు గూడ పరువెత్తుకుని వెళ్లి ఖబర్ దార్ చెట్టును ముట్టుకుంటివా ప్రాణములు దక్కవు. అనెను.

దుకాణ దారుని మాటల నాతడు లక్ష్యపెట్టక కత్తితోడ చెట్టును గొట్టెను. దుకాణ దారుడు రిక్కవచెట్టును కౌగలించుకొనెను. ఆతనికత్తి యాతని శరీరము మీదబడెను.

ఆతని మరణము తోడ దుకాణము బోయెను. అతని భార్యయు, పుత్రికయు దుఃఖమువలన ఆగ్రామమును వీడిరి. అచ్చటి యిల్లు పడిపోయెను. ఆచెట్టు మొండెమాయెను. అందువలన క్రమముగ మొండిపోజొచ్చెను. ఆస్థలమును చూచి నపుడెల్ల నాగ్రామ వాసులుకంట నీరు బెట్టుకొని పాపము "ఏమాయెను. ఆతనిపని" అనియను కొనజొచ్చిరి.

హాంతకుని దారిద్ర్యము వర్ణనాతీత మాయెను. ఒంటి పూట యైనను తిండి దొరక కుండెను. హత్య చేసినాడని యెల్ల రాతని సనహ్యముగ జూడజొచ్చిరి. వాని జీవితము దుర్లభ మాయెను. "మోసాకురాను నరికినవానిపనియింతకంటె యేమగును" అనియనుకొన జొచ్చిరి.

ఈమాటలు విన్నకొలదిని హాంతకున కాగ్రహము వచ్చు చుండెను. తిండిలేక మలమల మాడుచు ఆచెట్టును కుంకుటి వ్రేళ్లతో పెల్లగింతు ననుచుండెను.

హాంతకుని తండ్రి ముసలి వాడు. ఆతడు కొడుకును జూచి యిట్లనియె. "నాయనా? ఇదివరకు చేసినపని వలన మనకీ గతి పట్టినది. తిండిలేదు. ఎవ్వరు దగ్గరకు రారు-రా నీయరు-ఇక ముందేమి గానున్నదో? ఆచెట్టుజోలికి పోవలదు. నామాటవినుము"

ముసలివాని మాటలు వినక వాడా రాత్రియే చెట్టుకడ కేగెను, ఘోరాంధ కారము. ఆచెట్టు మృత్యు భయమువలన గజగజ లాడజొచ్చెను. హాంతకుడు ఆచెట్టు నుండి బయల్వెడలిన మర్మర శబ్దమునకు నవ్వ జొచ్చెను.

ఆచెట్టు మనుష్యకంఠమున "చంపకు-నన్ను చంపకు— చంపిన యెడల నీకు కీడు మూడును!" అనియెను.

మనుష్య కంఠము నుండి వెల్వడిన యామాటలవిని వంతనే యాతని శరీరముగ గుర్పొడిచి వణుకుచు నిలుచుండి కొంతవడి కిట్లనియె, "కీడుగాని మేలుగాని నిన్ను చంపక విడువను"

చెట్టు:—యోచించుకో? జాగ్రత్త, నన్ను ముట్టుకుంటివా నీ దుర్గతి కంతేముండదు?

ఈమాటల కాతడు నవ్వ సాగెను. ఆచెట్టు భయకంపితమై కదల జొచ్చెను. వరనుండి కత్తిదీసి చెట్టుపై నొకదెబ్బ వేయ యాచెట్టునుండి యార్తనాదము వెల్వడెను. ఆనాదము వలన హంతకుని ప్రాణము కలత చెందెను.

చంద్రోదయ మాయెను. అప్పుడు హంతకుడు కత్తి చూడ నెత్తురుండెను. ఇదేమి! చెట్టున రక్తముండునా! చెట్టునందు మానవరక్తమా?

బాగుగ వెన్నెలవచ్చెను. చెట్టునుండి తెగి మానవుని తలయొకటి క్రింద బడెను. ఇదేమియని యులికిపడి చూడ అదియా హంతకుని తండ్రితల.



## నిరీక్షణము.



మాటి మాటికి భవన కవాటములను
దెరచి, నిరాశతోడను, యియ్యెరుల త్రోవ,
నెదురు చూచెడి వేళలందెదియొ కాని,
నాదృగంతాళి నల్లన నూడిపోవు,
"ఎవరికై యొంటి నెదురు చూచెద" వటంచు.

అంత, మృత్యుగభీరముఖాగ్రమంటు
దుర్భరతమో విభావరిఁ దొంగిలించి,
ఎవరితోనేమి చెప్పుకోనెఱుఁగ లేక;
నావిధుర విభ్రమమున, "నానాథుకొఱకు
ఒంటి, జూతునం" చల్లన నూనుకొందు.

ఈశ్వర.



# కోకిలాకాకము.

(చిరావూరి కామేశ్వర రావుగారు.)

## తృతీయ వీచిక

తన ద్వితీయవివాహముదలంచుకొనుచు,
తనజన్మము విషమ పరిణామమొంది,
నిష్ప్రయోజనమయ్యె నని దుఃఖపడుచు,
ముసలిరాజు కడకు ప్రాణంబు విడచె!

రాజేంద్రు మరణంబువిని లోకులంత
కడుదుఃఖితాత్ములై, "రాపత్ని యకట!
ఇంతచేసెను!— దాని హృదయంబు రాయి!—
మారాజు, సుగుణాలకుప్ప, మా కెటులు
దక్కు—''నని వచించి, కోపంబు వడసి.
అంతఃపుర ప్రదేశము జొచ్చినారు!

ప్రజల కోపావేశమును దాళలేక
భైరవీకన్య చండిక నాత్మఁదలఁచె!
అద్దేవి వైళంబ యురుకెంచియపుడె
యామెను వహియించి యరిగె కోవిలకు.

ఎదిరించి దుర్భాషలాడు దుర్మతిని,
రాజపత్నిని కేశములు బట్టియీడ్చె,
సూదిరాళ్ళతో గొట్టి, కేకలేయుచును,
కసిదీరగాఁజంపి, గుంపుగాగూడి
పరుగుపరుగున లోనికిబోయి వారు,
భైరవిన్వెదకుచుఁ గానంగలేక,
కడకు ఖైదులో మనో వ్యాధిపీడితను
లావణ్యతిలకను వీక్షించి భక్తి
దళుకొత్త గద్దెఁ గూర్చుండఁబెట్టి,
తమరాజ్ఞిగా నెంచుకొని సంతసిలిరి!

రాజదండము బూని లావణ్యతిలక
హితముగా రాజ్యమేలెను కీర్తివిరియ;
గాని గంభీరనిగూఢ దుఃఖమును
దేవుఁడేతప్ప యెవ్వరెఱుంగగలరు?

కొన్నాళ్ళ తరువాత యామహారాజ్ఞి
కొలువులోఁ దనమంత్రులను జూచియనియె
"మంత్రిసత్తములార! మనరాజ్యలక్ష్మి
అతివిశాల యశోవతియగుట కరయ,
మీనేర్పుగలబుద్ధి మూలకారణము!—
నేఁడు నేనొక కార్యమును దీర్పనెంచి,
పోవుచున్నాను దూరము,— మీరలిచట,
సముచితంబుగ రాజ్యభారంబుపూని,
ప్రజలసౌఖ్యములందుగను వీడకపుడు.
పరిపాలనము సేయుఁడీ!— పోయివత్తు!"

అని చెప్పి లోపలికేగె యాదేవి,
నవరత్నములును బంగరు ముద్దునగలు
గలసంచి వీఁపున దాల్చి యారాత్రి,
పరిచారికలుచాల యాశ్చర్యమొంద,
మూఁగవోలెను నేరితో మాటలేక,
నడచిపోయెను, దక్షిణపథంబువట్టి!

అటచండికాదేవి పటుసాహసమున
భైరవి నివహించి నిమిషంబులోన,
కుంతలాధిపు సౌధమున మేడపైని,
విడచి నిజాలయోన్ముఖియయ్యె, నంత
కుంతలేశుఁడు భైరవిని గాంచి భయము
దళుకొత్త, "ఓకాంత ఎపుడువచ్చితివి?
పురములో నీవారు సుఖమున్నవారె?"
ఆపల్కు లావణ్యతిలక క్షేమమును
దెలియనభిలాష వొడమ, యోజించి,
రాజకులావతంసుఁడు మిన్నకుండె;
నాటఁగోలెను భైరవి ప్రమోదముంది
యధికారము రుచింపఁ జనవారి మఱచె;
కుంతలేశుఁడు మనోవ్యాధిపై కొనఁగ
నానాటికి కృశించి సగమయ్యె నకట!
లావణ్యతిలక దుర్భర కారసూని,
భయదాటవులుదాటి యొకనాటి రేయి,
నొకపల్లెటూరిలో బసచేసి, యచటి
జనులతో మాటాడునపుడు దగ్గరనె
కుంతల నగరంబు గల మాట దెలిసి,
యానంద బాష్పంబులొలయ, మోదమునఁ
దెల్లవాఱకముందు బయనంబు జేసి,
సుప్రభాత విమల మలయానిలంబు,
శాంతిప్రదానంబు జేయ సత్వరము,
అరుదెంచె నొక మహారణ్యవాటికకు!
కడు పురాతనమైన వటవృక్షవితతి,
వాటిమధ్యను పూలపొదరిండ్లవరుస,
వాటి కిరుగెలంకులతమాల తరులు,
వాటిపైఁ బెనఁగి ప్రాకెడు ముద్దులతలు
తరళయుషస్సమాగమ భాగ్యమొంది,
అభినవసౌందర్యమున వెల్లివిరిసె!
ఆప్రభాతంబున లావణ్యతిలక,
కొంతదూరముపోయి యేకాంతమందు
మృదుమందకల నాదమున వెల్లివోవుచు
నొక స్రవంతినిఁ గాంచి, భారంబుదించి,
స్నానాదికాల్యంబులను దీర్చి, మరల,
బరువుతోఁ బసిఁడి వెల్లువతీరమందు,
కొంతదూరముపోయి, నొకగొల్లవాని,
చూపుమేరను గాంచి, పోయి దగ్గరకు,
రత్నమొక్కటివాని చేతిలోఁ బెట్టి
"ఓయన్న! కుంతలనగర మిచ్చటికి,
ఎంతదూరము, చెపుమా! పుణ్యముండు!
అనవుడు గొల్లవాఁ డామెతోననియె
"ఓయమ్మ! కుంతల ప్రాంతభూములకు
వచ్చితివి ప్రయాసమును బొంది యకట!
ఈబరువుల మోత కేమి కారణము?
నీమోముజూచిన, రాపుత్రివోలెఁ
దోచుచున్నావు! నీకీకష్టమేమి?
అని చాలకనికారమునఁ బల్కె వాడు,
ఆరాజ్ఞ కెఱిగించె నగరంబుదారి.
పోఁబోవ నవ్యక్తధ్వానంబుతోడ
పెల్లుబ్బు నగరంబు గనువిందుగొలిపె
అతుల మహోన్నత సౌధపాళికలు,
బహువస్తు విస్తుల విపణిమార్గములు,
అందందు మందిరోపరిభాగములను
నిండి వీతెంచు మాధుర్యగానములు,
నగుమొగంబుల ప్రజానివహంబు గలిగ,
నగరీలలామంబునై వన్నెకెక్కు
కుంతలనగర ప్రవేశంబు జేసె,
లావణ్యతిలక నెమ్మది దాటువిడఁగ
ఆదినంబున సచివుఁడు భక్తిగదుర,
పార్వతీ మందిరాంతరసీమకేగి,
శివురాణి నుతియించి, యేతెంచునపుడు,
ధూళిధూసర జీర్ణవస్త్రంబుదాల్చి,
ముద్దుమోమున మనోదుఃఖంబుదోఁప,

వినయవినమితాంగియై భారమూని,
మెల్లగా సోపానముల నెక్కుదాని,
లావణ్యతిలకఁ గాంచి, 'యోయతివ!
ఎందుండి యేతెంచుచున్నావు నీవు?
నీవారలెవరైనఁ గలరేని చెపుమ!"

అనవుడు లావణ్యతిలక యిట్లనియె;
"భూరి దయార్ద్రబుద్ధిగల మహాత్మ!
మీరాజు, గుణరత్ననిధి యంచు జనులు,
వేనోళ్ల వినుతింపఁ జూడఁగాఁ దలఁచి,
వచ్చితిని, కృపాలవాల! నన్నతని
కడకు గొంపొమ్ము, నిమేలు నేమఱువ!"

అనివల్క సచివుండు కరుణార్ద్రుఁడగుచు
"ఓ కాంత! కుంతలేశుఁడు గాఢదుఃఖ
వివశాత్ముఁడై యెరితో మాటలేక,
యేకాంతగృహమున, నన్నపానములు
మఱచి, దుర్భరవియోగాగ్ని గ్రాగుచును
ఎన్నిబోధించిన నిసుమంతవినక,
ప్రాణావశిష్టుఁడై యున్నాఁడు గాన,
అతని దర్శన భాగ్యమతివ! నీకిపుడు,
కడు దుర్లభము గాని, యొకమాట గలదు.
చండికాదేవి యాజ్ఞానుసారముగ
అతఁడు మంగళవారమున నిందువచ్చి,
భైరవి కన్యను బలియంబగును.
అపుడు నీవాతని దర్శింతువేని,
నీకోర్కె నెరవేరు పోయివచ్చెదను"

అనవుడు "మిత్రుడా!" యనిపిలిచియామె
చూపులకనికారమొదవ నిట్లనియె;

నేనీ మఠంబున వసియించుదాన,
దయతోడ నీరాత్రి యొకసారిరమ్ము"

అతనాతఁ డనియె, "యమ్మ! నీమాట
శిరమునఁ దాల్పంగ నభిలాష గలిగె!
కాని కుంతలరాజు నామనోసఖుడు
ననుబుచ్చి సాదరముగ మాటలాడి
"చండికా మందిరమున కేగు" మనియె.

"తెలుపంగవగు నేని యంతేగుటకును
కారణం బెఱిఁగింపుమిదా, ధర్మసచివ!"

అనవుడు సచివుండు కరుణామయుండు
చండికా శాసనముఁ గూర్చి పలికె
"ఈవచ్చు మంగళవారంబు సరికి
ఓతల్లి! నిండును యేడాది గడువు!
అంతఃపురంబునఁ దులలేని నగలు,
పసపు కుంకములు, పూలహారములు,
పసిడి చీరలు పండ్లు తాంబూలములును
గొనపోయి చండికా పాద పద్మముల
కర్పించి, పూజించి, "ఓతల్లి! దయను
లావణ్య తిలకతోఁ గుంతలాధిపుఁడు,
సంసార సుఖమున సమభాగమొంది
నినుగన్నోరంగళ పూజించునట్లు
వరమియ్యవే, యని ప్రార్థింపవలయు!
వేళమించిన మేటికీడు వాటిల్లు
పోయివచ్చెద, నెందు దలపోయకమ్మ

అనిచెప్పి యాతండు నచ్చోటుబాయ,
నుద్యుక్తుడగు నప్పు డతివ యిట్లనియె.

"ఓమిత్రరత్నమా! కడుపుణ్యమతివి!
నీస్నేహ ధర్మము శ్లాఘింప నగును
ఈసంచులందున రత్న సంచయము,
గలదు దోడ్కొనిపోయి, యొసఁగిచండికకు,
నామనోవందనములు జెప్పిరమ్మ!"

అని బరువైన సంచులు ముందుబెట్ట
గొనిపోయెనాతడు,— వనిత వాదించె!—

"కుంతల రాణనైతిని కోర్కెదీరె,
యేడులోకాల నాకెవ్వారిసాటి
లావణ్యతిలక చక్కనిదాననంచు,
మిట్టిపడెనుకదా నాకన్నుగుట్టి

ఇకసంతసింపనీ తనమేలు జూచి?
నామాటగాలిచె! నేననమాననైతి!"
అనిగర్వమున బల్కి భైరవీకన్య
నెత్తి కెక్కిన కన్నుగవతోడనుండె!
లావణ్య తిలక యాదేవాలయమున
పూజారులొసంగు ప్రసాదంబుఁ దినుచు,
కుంతలేశుని స్వాంతమున నెంచుకొనుచు,
దనకీభవంబున సంసారసుఖము,
దుర్లభంబని నమ్మి కన్నీటితోడ
సంతృప్తి వడసి కుంతలరాజ సుతుని
కనులార నొకసారి వీక్షించి పిదప
గహనభూములఁ దపంబొనరింప నెంచె.
గడువు ప్రాప్తింపఁ గుంతలరాజ మౌళి,
తెల్లవాఱిన మోము వైవర్ణ్యమొలుక,
అలసభావము జూఁపుల నలము కొనఁగ,
మాటి మాటికినిస్పృహగలంచి వైచి
విసిగిపోయిన మనోతలమందుఁ బొలయ,
జీవచ్ఛవంబనై నాటికిమ్యోడను,
పోవుచున్నాను! చండికా కోపముడిగి
నన్నురక్షింపుమా? మ్రొక్కి వేడెదను!
భైరవీ కన్యకామణి తప్పునేని
లభియింపకున్నను లావణ్యతిలక,
సంతోషమునఁ గాలమును బుచ్చువాడ!"
అనిబాష్పములు రాల ప్రేల్లేడ్చియతడు
మంగళవారమునాటి వేకువను
పార్వతీ యాలయమున కేగనెంచి
భైరవినిబిలిచి "ఓకాంతరో నేడు
చండికాదేవి యిష్టము బూనిమనము
పెండ్లాడవలయు దప్పినచేటుమూడు"
అనవుడు భైరవి కడుసంతసమున
వరభూషణాంబర ధారియైనడచి
యతనితోగిరి పుత్రికామందిరమున
వాద్యఘోషణ పరంపర పెట్లుకొనఁగ
జనులు సంతసమొంది యున్నంది బాగడ,
నిలిచి మహానందమున మేనుమరచె!
సచివోత్తముడు చండికను వీడుకొలిపి,
యరుదెంచె వాడిపోయిన మోముతోడ;
లావణ్య తిలక కుంతల నాథువైపు
జూచిపలుకు లేక తలవంచెనకట,
కుంతలేశుడు దూరముననామెగాంచి
యుత్తరక్షణమున బరుగెత్తిపోయి
ఓమనోహారి! ప్రాణనాయకీ యిట
నీకీతి దురవస్థ కెట్లువచ్చితివి?
కటకటా నారాజ్యమున కేగుదెంచి
యిట్లుండు నేముద్దులావణ్యతిలక?
అనిలేవనెత్తి "హా" యని కౌగలించి,
కన్నీటివరదలోవల మునిగిపోయె.
భైరవినాడు చండిక చెప్పినట్లు
పెండ్లిదినంబున దన్నువీక్షింప
నేతేరమికి నాగ్రహోదగ్రయగుచు
"ఓసీ దుర్నీతి ఇంతపాపిష్ఠి వనుచు
స్వప్నమందైన నే దలపోయలేదు."
అని తిట్టి తిట్టిన చండికాదేవి
పార్వతీ నిలయంబున కుబోయి నిలిచె
అచటలోకులు విస్మయంబందిచూడ.
కుంతల నృపుడును లావణ్యతిలక
ఆదేవతామూర్తి కెదురుగావచ్చి
సాగిలి కరపద్మములు మోడ్చియునిరి.
"ఓమాత మాయందు దయజూపిమమ్ము
గాపాడి మాయిల్లు నిలబెట్టుమమ్మ"
అనవుడు కళ్యాణమగుగాత మనుచు
దీవించి కనుల మంటలు రాలిపడగ
"భైరవీ! నీవెంతటి కృతఘ్నమతివి
గర్వాంధురాలవై నామాటమరచి

అతులవైభవ మబ్బెనని పొంగినావు!
నేడాదిగా నీవు కాకిరూపమున
దిక్కుమొక్కును లేక దేశదేశములు
దిరిగి వేసారెదవు; తిరుగులేదు"
అని యాతలో మాయ మైపోయెనామె.

గిరిపుత్రి సాక్షిగాఁ గుంతలాధిపుఁడు
లావణ్యతిలకను బెండ్లాడి, రెండు
రాజ్యంబులను బొంది ప్రేమరాజ్యంబు
నామెతో నేలె నేకచ్ఛత్రముగను
కాకిరూపము బొంది భైరవీకన్య
"కావు! కావు!" మటంచు దిరిగె నెల్లెడల.

# భగవద్గీతావళి.

(శ్రీరాజా మంత్రిప్రగడ భుజంగరాయ ప్రణీతము.)

త్రయోదశాధ్యాయము.

వ. అంత నర్జునుండిట్లనియె.
గీ. ప్రకృతి యెయ్యది? పురుషుఁ డెవ్వండు? క్షేత్ర
మనఁగ నెయ్యది? క్షేత్రజ్ఞుఁ డన నెవండు?
ఎద్ది జ్ఞానంబనంగ? జ్ఞేయ మెద్ది? చెప్పుము.
వ. అంత శ్రీకృష్ణుం డిట్లనియె.
తను వెనిగదింపఁబడియె క్షేత్రమనఁ బార్థ
దాని నెఱిఁగెడువాఁడె క్షేత్రజ్ఞుఁ డనఁగ
నెల్లతనువుల క్షేత్రజ్ఞుఁడే నేను సుమ్ము;
అరసి క్షేత్రంబు క్షేత్రజ్ఞు నెఱుఁగునట్టి
జ్ఞానమెయ్యది యదియే సుమీ! జ్ఞానమనఁగ
మొదల నిక్షేత్రమేదో! యెట్టిదియొ! యద్వి
కారమో దేనినుండేది గలిగెనొక్కొ?
మఱియు క్షేత్రజ్ఞుఁ డెవఁడో? తన్మహిమ యేదో!
తెలియఁబల్కెద సంగ్రహస్థితిని వినుము
బహువిధంబుల ఋషులచేఁ బల్కఁబడియె
బహువిధామ్నాయములు జొత్తిపల్కెదివి
యుక్తియుక్తంబులును నిర్ణయోజ్జ్వలములు
నైన సద్బ్రహ్మసూత్రంబులను నుదించె
నైదు భూతంబులును బుద్ధ్యహంకృతులును
మాయయు దశేంద్రియంబులు మానసంబు
నింద్రియార్థంబు లైదును నిచ్ఛపగయు
సలజడి సుఖంబు దేహేంద్రియాదిగణము
శాంతవృత్తియు మఱియు ధైర్యంబు నెడు
నిదియె సవికారమగు క్షేత్రమెల్ల నిపుడు
సంగ్రహంబుగఁ జెప్పితి పరగ నిక
మానరాహిత్యమును దంభహీనతయును
బరమ శాంతియు హింస నిర్వక్రతయును
సద్గురూపాసనంబు నిశ్చలత శుచిత
స్వాంతనిగ్రహము నిరహంకృతియును
జన్మమృత్యు జరావ్యాధి సకలదుఃఖ
సంతతులయందు దోషదర్శనము విషయ
నిస్పృహాత్వంబు సుత తరుణీ గృహాదు
లందు నాసక్తి లేమి నిత్యంబు మదిని
బాధవస్తుంబులందుఁ దుల్యస్వాదమతయు
నితరమెఱుఁగక నన్నె సద్గతిగ నెంచి
మించు నిశ్చలభక్తి సేవించుటయును
జనసభవిరక్తి నిర్జనస్థల సుసేవ
నిశ్చలాధ్యాత్మవిజ్ఞాన నిశ్చితయును
తత్త్వవిజ్ఞానమున నర్థదర్శనంబు
నిదియె జ్ఞానంబనఁగఁ జెల్లు నింతకన్న
నితరమైనది యజ్ఞానమింక నిక
జ్ఞేయమెద్దియొ తెలియఁజేసెద వినుము
దాని నెఱిఁగిన మోక్షంబు నావరించు
నాపరబ్రహ్మమాది లేనట్టిదిసుమీ!
సత్తుగాదది మఱియు నసత్తుగాదు
సర్వతః పాణిపాదంబు సర్వతోక్షి

సదసద్విలక్షణంబు సర్వతః పాణిపాదకర్ణ
ముఖమగుచు జగమున సర్వంబు నావరించు
నింద్రియ గుణానుగతమట్టు లెసఁగియైన
నింద్రియవివర్జితంబగు నెయ్యెడలను
నంటనిదియైన సర్వంబు నవధరించు
గుణరహితమయ్యు గుణముల గుడుచుచుండు
భూతముల బహిరంతరంబుల వసించు
స్థావరము జంగమంబు సూక్ష్మంబుగానఁ
దెలియరానిది చెంతదవ్వులను నదియె
అరయనవిభక్తమయ్యును బ్రాణులందు
నొలిఁ బ్రవిభక్తమైనట్టులుండు నదియు
భూతసృష్టిస్థితిని నాశముల నొనర్చు
నట్టిదయ్యుఁ దేజములకెల్ల నదియె తేజ
మదియె తమమున కన్న నన్యమనఁబడును
జ్ఞానగమ్యంబు జ్ఞేయంబు జ్ఞానమఖిల
హృదయనిలయంబులను వసించినదియు
సంగ్రహంబుగఁ జెప్పెద సరగ నిట్లు
క్షేత్రమును జ్ఞానమును మఱి జ్ఞేయపదము
వానినెవ్వండెఱుంగు మత్పరమభక్తుఁ
డతఁడు మద్భావమునకు నర్హతముఁడగును,
ప్రకృతిపురుషులను నను వీయుభయము లనాదు
లనియెఱుంగుము మఱియును బుద్ధ్యాది వికృతు
లును గుణంబులుఁ బ్రకృతివల్లనె జనించుఁ
బ్రకృతి యనునది కార్యకారణవిధాన
మునను బురుషుండు సుఖదుఃఖభోగమునను
హేతువులు జుమ్ము ప్రకృతిఁ దాఁ జెనఁగి ప్రకృతి
జనితగుణములఁ బూరుషుండనుభవించు
పుణ్యపాప జన్మంబులఁ బొందమనితని
కలగుణాసక్తి కారణంబగును జుమ్ము
సాక్షియును మోదకుఁడు మహేశ్వరుఁడు భోక్త
భర్త పరమాత్మయనను ననఁబడెడు పురుషుఁ
డీతనువునందు నుత్కృష్టుఁడై తనర్చు
బురుషుఁ బ్రకృతిని దద్గుణంబులను నెవ్వఁ
డేగతి నెఱుంగు మఱి వాఁడెన్నివిధము
లేనివర్తించుచునను బుట్టఁడిలను మఱల
గొందఱాత్మను హృదయంబునందు మనసు
చేతఁ గందురు కొందఱు చెల్వమీఱు
సాంఖ్యయోగంబుచేత నిష్కామకర్మ
యోగమునఁ గొందరును గందురుత్తమముగఁ
గొందరు తమంతట నెఱింగి కానఁగలేక
యొరులచే విని ధ్యానించు రొప్పిదముగ
నట్టివారును శ్రుతిపరాయణులుగాన
మృత్యుసంసారపదమును మించువారు;
ఇలఁ జరాచరవస్తు వేదెంత పొడము
ప్రకృతిపురుష సమష్టి నుత్పన్నమగు
సర్వభూతంబులను దుల్యసరణినుండి
యవి నశించిన నశింపకలరునట్టి
పరమపూరుషుఁ గాంచిన వాఁడె ద్రష్ట
అన్నిప్రాణుల సమరీతినధివసించు
నట్టి యీశ్వరుఁ గాంచువాఁడాత్మచేత
నాత్మ హింసించువాఁడు గానందువలనఁ
గాంచునుత్తమమైన మోక్షగతి నతఁడు
సకలవిధముల కర్మము ప్రకృతిచేతఁ
జేయఁబడుచుండెనని బుద్ధిచే నెఱుంగు
వాఁడాత్మ నకర్తగా నపుడెఱుంగు
ప్రాణిసంజాతముల పృథగ్భావ మొకటఁ
దనరునని యందువలన నుత్పత్తియనియు
మదినెపుడెఱుంగునపుడ బ్రహ్మయగు నతఁడు!
అవ్యయుండగు నీపరమాత్మ నిర్గు
ణుండును ననాదియౌటచే నిందిమేన
నుండియును గర్తయే భోక్తయుండెగాదు
సర్వగతమయ్యు మిన్ను సూక్ష్మమయియుంట
నెందునంటనివైవడి నీపరాత్మ
యఖిలదేహంబులందుండి యంటఁడెందు
లోకబాంధవుఁ డొకఁడీలోకమెల్లఁ
బ్రజ్వలింపఁగఁ జేసిన పగిది క్షేత్ర
మెల్ల క్షేత్రజ్ఞుఁ డొకఁడుల్లసిల్లఁజేయుఁ
దనర క్షేత్రంబునకును క్షేత్రజ్ఞునకును
బరగునది యంతరంబును బ్రకృతిభూత
మోక్షము నెఱుంగ బ్రహ్మంబుఁ బొందఁగలరు.

## చతుర్దశాధ్యాయము.

వ. మఱియు శ్రీకృష్ణుండిట్లనియె.

గీ. జ్ఞానములలోన నుత్తమజ్ఞానమిపుడు
మరలఁ దెల్పెద నిలదాని మహిమ నెఱిఁగి
తపసులందఱుఁ బరమపదంబుఁ గనిరి;
యీపరజ్ఞానమును నాశ్రయించి నా స్వ
రూపమును జెందినట్టి యారూఢమతులు
సృష్టిసమయంబునను జనియింపఁ బోరు
ప్రళయకాలంబునను బాధపడరు సుమ్ము
ప్రకృతి నాయది భూతకారణము దాని
యందు గర్భంబు నుంతు నేనందువలన

భూతములకెల్ల నుత్పత్తి పొసఁగుపార్థ!
అఖిలయోనుల మూర్తు లెయ్యవి జనించు
వానికెల్లను బ్రకృతి యుత్పత్తి పదము
నేను బీజప్రదుఁడగు తండ్రి నిజమయ్య
ప్రకృతి సంభూతమైన సత్త్వము రజంబు
తమమనాఁ బడు త్రిగుణత్రయము నిరత
మవ్యయుండగు దేహి దేహంబునందుఁ
బట్టి బంధించు, నందు సత్త్వము విశుద్ధ
మగుటచేతఁ బ్రకాశము ననామయంబు
నగుచు బంధించు జ్ఞాన సుఖానసక్తి
రజము రాగాత్మకము మనోరథమువలన
సంగము ననుజనించు నిచ్చమెయి దేహిఁ
గర్మసంగంబుచేత నాఁగట్టుచుండుఁ
బుట్టు నజ్ఞానమునను తమోగుణంబు
దేహులకు నెల్లమిగుల సమ్మోహనంబు
మాంద్యమున నిద్రచేతఁ బ్రమాదమునను
బట్టి బంధించుచుండు నీ ప్రాణితతిని
సౌఖ్యమునఁ గూర్పుచుండును సత్త్వగుణము
పొరిదిఁ జేయించుఁ గర్మ రజోగుణంబు
తమము తెల్వి నణఁచి ప్రమాదమునఁ గూర్చు
తమము రజము నణంచి సత్త్వ ముదయించుఁ
తమము వర్ధిల్లు రజము సత్త్వము నణంచి
సత్త్వము తమంబు నణఁచి రజంబు బెరుగు
నీతనుద్వారముల నెల్ల నెసగ మెసఁగ
జ్ఞానమయ తేజ మెప్పుడు జనన మొందు
నపుడు సత్త్వాభివృద్ధి యటంచు గనుము
రజము వర్ధిల్లఁ గోర్కులు ప్రిథిన మొందు
లోభ ముదయించు కాంక్షనాలోకనాగమనిన
కర్మలాచరింప యత్నంబు గల్గు మదిని
తమము వర్ధిల వేళ జ్ఞానము నశించుఁ
గార్యకరణేచ్ఛ దొలఁగు సంఘటిలు మోహ
మావహిల్లుఁ బ్రమాదంబు మాపదంబు
సత్త్వగుణవృద్ధి వేళ జనుఁడు మేను
విడుచునాతండు సద్బ్రహ్మ వేత్తలైనయు
విమలలోకంబులను జెందు విశ్రుతముగఁ
దగ రజోవృద్ధి వేళలఁ దనువు దొరఁగు
వాఁడు మానవజన్మంబుఁ బడయుచుండు
తమము వర్ధిల్లు వేళఁ గాయముఁ ద్యజించు
వాఁడు పశుపక్షి జన్మలఁ బడయుచుండు
సుకృతకర్మకు సత్త్వవిశుద్ధఫలము
తామసమునకున వివేకితయే ఫలంబు
సత్త్వమున జ్ఞాన మొదవు రజంబు వలన
మలయు లోభంబు మఱియుఁ దమంబువలన
మసలు నవివేక మోహ ప్రదానములను
సాత్త్వికుల కూర్ధ్వగతియు రాజసుల కెన్న
మధ్యగతియు నికృష్టసంబంధవృత్తి
గుణసమన్వితులగు తమోగుణుల కధమ
గతియును లభించుచుండు సుక్రమము గాగ;
ఉత్తముఁడు గుణములకన్న నొరుని కర్త
నెపుడు గనఁడో! గుణాతీతు నెపుడు గనునో!
అపుడు మద్భావమును బొందునతఁడు నిజము
తనుభవంబగు త్రిగుణత్రయము మించు
జనుఁడు జన్మజరామృత్యు జనితదుఃఖ
తతిని విడనాడి మోక్షపదంబు నొందు.

వ. అంతనర్జునుం డిట్లనియె.

దేవ! యేచిహ్నముల చేత త్రిగుణములను
మీఱి వర్తించు! నెట్టి యాచారపరుఁడు
త్రిగుణములనెల్ల మించి వర్తించువాఁడు!—

వ. అంత కృష్ణుం డిటులనియె.

పార్థ! సత్త్వరజస్తమ ప్రభవమైన
భావములు సంఘటిల్లిన వైరపడక
తలగిననుఁ గోరబోక మధ్యస్థుఁ డట్లు
లుండి గుణములఁ జనసంబు నొందఁ బోక
గుణములె ప్రవర్తిలు నటంచు గోప్యగతిని
దలచి చరియింపనట్టి యాతండు తుల్య
మార్గదుఃఖుండు తుల్యలోష్టాశ్మ కాంచ
నుఁడు తుల్యప్రియాప్రియుండును స్థిరుండు
తుల్య నిందాస్తవుఁడు నౌ దుల్యమిత్ర
శత్రుపక్షద్వయుండును స్వస్థమతియు
దుల్యమానావమానుండు దూరముక్త
సర్వకార్య ప్రియత్నుఁడౌ సజ్జనుండు
ధాత్రిని గణింపఁబడు గుణాతీతుఁ డనఁగ
నిశ్చలంబైన సద్భక్తి నియతిచేత
నన్ను గొల్చెడివాఁడే గుణములమించి
యాధి మెఱయంగ బ్రహ్మస్వరూపుఁ డగును;
అవ్యయంబైన మోక్షరాజ్యంబునకును
ధరణి శాశ్వతమైనట్టి ధర్మమునకు
ముఖ్యమైనట్టి ఘనసుఖంబునకు మఱియు
బ్రహ్మమునకును నేనె యాశ్రయుఁడఁ జుమ్ము.



# భారతీయుల రాజనీతి.

——:0:——

( వి. వేంకట రంగనాథ రావుగారు )

సర్వవిధముల విద్యాభివృద్ధికై ప్రయత్నించుట రాజునకు ముఖ్యకర్తవ్యము. అందువలన రాజు బ్రాహ్మణులకు అగ్రహారములను మాన్యములను ధనకనక వస్తు వాహనముల నొసంగుచుండెను. బ్రాహ్మణులు విద్యనభ్యసించి దానిని జనసంఘమునందు వ్యాపింప చేయుచుండిరి. విద్యార్థులు జీతము నీయవలసిన పనిలేకుండెను. అన్నవస్త్రములకు నెమకులోనకుండిరి. గార్హస్థులు విద్యార్థులకన్న వస్త్రములిచ్చి పోషించుచుండిరి. గురువు చదువు చెప్పుచుండెను. శిష్యునకు భోజన మిడవలసిన బాధ్యత గురువునకు లేదు. బ్రహ్మచారులు 'భవతీ భిక్షాందేహి' అని మధూకర మెత్తుకొని భుజించుచుండిరి. వారము లేర్పఱచుకొను చుండిరి. చదువుచెప్పుట మూలముగ వచ్చుధనముతోడ జీవించువానికి యిహపరములు శూన్యమని శ్రుతులు నుడువుచున్నవి. ఈ యనుశాసనము విద్యార్థులకడ జీతము పుచ్చుకొన కూడదనియేగదా శాసించుచున్నది? నేటికిని భారతవర్ష మందచ్చటచ్చట మారుమూల పల్లెలయందు పురాతన పద్ధతిని నడచు పాఠశాలలు గలవు. గురువు సంరక్షణయందు శిష్యుడుండవలయును. గురువు శిష్యున కన్నవస్త్రములు సమకూర్చుచుండును. కాని శిష్యునినుండి యొకపైసయైన గైకొనడు; గైకొనరాదు. ఈపద్ధతి వలన భారతవర్షమునందు సమస్తవిద్యలు సర్వోన్నత స్థితిని గాంచెను. గ్రీసుదేశమందు కొందరు దార్శనికులు ధనముగైకొని విద్యచెప్పుపద్ధతిని మిక్కుటముగ నిరసించియున్నారు.

భారతీయ విధానమందు శిక్షాబాధ్యతా మూలకము. రాజెప్పుడును వర్ణాశ్రమ ధర్మములను రక్షించుచుండవలయును. ధర్మస్థాపనయే రాజుయొక్క ముఖ్యధర్మము. అందువలన రాజు బ్రాహ్మణాది వర్ణముల వారిని బ్రహ్మచారులు మొదలగు ఆశ్రమవాసులను స్వధర్మమునందు మెలగుచుండునట్లు చూచుచుండవలయును. వర్ణాశ్రమ ధర్మముల రక్షించుటకే రాజు సృష్టింపబడెనని మనువు నుడివెను. శిక్షకత్యుత్తమ కాలము బాల్యము. కావున బ్రహ్మచర్యాశ్రమ ధర్మము ముఖ్యముగ పాలనీయము. రాజకీయ విధిననుసరించి యెల్లరును విద్యకొఱకు గురుకులకడ కేగుచుండిరి. అందువలన శిక్ష మిక్కుటముగ వ్యాపించుచుండెను. వైదికవిద్యతప్ప మిగిలినవిద్యలను సమస్తవర్ణముల వారభ్యసించుచుండిరి. ఆపద్ధర్మమునందు మనువిట్లు చెప్పియున్నాడు. "బ్రాహ్మణులు శూద్రులకడ జ్ఞానశిక్షను పొందవచ్చును. రాజు శిల్పముకళలు మొదలగు వానిజ్ఞానమును శూద్రులనుండి యభ్యసింపవలయును" మనువు అభిప్రాయానుసారము శిల్పవిజ్ఞానమును శూద్రులే యభ్యసించుచుండిరి. విదురుడు శూద్రుడు, ధర్మవ్యాధుడు శూద్రుడు. వీరికడ నీతిజ్ఞాన శిక్షను పొందినవారెందరో గలరు. ఆవిషయము పురాణములయందు గన్పట్టుచున్నది. మహా

భారతము పంచమవేదము. దానిని పఠించుట కధికారమెల్లరకుగలదు. "శ్రావయేచ్చతురో వర్ణాన్" అని శాస్త్రము చెప్పుచున్నది. ఇందువలన శూద్రులకు విద్యాధికారము లేకుండ జేసినారనుటకల్ల. ధృతరాష్ట్రుడు క్షత్రియుడు. విదురునివలన సమస్తధర్మములు గ్రహించెను. కృషి- వాణిజ్యము- పశుపాలనము మొదలగువానిని కృషకుల నుండి యభ్యసింప వలసినదని రాజధర్మముల యందు మనువు చెప్పెను. త్రివర్ణములవారును విద్యనభ్యసించి తీరవలయు ననుటయందు మతభేదము లేదు. శూద్రుల విషయమున మాత్రము మతభేదము గాన్పించుచున్నది.

అధ్యాత్మిక విద్యాదానమే సర్వోత్తమ దానమని భారతవర్షమందు బరిగణింప బడుచుండెను. ఈ విద్యను పరావిద్యయందురు. పరావిద్యవలన బ్రహ్మపదార్థము లభించును. అందువలననిది యతులనీయము. శిక్షయొక్క చరమలక్ష్యము జ్ఞానార్జనము. ఇదియే పరమపురుషార్థము. దీనిని సంపాదించుటకు నిరంతర పరిశ్రమ చేయుచుండుటవలననే బ్రాహ్మణునకగ్రస్థానము లభించినది. జ్ఞానభూమిమీద భారతీయ సంఘము నిర్మింపబడినది. శిక్షతోడ యనుష్ఠానము గూడనుండవలయును. అందువలన భారతీయ విద్యార్థులు గురువుకడ శిక్షను, అనుష్ఠానమునుగూడ నభ్యసించుచుండిరి. పరావిద్య సర్వోత్తమమైనది. దాని తర్వాతవిద్యను యపర విద్యయందురు.

జనసాధారణమునకు శిక్షనొసంగుటకు రాజకోశమునుండి ధనమొసంగుచుండిరి. శిక్ష నొసంగువాడు బ్రాహ్మణుడు. లేక రాజప్రతినిధి. శిక్షాక్రమముల నిర్ణయించు బాధ్యత బ్రాహ్మణుల హస్తమందుండును. ధనమొసంగి యాధనముసరిగ వినియోగపడుచున్నదా లేదా యనువిషయమును గమనించుట యందుమాత్రమే రాజునకధికారము గలదు. ప్రజారక్షణము క్షత్రియధర్మము. అటులనే జ్ఞానార్జనము జ్ఞానవితరణము అనునవి బ్రాహ్మణధర్మములు.

బ్రాహ్మణస్య తపోజ్ఞానం
తపః క్షత్రస్య రక్షణమ్। (మనువు.)

బ్రాహ్మణునకు తపస్సు జ్ఞానమును, క్షత్రియునకు తపస్సు ప్రజారక్షణము ముఖ్యకర్మలు. దేశమునందు జ్ఞానవ్యాపకమునకు దోడ్పడుచుండుటవలననే బ్రాహ్మణుల కగ్రహారము లొసంగుచుండిరి. ఉపాధ్యాయుడన్నమునకు వెదకుకొన వలసిన పనిలేదు. రాజు భూములు మొదలగువాని నొసగుచుండెను. సంఘమే విద్యార్థులకు గావలసినయన్నవస్త్రముల సమకూర్చుచుండెను. ఇందుల కుపమానముగ నొకకథ నిట నుదహరింతును. షడ్దర్శనములకును టీకను రచించినది వాచస్పతిమిశ్ర. టీకను బ్రారంభింప బోవునప్పుడు రాజుతోడనిట్లనియె "మహారాజా! నా సంసారమునకు గావలసినధన మిచ్చుచుండుము. నేను షడ్దర్శనములకు భావమతియను వ్యాఖ్యను రచింపబోవుచున్నాను" ఆపండితుని కోరిక ప్రకారము రాజుధన మొసంగుచుండెను. నిశ్చింతగా నాతడు వ్యాఖ్యానమును బూర్తిచేసెను. ఆ మహోత్కృష్ట వ్యాఖ్యానము మానవమండలికి మహాధనమై యలరారుచున్నది. "అన్నచింతా చమత్కార కాతరే కవితా కుతః" అని యాతడే చెప్పియున్నాడు. పరమహంసలు మొదలగువారికన్న చింతతోడబనిలేదు. సంఘము వారిని బోషించుచుండెను. బ్రహ్మచారులు, సన్యాసుల కొరకుకొంతయన్నమును దీసియుంచి తర్వాతగృహస్థు భుజించుచుండెను. పరమహంసలు గ్రంథములను, గ్రంథములకు భాష్యములను రచించుచుండిరి. ఆగ్రంథములు నేటికిని యున్నవి.

ప్రాచీన కాలమున భారతవర్షమందు విశ్వవిద్యాలయము లుండెను, కాని యవి యిప్పటి విశ్వవిద్యాలయముల వలెగాక ప్రతిభావంతుడగు వ్యక్తి కేంద్రముగనొనర్చుకొనియుండెడివి. వశిష్ఠుడు కులపతి. పదివేలమందిశిష్యులున్న వానినికులపతియనియందురు. దూర్వాసునకు పదునారువేల మందిశిష్యులుండిరి. బౌద్ధయుగమందు శిక్షకేంద్రీభూతమైయుండెను. నలంద తక్షశిల అమరావతి మొదలగునవి బౌద్ధులశిక్షాకేంద్రములు. బౌద్ధ విహారములు గూడవిద్యకు ముఖ్యస్థానములైయుండెను. పరి వ్రాజకులు దేశ సంచార

మొదట్లో వచ్చుటు విద్యను వ్యాపింప చేయుచుండిరి. గాని వేతనము గైకొను పద్ధతిమాత్రమెచ్చటను లేదు. అయోధ్య, మధుర, హరిద్వారము, కాశీ, కాంచి, అవంతి, ద్వారక మొదలగునవి విశ్వవిద్యాలయములై యుండెను. లక్షలకొలది విద్యార్థులచ్చట చదువు కొనుచుండిరి. అందువలననే వానిని మోక్షదాయక ములని నుడివియున్నారు.

అయోధ్యా మధురామాయా
కాశీ కాంచియవంతికా।
పురీద్వారవతీచైవ।
సప్తైతేమోక్షదాయికాః॥

ముక్తికనుగుణ్యముగు జ్ఞానవిజ్ఞానము లిచ్చోట లభింపుచుండుటవలననే మోక్షదాయకా యను శబ్ద మువయోగింపబడినది. ఇందువలన, తీర్థముల ప్రధాన తమోద్దేశ్యము శిక్షయని దోచుచున్నది. తీర్థస్థాన ములయందు సన్యాసులు, సాధుపురుషులు, పండితులు మొదలగు వారు వేరుచుండిరి. అందువలన యాత్రి కులు వారికడనుత్కృష్ట విషయముల దెలిసికొనియభి వృద్ధిమార్గముల నడచుచుండిరి. బుద్ధ భగవానుడు బుద్ధత్వమును బొందుటకు బూర్వము వారణాశికివచ్చి యిట్లనియెను. "వారణాసింగమిష్యామి ధర్మచ క్రంపబత్తామి" అప్పుడు భారతవర్ష మందలి జ్ఞాన విజ్ఞానములకు ముఖ్యకేంద్రము వారణాసియైయుండెను. శ్రీశంకరాచార్య స్వామికూడ ధర్మప్రచారమునకు వారణాసికివచ్చియుండెను. నేటికిని వారణాసి సంస్కృతవిద్యకు కేంద్రస్థానమైయున్నదని నుడువక తీరదు.

ఈశిక్షాకేంద్రములే విశ్వవిద్యాలయ కార్య ములను నిర్వహింపుచుండెను. ఆధునికకాలమందు మిథిలనవద్వీపములు శిక్షకుకేంద్రములై ప్రసిద్ధికెక్కెను. ఇప్పుడు డిగ్రీలను బుచ్చుకొనువారినివలెనే పూర్వ కాలమున కాశీయందు చదువుకొనివచ్చిన పండితులను గౌరవింపుచుండిరి. ప్రాచీన కాల మున వ్యక్తివిశేషము కేంద్రముగను, పరవర్తికాల మున పండితమండలి నామస్థానము కేంద్రమై శిక్ష యభివృద్ధినొందుచు వ్యాపింపుచుండెను. వి ద్యాంసులు నివసింపని ప్రదేశమందు నివసింప గూడ దని మతపూర్వులు విషేధించియున్నారు. రాజనివ సించుచోటును విద్వాయించు వప్పుడు మనువిట్లు నుడివి యుండెను. "ఆర్యప్రాయం" అనగా ఎక్కుడు మంది విద్వాంసులు ధార్మికులు నివసించు స్థానమును మనోనీత మొనర్పవలయును.

విద్యవలననే బ్రాహ్మణులకు ప్రాధాన్యము కలిగినది, అందువలన బ్రాహ్మణ శిక్షాప్రద రాజ ధర్మమై యుండెను. బ్రాహ్మణ ప్రతా పము నిరుపమానమగుచున్నదని దలంపరాదు. ఏల యన జ్ఞానముయొక్క ప్రతిభ యప్రతిహతముగదా? జ్ఞాన ప్రభావమువలననే బ్రాహ్మణుల కుత్తమాసనము లభించినది. శిక్షగభీరమై విస్తృతిని గాంచవలయు నని వది జీవన వ్రతముగావలయును. అందువలన బ్రాహ్మణ ప్రాధాన్య మేర్పడినది. దీనిని బ్రాహ్మణ ప్రాధాన్య మనుటకంటె జ్ఞానమునకును శిక్షకును ప్రాధాన్య మనుట యత్యుత్తమము.

ఆది శంకరులు నాలుగుధామములయందు నాలుగుమతములను స్థాపించిరి. జ్ఞానము ధర్మము శిక్షలయం దేకత్వమును గలిగించుటయే యామతస్థాపనోద్దేశము. ఈపెద్దమతముల నాశ్రయించి శాఖోపశాఖలుగ భారతవర్ష మందంతటను మతము లేర్పడి యున్నవి. వీనివలన భారతవర్షమందు జాతీయ జీవనము సుదృఢమగునని యే శంకరుల యుద్దేశము. శిక్షా దీక్షలమధ్యనుండి భారతీయులయం దైక్యతనుగల్గించుటయే యాయన ముఖ్యసంకల్పము.

శిక్షాదీక్షలు విస్తరించుట కేర్పడిన మహోత్ సవానుష్ఠానము కుంభమేళా. ఈకుంభమేళాకు భారత వర్షమునం దన్ని వైపులనుండియు స్త్రీపురుషులువచ్చి జ్ఞానకర్మ సుత్రాంగి శిక్షాదీక్షలనొంది ధర్మము మొదలగువాని వ్యాఖ్యానముల విని యేగుచుండిరి. అందువలన నెప్పటికప్పుడు జనమండలియందు నూతన విషయములు వ్యాపింపుచుండెను.

ప్రాచీన కాల[illegible] నిర్వహింపబడుచుండెను. [illegible] దేశములయందు [illegible]

విచ్చేయు పండిత మండలితోడ యజ్ఞశాలలు నిండు చుండెను. వారు చర్చించి వివిధసమస్యలను బరిష్కరింపు చుండిరి. ఇందువలన సాధారణ మానవులకు మిక్కుటముగు జ్ఞానము గలుగుచుండెను. పండితుల గృహమందుండు దాసదాసీజనముగూడ జటిలవిషయములను గ్రహింపగలుగుచుండిరి. ఇందుకు సంబంధించిన యొక కథను జెప్పుదును. శంకర భగవానులు మండన మిశ్రుని గృహమున కేగుచు మార్గమధ్యము నందొక దాసీనిచూచి మండనమిశ్రునిగృహ మెచ్చట నని ప్రశ్నింప నాదాసి యిట్లనియె. "ఏగృహ మందు పంజరములోనుండు చిలుక వేదములు పౌరుషేయములా? అపౌరుషేయములా? యనియు కర్మఫలదాత కర్మయేనా లేక యీశ్వరుడే కర్మ ఫలదాతయా అనిప్రశ్నింపుచుండు నాగృహమె మండన మిశ్రుని గృహము." శిక్ష యీవిధముగ భారతవర్ష మందంతటను వ్యాపించియుండెను. విద్యాధ్యాపన మున కిది సర్వోత్తమ మార్గముగాదా?



## జానకి చెల్వ.



(అధికార్ల సూర్యనారాయణరావుగారు)

మనసుగొనియెడు చెల్వ, కనుమెచ్చు చెల్వ,
మనుజ కాంతలలోనఁ గనరాని చెల్వ,
చెప్పశక్యముకాని శ్రీలొల్కు చెల్వ,
నవ్వుచుండెడి పువ్వునాబాల చెల్వ,

వలపుఁ గొలిపెడు చెల్వ, కలలిచ్చు చెల్వ,
మెరపు తీగలఁ బోలెమెర సేటిచెల్వ,
పున్నమివెన్నెలల్ పూయించు చెల్వ
నన్నజాజీ పువ్వు జానకిచెల్వ

కన్నుగవ మంత్రించు గడుసైనచెల్వ,
అలయుమదిలోనాటి బరువైనచెల్వ
పాడగా దగుచెల్వ బడయదగుచెల్వ
వాడుదేరని పువ్వువనజాక్షి చెల్వ.

——o——

# అర్ధరాత్రము.



( కె. రాఘవాచార్యులుగారు. )

—————:o:—————

"డాక్టరుగారూ! డాక్టరుగారూ!" యని కేకలు వినబడినవి. నిద్రాభంగమగుటచే లోలోన విసుగుకొనుచుఁ దలుపుఁ దెరచితిని. వెల్వెలబారు వదనముతో నొక నూతన పురుషుడు గుమ్మమునొద్ద నిలువబడి యుండెను.

అతనిఁ గన్గొని "అయ్యా జమీందారుగారూ! యెందుల కిట్లర్ధరాత్రమున విచ్చేసితి, రని యడుగుచు గడియారము వైపుజూచితిని. రెండున్నర గంటలు కావచ్చినది. లోనికి వచ్చి సుందరరావు "డాక్టరుగారూ! తిరిగి పూర్వపు స్థితి వచ్చినది. మీమందుల వల్ల గుణమంతముగఁ గన్పడలేదని పల్కుచు నొక కుర్చీపై గూర్చుండెను.

"మీరొకవేళ బ్రాంది నధికముగ సేవింపుచున్నారు గాబోలు, అని నవ్వుచు బల్కితిని.

"లేదు-లేదు మీయభిప్రాయము సరియయినది కాదు. నాచరిత్రమును సంపూర్ణముగ నాకర్ణింపక గారణమిది యని గ్రహింపజాలరు.,,

కిటికీలో మినుకు మినుకుమని మండెడు దీపపు వత్తిఁ గొంచెము హెచ్చుచేసి గోడకు జేరగిలి కూర్చుంటిని. సుందరరావు తన వృత్తాంతము నిటుల జెప్పసాగెను.

"నా ప్రథమకళత్రమునుఁ బోలినయువతి మరల నీప్రపంచమున గన్గొనజాలరు. ఆమె పతివ్రతా శిరోమణి. అప్పటికి నాత్న యౌవన మలవడియుంటచే నామనంబు ప్రణయతరంగముల నోలలాడుచుండెడిది. నాలుగు సంవత్సరముల క్రిందట నేను రోగపీడితుండ నయితిని. నా పైపెదవిపై నొక వ్రణముద్భవించెను. వైద్యులందరు నిరాశజెంది చికిత్స జేయుట మానిరి. మృత్యుదేవత నన్నావహించినది బోలె నానాటికి నాశరీరము కృశించెను. కృశించినతనూవల్లరితో నాప్రియురాలు నాకనుదినమును నుపచరింపుచు మృత్యుదేవతను ధిక్కరించుచుండెను. నిద్రాహారములుమాని, తన బిడ్డనికొరకు ప్రాణముల నర్పించు తల్లివలె, నన్ను కాపాడుచుండెను. అపుడొకనాడు యతియొకడు మాగృహంబునకువచ్చి మంత్రించిన యొక చూర్ణము నొసంగి జనియెను. దాని మహాత్మ్యముచే నయిననేమి, నా భాగ్యవశమున నేమి కొన్ని

* మహాకవి రవీంద్రనాథటాగూరు గారి కథ కనువాదము.

దినములగుసరికి నాశరీరము స్వస్థత జెందెను. భీకర వ్యూహమును ధరించిన వ్యాఘ్రము నోరినుండి తప్పించుకొనిన పాంథునివలె, మృత్యుదేవత కోరల వెలువడి బ్రతుకగల్గితిని.

నాటినుండియు దుర్బలమగు నాప్రియురాలి శరీరమనేకరుగ్మతలకు గురియయ్యెను. విషణ్ణమానసుడనై యామెకు బరిచర్యసేయ బ్రయత్నింప నామె వలదని వారింపుచుండెను. ఇటుల ననుదినమును నాకు బరిచర్యచేసినచో లోకవిరుద్ధముగ నుండునని యామె బల్కుచుండెడిది.

మీరు చంద్రనగరమున మాగృహమును జూచియేయుందురు. గంగాతీరమున రమ్యమై నేత్రోత్సవంబొనర్చు నుద్యానవనమున మాగృహంబు గలదు. సౌరభంబుల వెదజల్లు మల్లియలును గులాబీలను గల్గి చూపరుల కానందము నొసగు ప్రాసాదమును వర్ణింప నేరితరము? ఈద్యానవనమున నొక వకుళవృక్షమును దాని శీతలచ్ఛాయల నొక చలువరాతిన్నెయు గలవు. గ్రీష్మర్తువునందు గంగాతరంగ శీకరమాలికల హృద్యంబగు మందమారుతము వీవ, నాప్రియురాలచట నూర్చుండి కాలము గడపుచుండును.

రోగపీడితయగు నా సుందరి [illegible] నాటి రాత్రి యచట విశ్రమించెను. వకుళవృక్షమునుండి పుష్పములు జలజల రాలదొడగెను. శీతకిరణుడామె శరీరలావణ్యము నపహరించు వానివలె బర్ణముల మాటున దాగియుండెను. రాత్రి నిశ్శబ్దముగనుండెను. కృశించిన యామె వదనారవిందమును గన్గొన నాకనులనుండి దుఃఖాశ్రువులు రాలదొడగెను. శల్యావశిష్టమగు నామె కరంబుల నాకరంబుల జేర్చి 'ప్రేయసీ! నిన్నన్నటికిని మరువజాల'నని పల్కితిని.

ఆనందముచే శరీరము పరవశతనొంద వ్రీడాత్మకమగు హాసంబు పెదవుల నటింప ప్రేయసి నావచనంబులు సందేహాస్పదములని పరిహసించునటుల దోచెను. ఆమె చిరునగవువలన నంతయు గ్రహించి యేలనిటుల బల్కితినని విచారించితిని.

ఎన్ని విధముల బ్రయత్నించినను రోగము కుదురదయ్యెను. వైద్యులామెను బ్రయాగమునకు గొనిపొండని నాకు సలహా నిచ్చిరి. ఆమెను దీసికొని ప్రయాగకు బోయితిని- అనుచు సుందరరావు తన చేతులపై నానుకొని యాలోచించు వానివలె నూరకుండెను.

౨

కొంతతడ వటుల మౌనముదాల్చి యూరకుండి యాతడు తిరుగ నిటుల వచించెను.

“ప్రయాగమునందు గొప్ప వైద్యులొకనిచే నాప్రేయసికి మందునిప్పించితిని. కాని యామెశరీరస్థితి యెప్పటి యటుల నుండెను. తనజీవితమంతయు రోగియై కాలముగడుపవలయుననియామె నిష్పృహజెందెను. కొన్నిదినములయిన తరువాత నొకనాడామె నన్నుగన్గొని మీరు తిరుగ వివాహమాడి సుఖంబుగ నుండగోరెదనని బల్కెను. నవలలయందలి కథానాయకులవలె ప్రేయసీ! యాశరీరమున బ్రాణమున్నంతవరకు నిన్నుదప్ప నితరుల బ్రేమింప జాలనని యేమేమో పల్కి

తిని. నాథా! యిటులనకుడు మీసౌఖ్యమును గోరి వచించిన దానవని యామె మారు వల్కెను.

ఆమె జీవితమంతయు రోగిణియై యుండవలెనని వైద్యుడు వచించిననాటి నుండియు నామనంబున సంతోషము మాయమై పోయె. రోగియై కృశింపుచుండు తరుణీమణితోడ నెటుల కాలము గడుపుదునా యని నిరంతరము చింతాక్రాంతుడనై యుంటిని. ప్రణయ డోలికలనూగుచు సౌఖ్యదాయకమై యుండునని తలంచిన దినములన్నియు నిష్ఫలములయ్యెను. నాహృదయ మందలి మార్పు కామె సులభముగ గ్రహింపగలిగెను.

డాక్టరు మాధవరావు మాశాఖలోని వాడే యగుటచే దరచుగ నాయన గృహమునకు బోవుచుంటిని. మాధవరావున కొక్కతెయే కుమార్తె. ఆమె అవివాహిత. షోడశవత్సరముల పూర్ణయౌవనముచే నలరారు నవలాతలమానిక మని చెప్పనొప్పును. ఆమెను మనోరమ యని పిలచు చుండిరి. లావణ్యరాశియు సుగుణఖనియు నగు నాబాలికను గన్గొనిన బిపాసార్తితుడగు తెరువరి యొండమావులంగని యాసజెందునటుల దన్మయత్వము నొందుచుంటిని.

నాటినుండియు స్వగృహమున కాలవ్యయముగ బోవుచుండుటచే మందులను వేళకు సరిగ నివ్వలేక పోయితిని. తనశరీర రుగ్మత యెన్నటికిని కుదురదని నిరాశజెంది, నాప్రేయసి యొకనాడు 'డాక్టరుగారూ! యేల నిట్లనుదినంబును మందుల మ్రింగుమని యెదరు? రోగము శరీరమున జీర్ణించియున్నది. నన్నీ చెరనుండి విడిపింపజాలు సిద్ధౌషధమేదియైన నొసంగుడ'ని యడిగెను. 'అమ్మా! అటు లనవల'దని డాక్టరామెను మందలించెను.

ఆమె వచనంబులు ములుకులై నాటినవి. అప్పటినుండియు గడు జాగరూకతతో బరిచర్య సేయుచు, దుఃఖము నపనయింప బ్రయత్నింపుచుంటి' ననుచు భ్రమజెందిన వానివలె నిటునటు జూచుచు సుందరరావు మిన్నకుండెను. నేనొసంగిన శీతలజలంబుల గ్రోలియాతడు మరల జెప్పసాగెను.

'ఒకనాడు మనోరమ నాప్రేయసిని జూచుటకై మాగృహంబునకు వచ్చెదననెను. ఆమె వచ్చుట నాకిష్టములేదు. అందులకు దగిన కారణము లేమియును నాకు దోచక పోవుటచే నేనియ్యకొనవలసి వచ్చెను. నాటి సాయంకాలముననే మనోరమ మాయింటికి వచ్చెను. ఆదినమున నాభార్యకు బాధ యెక్కువగ నుండెను.

గదిలో నొకమూల మినుకు మినుకుమని దీపముమండుచుండెను. ఆమెయుచ్ఛ్వాస నిశ్వాసముల ధ్వని తప్ప వేరొద్దియు వినబడుట లేదు. మనోరమ యేమిచేయుటకును దోచక గుమ్మమునొద్ద నిలువబడి యుండెను. ఇంతలో నాభార్య తన కనుల దెరచి యెదుట నిలువబడిన మనోరమం గాంచి 'ఆమెయెవ్వరు,' అని రెండు మూడుసారులు నన్నడిగెను. నాకు దెలియదని నెమ్మదిగ బలికితిని. తత్క్షణమే యెందులకిటు లనృతమును బల్కవలయునని విచారించి 'ఓహో మరచితిని. యీమె మన డాక్టరు మాధవరావు గారి కుమార్తె' యనుచు దృష్టి మరియొక వైపునకు మరల్చి కూర్చుంటిని.

నాచేయిపట్టి నాపాదములను బరీక్షించి మనోరమను లోనికి బిలచెను. వారిశుశ్రూష కొంచెము సేపు మూర్ఛిల్లితి. ఇంతలో డాక్టరు మాధవరావు రెండు సీసాలలో మందులను గొని యిచటికి వచ్చెను. ఒకసీసాలోని తైలమును నొప్పిగల్గిన స్థలమునందు మర్దించవలయు ననియు, రెండవది లోనికి, బుచ్చుకొన వలయు ననియు చెప్పెను. మొదటి సీసాలోని తైలము విషతుల్యము గనుక లోనికిబుచ్చుకొన రాదని నాప్రేయసితో జెప్పి యాతడింటికి బోయెద ననెను. మనోరమ నాభార్యకు బరిచర్య సేయ నచటనే యుండెద నని తండ్రితో జెప్పుచుండ, నాభార్య తనసేవకులు తనకు బరిచర్యసేయుదురని యామెను వారించి యింటి కనిపెను. డాక్టరు పోబోవుచుండ నామె 'అయ్యో డాక్టరుగారూ మీమిత్రుడు విషణ్ణమానసుడై యున్నవాడు. దయచేసి ఆయనను మీతో దీసికొనివెళ్లు డని పలికెను. డాక్టరు నదీతీరమునకు షికారు పోవుదము రమ్మనినన్ను బిలచెను. మాకు మాటాట నేరక వారితో గూడపోయితిని.

"సాయంకాలము మాధవరావు గారి యింట భుజించి తిరుగ మాయింటి కరుదెంచితిని. నాభార్యకును వేదనయధికమగుచుండెను. ముఖవికాసము తగ్గెను. నోట మాట వచ్చుట లేదు. తత్క్షణము వైద్యుని బిలిపించితిని. అతడు వచ్చి తైలము సీసాను జూడ నందులో నొకచుక్కయైన గన్పడ లేదు. పొరపాటున నొకసీసాలోని మందును ద్రాగుటకుమారు మరియొక సీసాలోని మందు నుపయోగించితివా యని యాతడు నాభార్య నడిగెను. అవు ననియామె తలయూచినది. మాధవరావు మందులనుగొనివచ్చెద నని త్వరితముగ నింటికి జనియెను.

ఆమెనొంటరిగవిడచి మాధవరావు గారియింటి కేలబోయితి నని విచారింపుచు నామెమంచముప్రక్క గూర్చుంటిని. 'విచారింపకుడు. నేను మరణించుటయే మేలు. మీరు సౌఖ్యముగ నుందురని తలంచుచు నేను సంతోషముతో మిమ్ములను వదలి పోవుచున్నాను. అని తెల్పునటుల నిశ్చలచిత్తయై యామె తనకరాంగుళి నాశరీరమును స్పృశింపుచు నన్నోదార్చు నటుల గన్పట్టెను. మాధవరావు మరలవచ్చునప్పటికి నాప్రేయసి విగతజీవ యయ్యె" నని వల్కుచు సుందరరావు వెలికి జనియెను.

## 3

వీధియరుగుపై నిటు నటు దిరిగి లోనికివచ్చి శీతలజలంబులగ్రోలి యాతడు మరల నిట్లు బల్కసాగెను.

కొన్నిదినములయిన తరువాత మనోరమను పెండ్లియాడి చంద్రనగరమునకు బోయితిని. నాటినుండియు మత్తుకలిగించు సారాయముల సేవింపుచు నొడలెరుంగక దిరుగుచుంటిని.

శరదృతువు నందలి యొకనాటి సాయంకాలము తుషారంబునల్గడల వ్యాపించుచుండెను. పక్షుల కలరవంబును వినవచ్చుట లేదు. తరుశాఖలుగాలి కిటు నటు గదలుచుండెను. మనోరమ వకుళవృక్షముచెంత జలువ రా తిన్నెపై విశ్రమించు చుండెను. ఆమె సమీపమున నేనును గూర్చుంటిని.

వృక్షశాఖలనడుమ మినుకుమినుకు మని తారకాగణంబులు విలసిల్లుచుండెను. నాటి సాయంకాలము నిశ్శబ్దముగ నుండెను. కీచురాయిల రొదమాత్రము దూరమునుండి వినవచ్చుచుండెను,

సారాయముగ్రోలి మత్తిలయుండు నాకు మనోరమ తరుశాఖలనడుమ నొక యద్భుత వ్యక్తివలె నుండెను. అట్టిసమయంబున దమంబు విరియజేయుచు దనకిరణాళి బ్రసరింపుచు శీతకిరణుడాకసమున జూపట్టెను. ధవళమగు చలువరాతిన్నియపై ధవళవస్త్రముల ధరించి పరుండిన మనోరమ సుందరవదనంబుపై బండువెన్నెలలు ప్రసరించెను. ఆమెహస్తముల నాహస్తముల జేర్చి 'తన్వీ! నీవునమ్ముమన్న జెప్పజాలను గానినిన్నెన్నటికిని మరువ, ననిబల్కితిని.

నాటివలెనె శరత్కాలేందుసంశోభితంబగు నొకరాత్రి, యావకుళవృక్షము చెంత నాచలువరాతిన్నియపై విశ్రమించి ప్రేమరసాస్పదములగు నట్టిపల్కుల వేరొకలతాంగితోడబల్కినటుల జ్ఞప్తికి వచ్చెను. ఆసమయమున సుదతి మందస్మితంబొందు విని మూర్ఛ నొందితిని, లేచి చూచుసరికి నాగదిలో బాన్పుపై నుంటిని. మనోరమ యాపాన్పుదరిని నిలుచుండి యుపచారములు సల్పుచుండెను. 'నాథా యటుల మూర్ఛనొందుటకు గారణ మేమి' యని యామె యడిగెను. 'హృదయ విదారణంబగు వికృతహాసంబును నీవువినియుండలేదా,' యంటిని 'భ్రమజెందియుంటిరి గాబోలు. అందువలననే పక్షులరవంబువిని వికృతహాసమని దలచి భయపడితి రని మనోరమ నాకు ధైర్యము జెప్పెను. ఆదినములలో పక్షులు గుంపులుగుంపులుగ జేరి నదీతీరమున దిగుచుండుటచేత నొకవేళనయ్యది పక్షులరుతంబని తలచితిని. కాని సాయంకాలమగుసరికి వికృతహాస మన్నిదిక్కుల వినవచ్చుచున్నటుల దోచి భయాకులిత స్వాంతుడనై యుంటిని.

తరువాత కొన్నిదినంబులకు మనోరమయు నేనును నౌకావిహారము సల్పబోయితిమి. హేమంతంబున వల్మీకమున జుట్టజుట్టుకొనియుండు నాగరాజువోలె బద్మావది ప్రవహించుచుండెను. కనుచూపుమేర నొకవైపున మామిడితోపులును వానినడుమ పల్లియలును, వేరొకవైపున బచ్చికయులేని మైదానమును గన్పట్టుచుండెను. భానుబింబము పరాంబుధిగ్రుంక, బంగారు పూసినరీతి సాంధ్యరాగ మాకసంబు నలంకరించెను. కొంతసేపటికి జిరుచీకటుల విరియజేయుచు జంద్రమండలంబు ప్రాగ్దిశామండలంబున జూపట్టె. ఆహా చంద్రమండలంబున మనోరమయు నేనును విహారణమొనర్చుచుంటిమి. అల్పమగు మానవునకు బ్రిణయతరంగముల బందీకృతంబులుగ జేయ శక్యమా? ఆద్యంతములులేని విశాలమగు రోదసికుహరమున మేమిరువురము స్వచ్ఛందవిహార మొనర్చుచున్నటుల నుండెను.

మనోహరంబులగు చంద్రికిరణంబులు ప్రసరింప నొప్పెడు మనోరమ వదనంబు గాంచి ముద్దిడితిని. ఆసమయంబున నిర్జనంబగు నదీతీరమున 'ఆమెయెవరు? ఆమెయెవరు? ఆమెయెవ" రనిముమ్మారు ప్రశ్నించినటులవినవయ్యెను. మేమిరువురము భయము

జెంది, తప్పకమే యిదియను హాస్యము జల్పితంబుగాదనియు వక్కుల కల్పితంబులు గాఁబడవోపుననియు దలంచి యింటి కరుదెంచితిమి. నాటిరాత్రి శయ్యోపాంతస్థితయై యొకయువతి మనోరమను దనకరాంగుళిఁజూపుచు 'ఆమెయెవ' రని యడిగినటుల వినఁబడియెను. త్వరితముగ నిద్రలేచి దీపము నొకదాని వెలిగించి నలుదిక్కుల గాంచితిని. మనోరమ పాన్పుపై సుఖముగ నిద్రించుచుండెను. దూరమునుండి వికృతహాసమును విని యులికిపడితిని. ఆహాసంబు నదీతటంబును, నదీజలంబును దాటి పల్లియను పట్టణములను దేశంబులను గడచి దిగంతాపథంబు జేరుచున్నటుల వింటిని. ఏమియు దోచక దీపమునార్పి పరుంటిని. మరల నాహాసమును, ఆమె యెవరను ప్రశ్నయును వినబడియెను. గడియారము కూడ టిక్కు టిక్కు మను శబ్దములతో నామెరు వరని, యడిగినటుల దోచె నని యట్లు సుందరరావు మిన్నకుండెను. అతని ముఖము వెల్లబారి యుండెను. శీతలజలంబుల గ్రోలి యాతఁడొక కుర్చీపై నాసీనుడయ్యెను.

తూర్పు తెల్లవారుచుండెను. శకుంతసంతానముల రుతంబులు విస్పష్టముగ విన సుందరరావు ముఖ మెప్పటివలెనే వికాసము నొందెను. అతనిభయమును బటాపంచలై పోయెను. భయావహమగు ప్రశ్నయును విని యొంకులకిటుల నాజీవిత చరిత్రమును దెల్పితినని సిగ్గుజెంది సుందరరావొక నిముసమైన నిలువక నింటికి బోయెను.

మరునాటి యర్ధరాత్రమున నెప్పటి వలెనే 'అయ్యా డాక్టరుగారూ తలుపు దెర చూడను కేక' ను వింటిని.






# ప్రతిమానాటకము

(గొ. రామదాసు పంతులుగారు.)

([illegible] సం॥ అక్టోబరు సంచిక తరువాయి)

## ౩ వ అంకము

దేవకులికుడు:— (చూచి) ఓహో!

కొడుకు మూర్ఛ జెందియున్న సమయమునఁ దల్లులు వచ్చుచున్నారు. తల్లులు చేతివ్వర్ణము జలములేని జలాంజలియగు నుగదా! (౪)

(దేవీలున్ను సుమంత్రుడును ప్రవేశించుదురు)

సుమంత్రుడు:— ఇటు, ఇటు దయచేయుండి

ఇది యే ప్రతిమాగృహము. ఇది యొన్నత్యమంచు రాజభవనమును గూడమించియున్నది. ఇచ్చట ప్రతీహారులచే ఆటంకబెట్టకుండా మార్గస్థులు వచ్చి వందనము వినా సేవను చేతురు. (౫)

(లోనికి బోయి జూచి) అమ్మా! రాకండి! రాకండి! ఇచ్చట యెవరో యువకుడైన రాచకుమారుడు పడియున్నాడు)

దేవకులికుడు:— ఇతనెవరో పైవాడని తలంచుచున్నారా! చాలులెండి! భరతుని పోల్చలేదా? (వెళ్లిపోవును.)

దేవీలు:— (తొందరగా చెంతకుబోయి) హా! కుమారా! భరతా!

భరత:— (కొంచెము తెలివివచ్చి) అయ్యా

సుమంత్ర:— శుభంమహా (అని అర్థోక్తితో దుఃఖించుచూ) అహా! స్వరపోలిక! మహారాజుగారి విగ్రహామే మాట్లాడుచున్నదను కున్నాను!

భర:— ఇప్పుడు మాతల్లు లెట్లుండిరో!

దేవీలు:— అబ్బాయి! ఇదిగో మాయవస్థ (అని ముసుగులు తీసివేయుదురు)

సుమంత్రుడు:— అమ్మా! దుఃఖమునాపండి.

భరత:— (సుమంత్రునిజూచి) సమస్తమర్యాదలు సూచించు చున్నవి. అయ్యా! తమరు సుమంత్రుల వారు కారా!

సుమంత్ర:— నాయనా! ఇంకేమి! నేనే సుమంత్రుడను విశేషకాలము బ్రతికి యుండుటచే గలిగే దుఃఖముల నను భవించుచూ కృతజ్ఞతా భావములచే కృశించుచూ రాజుగారు మరణించి నది మొదలు ఒట్టిరధమునే దోలుకొనుచూ ఇలాగుయున్నాను.

భరత:— హా, తండ్రీ! (అనిలేచి) అయ్యా! తల్లులకు నమస్కరించే మర్యాదలు నాకు తమరు నేర్పవలె.

సుమంత్ర:— అలాగునే! ఈమెరామునిగన్న కౌసల్యదేవిగారు.

భరత:— అమ్మా నిరపరాధినైన నేను నమస్కరింపుచున్నాను. (గ).

కౌసల్యా:— అబ్బాయీ ఆవిషయమై విచారించకుము. (ఘ)

సుమంత్ర:— ఈమె లక్ష్మణుని గన్నతల్లి సుమిత్రమ్మగారు.

భరతు:— అమ్మా! నమస్కారము. లక్ష్మణుడు నన్నుచాలా వెనుకకు త్రోసివేసినాడు.

సుమిత్ర:— బిడ్డా! కీర్తిని బడయుము.

భరతు:— తల్లీ అందుకొఱకైయే యత్నించుచున్నాను. తమదయ అటుతరువాత?

సుమిత్రి:— ఇదిగో మీఅమ్మగారు.

భరత:— (కోపముతో యెగిరి) ఓసీపాపిష్టురాలా! నాయిద్దరతల్లులమధ్య నిలువబడియుండుటనీకుతగదు! గంగా యమునలమధ్య బాకే మురికి కాల్వవలె (చ)

కైకేయి:— అబ్బాయి! నేనేమి చేసినాను?

భరతు:— ఏమిచేస్తివా? మమ్మా నవమర్యాదకు, అన్నను నారచీరలకు, రాజుగార్ని మృత్యు గృహమునకు, యావదయోధ్యనునిరవధియైన దుఃఖమునకు, లక్ష్మణుని, మృగములకు, పిల్లలుగల తల్లులను శోకమునకు, ఒదినిగారిని ఘోరాయాసమునకు,నన్ను కోపముతోగూడిన నసూయతకు బాలుచేస్తివి (ఛ)

కౌసల్యా:— సమస్తమర్యాదలు తెలిసిన నీవేల తల్లికి నమస్కారము చేయవు.

భరతత:— తల్లియా? అమ్మా నీవేనాతల్లివి. అమ్మ నమస్కరింపు చున్నాను.

కౌసల్యా:— కాదు, కాదు! ఈమెనిన్ను గన్నది.

భరతు:— పూర్వమాలాగే. ఇప్పుడు కాదు తమరు చిత్తగించండి! నైజముతో గూడిన దోషములచే స్నేహముపోయిపుత్రులైనా పుత్రులు గాకుండా అయిపోతారు. భర్తృద్రోహము చేసినది తల్లియైననూ గౌరవమును బో

గొట్టు కొనుననె క్రొత్త ధర్మమును ప్రపంచకములో స్థాపనచేయుదును.

కైక:— నాయనా! మహారాజుగారి సత్యము నునిలబెట్టుట కాలాగన్నానోయి.

భరత:— ఏమని ఏమని

కైక:—నాకొడుకు రాజు గావలెనని.

భరత:— అలాగైతే అన్నగారుమాత్రము మీకేమికావలె,ఆయననాతెంఢ్రికిబుట్ట లేదా? వార్సత్వముచేత పట్టాభిషేకమునకర్హుడుగాడా? అన్నదమ్ములము దెబ్బలాడు కుంటున్నామా? జనుల కిష్టములేదా? (ఇ)

కైక:— ధనాశగలవారి నడుగు.

భరత:-నారబట్టలుగట్టి రాజశోభను బోగొట్టు కొనుట, భార్యతో గూడ కాల్నడకను అరణ్యమునకుపోవుట, వనవాసమునకు పొమ్మని నివనుట, ఇవన్నిశీలుల్క-ము లో నున్న వే గాబోలు?

కైక:— అనగుణ్యాలైన దేశకాలము లలో చెప్పెద.

భరత: — అపకీర్తి కావలెనని దానవు నీతో మమ్మునుగూడనేల గలుపు కుంటివి. రాజ్య సుఖమే గావలసి యుంటే రాజుగా రివ్వలేకపోతిరా? రాజ్యము జేయు వారి తెల్లిననిపించు కొనవలె నందువా మాయన్నగారు మాత్రము నీకుపుత్రిలు గారు?నిజము బల్కుము! నీవుజేసిన పని మాత్రము చాలావిచారము గలుగ జేయుచున్నది.

రాజ్యమందు గల ఆశచే రాజుగారి ప్రాణముల నైనా జూచితివిగావు గదా! అరణ్యమునకు పో, అని పెద్ద కొడుకును పంపివేస్తివి. నారబట్టలు గట్టుకుని అరణ్యమునకు బోవుచున్న జానకినిజూచి నీగుండెలుపగ్కలుగా లేదా! ఆబ్రహ్మ నీహృదయమును వజ్రముకంటె కఠినముగా సృజించెనో! ఎంతపాపమమ్మా!

సుమంత్రి:— కుమారా! జనులతో గూడ వశిష్ఠ వామదేవులు పట్టాభిషేకము విషయమై తమర్నిపిలు కొనుటకు వచ్చియున్నారు. గోపాలుడు లేని పశువులెట్లు నాశనమును బొందునో అట్లు ఈప్రజలు పాలకుడు లేనివారై చెడి పోవుచున్నారు! (ట)

భరతు:— జనులారా నాతోరానీ!

సుమంత్రి:— అభిషేకము మాని తమరెచ్చటికి దైచేతురు ?

భరత:— అభిషేకమా! ఈపూజ్యులరాలికి చేయుండి! (డ)

సుమంత్ర:— తమరెచ్చటికివిచ్చేయుదురు?

భరత: — లక్ష్మణ ప్రియు డెక్కడ యున్నాడో అచ్చటికి వెళ్లుదును. రాఘవు డెచ్చట యుంటే అదియే అయోధ్యగాని ఆయనలేని అయోధ్య అయోధ్యగాదు? (ణ)

(అందరూ వెళ్లుదురు)

## విమర్శన.

ఈయంకములో నాటకమునకు ప్రతిమానాటకమని పేరుపెట్టుటకు కారణమీయబడెను. దశరథుడు చనిపోయెననియు, రాముడరణ్యమునకు వెళ్లెననియు ప్రతిమలద్వారా భరతునికి తెలిసెను. నాటకమునకు ప్రతిమలే గాన వాటిపేరే, నాటకమునకీయబడెను.

పూర్వపు రెండంకములలోవలె ఈయంకము కూడ ఐదుభాగములుగా నున్నది.

మొదటిభాగము ప్రవేశకము. ఇందు ప్రతిమాగృహము నలంకరించుట మొదలైన యంశములు చెప్పబడియె. ముందురాబోవుకథకు రంగమైన ప్రతిమాగృహము ద్వారాప్రతిమలను సూచించి యున్నవి గాన ఈభాగముకథలోకి ప్రవేశింపు చున్నది. గాన ఇది ప్రవేశకము. *

దీనిలో పెత్తనదారులు కూలివాండ్లచేనెట్లుపని చేయించెదరో చూడగా మన కాలమునకును భాసుని కాలమునకు భేదమేమి గనిపించదు. పనిచేయువాడు పనినిపూర్తిచేసినప్పటికి పెత్తనదారు మాత్రము తన కట్టుపెత్తనము మానడు. పని యెంతవరకైనదో చూడకుండ భటుడు నిందించుచున్న సుధాకరుని గొట్టును. కూలివాడేమి చేయగలడు? పాపము! నిరర్థకమైన మాటలనాడును. దానిపై భటుడు దాసీపుత్రుడాయనితిట్టును. దాసీపుత్రుడనగా మనకాలములో లంజకొడకా అన్నమాటే, నిజదారసుతోదర పోషణార్థమై, యెండనక వాననక ఒక్కనాడు భోజనమునకైన చాలనిభత్యమునకు పాటుబడువారిగతి యెప్పుడును ఒక్కేలాగున్నదా! పాపముబీదలగతి యెంత విచారమైనది.

సుధాకరుడనగా వెల్లవేయువాడని యర్థము. ఇదివృత్తిని తెలియజేయు పదము. ఈ రోజులలో తాపీమేస్త్రీలు అన్నట్లుగ కాలములోగూడ ఇట్టివృత్తులకే పేర్లున్నట్లు దోచుచున్నది.

గృహములెట్లు అలంకరించబడి యుండెడివో కూడ ఈభాగమందు తెలియవచ్చుచున్నది. గోడలకు వెల్లవేసి దానిపై చందనముతో పంచాంగుళీముద్రల నద్దుటట. * పంచాంగుళీముద్ర యంటే ఐదువ్రేళ్లతో గూడిన అరచేయిముద్రయని కొందరిఅభిప్రాయము. చందనముతో ఇట్టిముద్రలు వేయుట ముసల్మానులకే యలవాటుగాని హిందువులకున్నట్లుయెచ్చటాగనిపించదు. గోడలపైన, తలుపులపైన ఈముద్రలు వేసిన భూతప్రేత పిశాచములుగాని కలరా మొదలైన రోగములుగాని ఇంటిలో ప్రవేశించవని తురకల నమ్మకము.

హిందువులలో ముఖ్యముగా ఓఢ్రులలో ఉత్సవదినములకై గృహముల నలంకరించుటకు గోడలనెఱ్ఱమట్టిచేనలికి దానిపైవ్రేళ్ళతో చుక్కలు బెట్టుదురు. వరిబియ్యము మెత్తగారుబ్బి నీటిలోగలపి సుద్ధనీరువలె జేతురు. అందులో పంచాంగుళ్యగ్రములను ముంచి కూడదీసి గోడపైనద్దుదురు. వేళ్ళకొనలవల్లచుక్కలు పుష్పరేకుల యాకృతినిదాల్చును. ఇవియే పంచాంగుళీముద్రలై యుండును.

మనము మామిడాకులతో తోరణములు గట్టునట్లు పూర్వము పూలసరములతో గుమ్మములకు తోరణములు గట్టెడివారు. దారు *ఇసుకజల్లుచేలోకో? గచ్చులు లేవో ఏమో!

* ప్రవేశకలక్షణము:— భూత భవిష్యదర్థజ్ఞాపకత్వం అనుదాత్తోక్త్యానీచపాత్ర ప్రయోజితః। ప్రవేశోఙ్కద్వయస్యాంతః శేషార్థస్యోపసూచకః — దశరూపకమ్.

* రామాయణమునందు ద్వారములకు చందనము పూలహారములతో నలంకరించుట చెప్పబడియె. II. 8. 13 అంతఃపురస్యద్వారాణి సర్వస్య నగరస్య చ చందనస్రగ్భి రర్చ్యంతాం ధూపైశ్చ ప్రమాణ హారిభిః॥

ఇప్పుడు అంతఃపురస్త్రీలు చూచుటకు వచ్చెదరని ప్రతిమాగృహము నలంకరించుచున్నారు. పట్లు గూడఁ దుడిచినారు. ఎన్నిదినములనుండి ఈఇండ్లను శుభ్రపరచలేదోగదా? ఇవిశ్మశానముల వంటివేగాన యెప్పుడోగాని తరుచుగా వీటివిదుడుచరు. శ్రార్ధము పెట్టినప్పుడల్లా ఇట్టివిశాశిలను జూతురు. కొన్నికొన్ని జమీందారీ స్థలములలో నిట్టిగృహములు నేటికిని ఉన్నవి.

ఊరివెలుపల ఒకయావరణజేసిఅందులో జమీందారు కుటుంబములో చనిపోయినవారిని దహనము చేతురు. తరువాత దహనమైన స్థలమందు దేవాలయమువలెనో లేక తులసికోటవలెనో ఒక కట్టడమును గట్టెదరు. మాసశ్రార్ధము జరుగునప్పుడో లేక సంవత్సరశ్రార్ధము జరుగునప్పుడో యీగృహములను శుభ్రిపరతురు. ఈమధ్య జమీందారుని కుటుంబములో నెవరైనా ఈశిలను జూచుటకు వచ్చువెడలకూడా ఈగృహములను శుభ్రిపరతురు. ఈగృహములలో ముఖ్యుల ప్రతిమలను చేయించి ఉంచుటయు నాచార మున్నదిగాని చాలాఅరుదు. ప్రతిమలు ప్రతిమాగృహములు—వీటి విషయమై ప్రత్యేకముగా నొక వ్యాసము వ్రాయవలసి యున్నది. అందువీటివిషయమై విస్తారముగా చర్చించబడును గావనిచ్చట ఇంతటితో విరమింతును.

రెండవ భాగము:— భరతుడు మేనమామగారి యింటినుండి అయోధ్యకువచ్చుట ఇందుజెప్ప బడినది. భరతునికి సూతునకు జరిగినసంభాషణను బట్టిచూడగా దశరధునికి జబ్బుగానుండెననియె. భరతునికి తెలిసినదిగాని తండ్రిమృతుడయ్యెనని తెలియదు. రామాయణమునందుగూడ వశిష్ఠాదులు దూతలతో ఇట్లెజెప్పుచున్నట్లున్నది. II. 68.

8. మాచాస్మై ప్రోషితంరామం
మాచాస్మై పితరం మృతమ్।
భవంతశ్శంసిషుర్గత్వా
రాఘవాణా మిమంక్షయమ్।

రాముఁడడవికి వెళ్లినట్లుగాని దశరథుఁడు మృతి నొందినట్లుగాని చెప్పవద్దని జెప్పినారు.

దశరధునికి చాలాజబ్బుగా నున్నదనిన్ని, జీవించుటకు దైవమేదిక్కనిన్ని సూతుఁడు జెప్పగా భరతుని హృదయ మెటులుండునో కాంచవలసినదే. తండ్రి విషయమైనచింత తప్పమరియేఇతర తలంపులు యుండగూడదు. అయితనుభరతుడు రధగమనమును వర్ణించును. అవర్ణనైన సూతన మనోభావములను సరిగాలేదు. (౩).

ఇచ్చట సారధి చెట్లను జూచి అయోధ్య సమీపమునకు వచ్చితిమని జెప్పనది రామాయణములో భరతుడే జెప్పినట్లున్నది,

II. 71. 19. ఏషా నాతిప్రతీతామే
పుణ్యోద్యానా యశస్వినీ।
అయోధ్యా దృశ్యతే దూరా
త్సారథే పాండుమృత్తికా॥

అయోధ్య సమీపించు చుంటిమని సారధిచెప్పినప్పుడు సంతోషముతో నున్నవాడు తలంచినటులే తలంచునుగాని తండ్రికిచాలా జబ్బుగా నున్నదని సారధి జెప్పినదిమనస్సునకు తాటినట్లె గనిపించదు. తానుతండ్రిపాదములకు నమస్కరించెదననిన్ని తల్లులను కౌగిలించెదననిన్ని, అన్నదమ్ములను కలుసుకొనెదనని ఈమొదలైన వాక్యములు బలుకుచుండె, సారధి విచారించును.

ఊరి వెలుపల చేరినతోడనే ఒక భటుడువచ్చి ముహూర్తము మంచిదిగాదు. మంచి ముహూర్తము వచ్చువరకు గ్రామములోనికి రాగూడదని వశిష్ఠగారు చెప్పినట్లు చెప్పును. ముహూర్తము నొక్కనక్షత్రము వల్లనే చూచుటలవాటు కవికాలములో నుండెడిదిగాబోలు. ఈరోజులలో తిథి వార నక్షత్రము లను చూచెదరు. రామాయణమందు గూడ నొక్కనక్షత్రమును బట్టియే ముహూర్తము పడిగట్టబడినట్లగు పడుచున్నది.

రాముని పట్టాభిషేకమున కిట్లు ముహూర్తము నిర్ణయించ బడియె. II. 14.

42. త్వరయన్త్య మహారాజం
యదాసముదితేః హని
పుణ్యేనక్షత్రి యోగేచ
రామోరాజ్య మవాప్నుయాత్॥

గురువులాజ్ఞను మన్నించి భరతుడు అచ్చటరథము దగ్గ ప్రతిమా గృహమును చూచును. గుఱ్ఱముల విప్పి తీసుకు పొమ్మని సారథికి జెప్పితాను ఆదేవాలయమును చూచుటకు పోవును.

మూడవ భాగము:- అలంకరించియున్న మందిరము అను చూచి దేవతా గృహమనుకొనెను. శిఖరము పైనగాని వెలుపలగాని యేచిహ్నము లేక పోవుటచే అందులో యేదేము దున్నాడో తెలుసుకోలేకపోయె. లోనికి వెళ్ళియూ చెదవని లోన ప్రవేశించును. అచ్చటరాతితో చెక్కిన 4 విగ్రహములున్నవి. మనోగుణములు ముఖములందు గన్పించుచున్నవట ఆహా! యేమి శిల్పము! దేవతా విగ్రహము లైనప్పటికిని మనుష్యరూపములని నమ్మకము పుట్టించుచున్నవి. అచ్చట నాలుగు విగ్రహము లున్నవట! యెవరైతే నేమని నమస్కరించును.

ఏ దేముని విగ్రహములో తెలియదు. కాన ఏధ్యాన శ్లోకమూగాని మంత్రముగాని చెప్పవలెనో తెలియదు. గావున విమంత్రపఠనము లేకుండగ నమస్కరించును. అట్లు నమస్కరించు వాడు వాషన్ లుడట.

ఆసమయములో పూజారి ప్రవేశించును. వారిద్దరి వాక్యోప వాక్యములు వెంతసాగుగా భరతునికి యావద్వృత్తాంతమును తెలుపును. అహితమైనదిగాని విస్తారము సంతోషమును కలుగచేయునదిగాని యొక్కుమారుగా తెలిసిన జనులు మనోధైర్యము చెడి మృతులైన నగుదురు. లేదా పిచ్చివారైన నగుదురు. కాన చెప్పవలసిన సంగతిని క్రమేపి కొంచెము కొంచెముగా జెప్పవలె. మొదట నావిగ్రహములకు నమస్కరించ వద్దను కారణమడుగగా అవి క్షత్రియుల విగ్రహములనియు వారివారి గొప్పదనమునున్ను జెప్పును.

ఇచ్చటప్రసంగమునుబట్టి భరతుడు బ్రాహ్మణుడువలె గన్పించెను. గనుకనే క్షత్రియుల విగ్రహములకు బ్రాహ్మణుడు నమస్కరింప గూడదని నమస్కారము చేయ వద్దనియె. బ్రాహ్మణుడని అనుకొనుటకు పైచిహ్నము లేమైయుండునో? శిఖయజ్ఞోపవీతము లెముఖ్యచిహ్నములు. అందులో నూకిని లేముఖ్యములు. క్షత్రియులవలె గాక బ్రాహ్మణులవలె భరతునకు శిఖనుంచుకొనెను గాబోలు. తరువాత బట్టలను ధరించుట గూడ బ్రాహ్మణులవలె నుండి యుండును. శిఖోపవీత ధారణలు జాతిభేదములు వృత్తిభేదములను వెలిబుచేయు బహిర్చిహ్నముగదా! నేడు వాటిని ఖ్యాతి తగ్గిపోవుటచే అందరూ ఒక్కటై అయిపోయినారు.

అవిగ్రహములు దిలీపును రఘు అజుడు దశరదులవట వారల శౌర్యపరాక్రమములు వర్ణించబడియె. మొదటి ముగ్గురి ప్రతిమల విషయమై అడుగక బ్రతికి యున్నవారి విగ్రహములు గూడ వుంచెదరాయని ప్రశ్నించును. తన తండ్రిరూపును ఈ విగ్రహము గుర్తించలేదు. లేక గుర్తించి తండ్రి బ్రతికి యున్నవాడని నమ్మియున్నాడు గాన అవిగ్రహము తన తండ్రిదైయుండునని తలంచి యుండక పోవచ్చును. కాని దేవలికుడు మాత్రము దశరథుని చావు అందుల కారణమును తెలియ బరచును.

రెండవ అంకము చివర దశరథుడు చనిపోయినట్లు చెప్పె. యిచ్చట దశరథుని దహనాది క్రియలు జరిగిపోయి అతని ప్రతిమను స్థాపించినట్లు జెప్పె. భరతుడు రానిదే దశరథునికి అపర క్రియలెట్లు జరిగె. శత్రుఘ్నుడు అయోధ్యలోనే యుండి యున్నాడు. గాన అతను అక్రియలు చేసియుండవచ్చు. ఈవిషయములో కవి రామాయణమునకు భేదముగానబడె. భరత శత్రుఘ్నులిద్దరు కేకయరాజస్థానముకు వెళ్ళియున్నట్లును

అందుచే దశరధునికి దహనాది సంస్కారములు చేయుట కెవ్వరును లేకపోవుటచేతని కళేబరమును తైలద్రోణములో వేశి భరత శత్రుఘ్నులువచ్చు పర్యంత ముంచినట్లును రామాయణములో జెప్పియున్నది. శవములను తైలద్రోణములు మొదలయినవాటివల్ల కుళ్లిపోకుండా యుంచు క్రియలు కవికాలములో తెలియక పోవచ్చును. లేదా చనిపోయిన వారి ప్రతిమ అను చేసి యుంచుట విశేష ఆచరణలో నుండియుండును. ఈకాలములో వలె రాజ కుటుంబములలో ఈప్రతిమా స్థాపన మనే యాచారముండియుండును. దీనినిబట్టి చూడగా భాసుడుఏదోయొక రాజ సన్నానములో నుండియున్నవాని వలె తోచుచున్నది. ఈ యాధారముపైన కధకొంచెము మార్చి వ్రాసెను. వాల్మకభాగము:— తల్లులను గలుసుకొనట, కైకను దూషించుట ఇందుజెప్ప బడరు.

(క) తల్లిచేతి స్పర్శజలము లేనిజలాంజలిట పిల్లలకు! అనగా తల్లిముట్టుకొనగా పిల్లల తాపమణగును అని.

(ఖ) ఈప్రతి మాగృహము రాజభవనము కన్న ఎత్తైనదట.

(గ) భరతుడు కౌసల్యకు వందనము జేయుట, రామాయణము II 75. 20.

ఆర్యే! కస్మాదజానంతంగర్హ సేమామకిల్బిషమ్
విపులాంచమమప్రీతిం స్థిరాంజానాసి రాఘవే॥

(ఘ) ఇందుకు కౌసల్యఅన్నది II. 75. 61

మమదుఃఖమిదంపుత్రభూయస్సముపజాయతే
శపథైశ్శపమానోవాప్రాణానుపరుణత్సిమే॥

(ఙ) సుమిత్రజేసిన యాశీర్వాదముకు రామాయణముII. 74.

30. అహంహ్యపచితింభ్రాతుః
పితుశ్చసకలామిమామ్,
వర్ధనం యశసశ్చాపి కరిష్యామి వనంశయః।

(చ) ఇందుపచూనమెంత చక్కగ నున్నది గంగయమునల మధ్యమునకి కాల్వట!

(ఛ) రామాయణము II 74.

6. త్వత్కృతే మేపితావృత్తో
రామశ్చారణ్య మాశ్రితః।
అయశో జీవలోకేచ
త్వయాఽహం ప్రతిపాదితం॥

7 కౌసల్యాచ సుమిత్రాచ
యాశ్చాన్యామమ మాతరః।
దుఃఖేన మహతాఽవిష్టా
స్త్వాంప్రాప్యకుల దూషిణీమ్॥

(జ) తల్లి దుర్మార్గురాలైన యెడల పిల్లల అభిమానము చెడిపోవును, దానిచేతనే కైక తనతల్లి సాధవిని భరతుడు రామాయణమందు చెప్పిన దూషణలన్నిటికంటె ఇదియెంత క్లుప్తముగాను మాధుర్యముగానున్నదో!

(ఝ) రామాయణము II. 72,

49. మయాహ్యపుత్ర శ్రుత్వైవ
రామస్యైవాభిషేచనమ్॥
యాచితస్తే పితారాజ్యం
రామస్యచ వివాసనమ్॥

50. సస్వవృత్తిం సమాస్థాయ
పితా తేతిత్తథాకరోత్।
రామశ్చసహ సౌమిత్రిః
ప్రేషితస్సీతయా సహ॥

(ఞ) రామాయణము. II. 73.

20. అస్మిన్కులేహి పూర్వేషాం
జ్యేష్ఠోఽరాజ్యేఽభిషిచ్యతే।
అపరే భ్రాతరస్తస్మిన్
ప్రవర్తంతే సమాహితాః॥

తరువాతి వాక్యములలోని యంశములు రామాయణములోనికైనను మనోహరముగా కొద్దిమాటలలో నిమిడ్చియున్నవి. తల్లికొడుకు ఇట్లుమాట్లాడుచుండగా వశిష్టవామదేవులతో పురజనులందరూ భరతుని తో మనవి చేసుకొనుటకు వచ్చిరి.

ఐదవభాగము:- ఇచ్చటనుండి కొసకు రామాయణము II. 82 వ సర్గలో చెప్పబడి యున్నది. వశిష్టవామదేవులు పట్టాభిషేకము చేసుకొమ్మని అడుగుట, భరతుడుతప్పక రామునిపిల్చుటకు వత్తును రండని వార్నితీసుకొని అడవికివెళ్లుట. ఇది ఆరామాయణా భాగమందున్నది.

(ట) పురజనులు చెప్పినదిరామాయణము

29 అగోపాలయ గావ స్తథారాష్ట్ర మరాజకమ్॥

(డ)పట్టాభిషేకమీమెకు చేయండిఅనుటయేమి సారస్యము. తనకుఇష్టములేక పోయినప్పటికి ఆమె కోరిరాజ్యమును తెచ్చుకున్నది. గానఆమెనే అనుభవించనీయుడు. అనిదానికర్థము.

(ణ) రాముడిచ్చటయుంటెఅచ్చటెఅయోధ్య అనునది యిప్పుడీ సామెత ఆయిపోయినది.



## శారదా!

(అదిపూడి వసుంధరాదేవి, బి. ఏ. గారు.)

చ. సరసకళా సమన్వితరసావహామై వెలుగొందు నీమరూ
పరసియుగాడ సంతతము భక్తిని జూపుట నిద్యమాచునిన్
పరుసము నెన్నచేసి ప్రజపల్కినపల్కును జెందకుండ నీ
సరళమనస్సుజూపి మానస్థితి నందితిగాదె శారదా.

క. సరసంబులు నీపలుకులు సరసంబులు నీదురూప సౌభాగ్యంబుల్
సరసంబుగాను మెత్తురు సరసగుణాన్వితులు నిన్ను సర్వకళాశ్రీ.

సీ. శాస్త్రములందరు శాస్త్రవిద్యలన్నింటి నీ తత్వమును వ్రాయజూచుటకును
దేశచారిత్రముల్ తేటతెల్లముగాగ చదువు యత్నంబులు సలుపుటకును
చిత్రకళలయందు చెన్నమీరెడునట్లు నేర్పుజూపుచునుండ నెంచుటకును
పూర్వకాలంబున పూజ్యతనందిన దేశంబు ఘనతను దెలుపుటకును
యోచటనున్నను నీవిద్దెలెల్లలున్న వారినందర ప్రోత్సాహపరచునీవు
శుక్లపక్షంబునాటి చందురునివోలె తనరుచుండుము శారదా! తరతరములు.

గీ. కవిజనంబుల పాలిటి కల్పవల్లి ఆంధ్రదేశపు బిడ్డల యమ్మతల్లి
వాదనంబిదె యర్పింతు నందుకొనుము ప్రియవదన శారదా నీవుప్రీతితోడ.

# కోకిలము.

( అనంత పంతుల వెంకటేశ్వర్లు బి. ఎ. బి. యల్. గారు. )

మ॥ సమదోద్యత్పికరాజమా! బహుళసూక్ష్మస్థూలలోకాభిరా।
మము, విశ్వంబు; తదీయరంజనముఁ బెంపన్ దైవతం బాప్రపం।
చములందొక్కొక రూపమై వెలయుటల్ సత్యంబుగాఁ బక్షిలో।
కమునన్ విష్ణ్వవతారమీవని నమస్కారంబునేఁ జేసెదన్॥

కం॥ నీలీలాసదనము సుర। సాలము, జీవంబు చిర వసంతముగానా!
లోలభవదీయ సుస్వర। పాలితనవ్యామృతంబు పానమునీకౌ॥
కం॥ కాలంబుల నామని, తరు। జాలమున రసాల మొకఁడు, సర్వమధువులన్।
లీలాగానామృత, మివి। పోలు, మహేశాంశములయి ముదమిడనీకున్।

ఉ॥ నీచపుకాకి మూఁకనడి సేదగుఁ ద్రుత్రి మజన్మ చిత్రముల్।
మేచకదేహ కాంతియును, మేమరసత్క విభావవార్ధిపై
చీచలవ ప్రదక్షమగు జీవకళాంచిత పంచమస్వర।
శ్రీచయమున్ దలంచినిచుఁ గృష్ణుఁగా గనిసంత సించెదన్।

కం॥ శ్రీవేణు గానమున గీ
తావిషయము లంద మొప్పఁ దాండవ కృష్ణుం
డేవాయించెడు వదిగో!
నావినియెద నీకలస్వనము కోకిలమా!

ఉ॥ నాకములోన నందనవనాంతర కల్పకశాఖ నుండి వా।
ల్మీకి కవిత్వధార యటులే భవదీయరుతుల్ సెలంగివన్।
జేకురు నూత్నమా వమృతసేచన మాసురరాజికక్కటా।
నీకొరతల్ దివంబునకు నీరససౌఖ్యములే పికోత్తమా!॥

శా॥ నీ కూఁత ల్నవచూతముల్ జనమనోనీకంబు సంపూర్ణ మో।
దైకశ్రీఁ జిగిరించుటల్ తెలియునాఁడే నస్మృతిన్ "సృష్టిలీ।
లాకర్మంబు, తదిచ్ఛయన్ గలుగనేలా? యీశుఁడానందగా।
నాకారుండయి పాడ సర్వ ముదయంబై వృద్ధియౌ" నంచు శా॥

మ॥ తొలుతన్ తావక నిస్వనంబువిని సంతోషాంబుధిన్ దేలుచున్।
పలుమాఱ్శైశవ చాపలంబునఁ బ్రతిధ్వానంబు నేఁ జేయగన్।
లలితోన్మాదముఁ జెంది రోజు పొడుగున్ కంఠంబు పూరించినా।
కెలమిన్ గూర్చెద; వక్కటా! యిపుడు పోయెన్ నాకు తత్కాలలం।
బులు; నీకూతయుఁ బ్రాతిగా వినబడున్; భూలోక సంబంధ కా।
ర్యలయంబై, జడమై, మదీయహృదయంబాలింప దీవెప్పుడో।
పలుకన్; బాల్యముతో గతించునో హా! దేవాంశంబుత్మో జన్ములన్॥

గీ॥ కలుగు గంభీరభావాత్మ కత్వదీయ।
గాన సంస్మృతి నేడు నామానసమున।
చాలనాకది; కవిగాన మేళనమున
నీస్వభావ సంగీతమో నేను విందు॥

గీ॥ నీకుఁ గవికిని గల చిరస్నేహమునకు।
బాల్యయౌవన కౌమార వార్ధకములు?
లేవు లేవులేవని కూసెదీవు; చింతఁ।
బూను నాహృదయము శాంతిఁ బొందనిపుడు॥



# నా బొంబాయి ప్రయాణము.



నేను చెన్నపట్టణము కలకత్తా చూచాను గాని బొంబాయి యెప్పుడు చూడలేదు. ఆ పట్నాన్ని చూడాలని మనసైయింది. అక్కడ పడమట నాగరికత తూర్పు నాగరికత సంగమిస్తూ వుంటుందంటారు. మన దేశానికి అది ముఖద్వారం. మంచిరోజు చూచుకొని బయలుదేరాను. రైలులో ఎక్కినప్పటి నుండి ముందొచ్చే సంగతులను గూర్చి మెచ్చటించడం ఆరంభించాను. అదృష్టవశం చేత నేనెక్కిన బండిలో మా బందరు ములకపట్నం సాహేబుల చిన్నవాడు ఒకాయన ఎక్కాడు. ఆయన మంచి సౌమ్యుడు. మహమ్మదీయుడైతే నేం. వాళ్లలో కొంత మందికి తెలసిన మర్యాదలు మనకు తెలియవు. ఆయన బి. ఏ. ప్యాసైనాడు. కొన్నాళ్లు నైజాము ఇలాకా ఉపాధ్యాయుడుగా పని చేసి మానుకొని మన గవర్నమెంటులో నౌకరీ మంచిదని వచ్చాను. ఆ సంగతి నాకాయన చెప్పగానే అక్కడనుండి నైజాం నైజాము యొక్క పరిపాలన అక్కడి ప్రజలు హిందూ మహమ్మదీయ స్పర్థలు అన్నీ మా బాతాఖానీలో దొర్లినాయి. అవన్నీ చెప్పనక్కరలేదు. చాలామందికి తెలుసు. అయినప్పటికీ నైజాము నుండి మనుష్యులు కనబడితే మళ్లీ ఒకసారి అంతా ఏకరువుకొస్తుంది. కొంతసేపైన పిమ్మట, నాతోడి మహమ్మదీయ ప్రయాణికుడు.

"అయ్యా, నేను భోజనము చేయాలి. చేయవచ్చునా!" అన్నాడు.

నేను— "అయ్యా, నేను శాస్త్రపాలిటను. నాకు కూడా పెట్టితే భోంచేస్తాను.

మ. ప్ర— అచ్ఛే మీకు పెట్టకూడదండి.

నేను ఆక్షేపణ లేదని చెప్పాను. నాకప్పుడాకలి లేదు. ఆకలిగా ఉంటే అడిగే భోంచేసే వాడను. అనినవ్వాను. ఆతడూ నవ్వాడు.

భోజనమైన తరువాత కూడ కులాసాగా బాతాఖానీలో బెజవాడ చేరాము. ఆయన దారిని ఆయన వెళ్లాడు.

నైజాం బండి దగ్గరకు వెళ్ళాను. అటూ ఇటూ పచారు చేస్తూవుంటే నా బాల్యస్నేహితుడొకడు కనబడ్డాడు. ఒకరినొకరు ఆనవాలు పట్టుకున్నాము. చాలా సంతోషించాం. ఎన్నాళ్లకు కలుసుకున్నామనుకొన్నాం. అతని చరిత్ర చెప్పడం ఆరంభించాడు. వైష్ణవుడాయన. తెలుగు అరవం స్వచ్ఛంగా మాట్లాడతాడు ఇంగ్లీషుకూడా మధ్యకేస్తాడు. బిడ్డలను శ్రీపెరుంబుత్తూరులో సంస్కృతం చదివిస్తున్నాడు. ఇంగ్లీషు నేర్పడానికి వేరే ప్రైవేటు ఏర్పాటు చేశాడట. వరంగల్లులో భూమి సంపాదించాడట. బంధువులందరూ గోదావరిజిల్లాలో వున్నారట. నైజాంలో భూమి సులభంగా సంపాదించవచ్చునట. అక్కడవాళ్ళు సామాన్యులట. దినము స్తమానం ఇప్పుడువ్వు సారా మీదనే శూద్రజనముకు దృష్టిట. ఈ దేశంవాళ్లుపోయి బాగుచేసుకుంటే ప్రత్తిపొగాకు పండించుకొని విశేషం సంపాదించుకో వచ్చునట.

నేను— అక్కడివాళ్ళు తాగుబోతులైతే మనం పండించుకున్న పంటను దక్కనిస్తారా?

ఆచా— నేనొకరాజాల పిల్లవాణ్ణి తీసుకొని వెళ్లి వానికొక తుపాకీఇచ్చి కొంచెమందలూ బెదిరే

టట్టు కాల్చిస్తూవచ్చా. మనమనిషి కొంచెం బెదురటంగా ఉంటే బెదిరి అణిగివుంటారు.

నేను- భలేవాడవయ్యా నీభూమికి నిల్లవసతి వుందా.

ఆచారి- అదుంటె ఇంకేం. దానికోసం నేనుచాలా పనిచేశా. లాభంలేకపోయింది. చెన్నపట్నం వెళ్లి డైరక్టరు ఆఫ్ ఇండస్ట్రీసుగారిదగ్గర సిఫారసు తీసుకొని వాయిదాలమీద డబ్బిచ్చేటట్టు ఒక ఇంగ్లీషు కంపెనీయొద్దనుండి ఎంజను పంపు ప్రయత్నంచేశా. అంతా ఇయ్యడానికి వచ్చే టప్పటికి బ్రిటిషురాజ్యంకాదు నిజాంరాజ్యమనేటప్ప టికి వాళ్ళు తోసేశారు.

నేను:- (తమాషకు) అదికూడా బ్రిటిషు అయితే బాగుండును.

ఆచా:- చాలుచాలులే బ్రిటీషయితే ఎన్నిదిక్కులను కున్నావేమిటి. ఇక్కడ ఏమైనా పనులు కావాలంటె కావు. అక్కడ లంచం పెడితే నిముషంలో అవుతాయి. ఇప్పుడు నేను తరచుగా రైలుమీద కుటుంబంతో ప్రయాణం చేస్తుంటాను. టిక్కెటుకొనగలనా!

నేను- అయితే ఇవాళకూడ టిక్కెట్టులేకుండానే నా ప్రయాణం.

ఆచారి- అదేచూస్తున్నా. కన్నెరిగివున్నవాడు వచ్చా డోలేదోచూచి కన్నెరిగినవాడు కాకపోతే వాడిమొఖాన ఇంత పారవేసిపోతా. అని నిష్క్రమించాడు.

నేనుసామాను బండిలో పెట్టించుకొని పైబల్ల మీద పక్కవేసుకొని పడుకున్నా.

తెల్లవారింది. ఒక్క విషయంలో అన్నిబండీలలోకి అధ్వాన్నంబండి నిజాంబండి, బండీని అన వసరించిలేను. బండిలోఎక్కిన మనుష్యుల నవాలి. పెద్దపెద్ద సాహెబులుసహితం వేషాలుబాగావేస్తారుగాని బీడీలుకాల్చి బయటకు మ్రొయ్యారు. అంతా లోపలే. అదిఒకపోను అనుకుంటాను. టిక్కెట్టు ఇచ్చి కూర్చున్నాడు. ఉమ్మి వేసుకోటానికి లోపలే. అగ్గిపుల్ల ఆర్పేసిలోపలే. బీడీ ముక్క లోపలే. తానుతిరిగిపోతాడుగా. రైలుఎట్లావుంటేనాకి కేం, చూడండి స్వరాజ్యం.

నిజాంరాజ్యం ఎంతపెద్దది! బయళ్లుగట్టుల యొంతవిశాలం! నిజంగా దీనికి తగిన రైతులుతెరు. వున్నవాళ్లకు ప్రోత్సాహంలేదు. ఏమన్నా పండించుకొని బాగుంటే జాగీరుదారులు పట్టుకొని పీకిస్తారు. వాళ్ళుపీడించే తేవులు పైకున్నాయి. ఈకష్టార్థ చిత్తగించడానికి యెవనికి పట్టింది. నిజమే ధర్మరాజ్యం ప్రజలు సంతోషిస్తుంటారు.

తెల్లవారు వచ్చటికివరంగల్లువచ్చాం. వొక్కరి నోటమ్మటి తెనుగురాదు. యాసగా వుంటుంది. ప్రతాపరుద్రునిరాజ్యం. బమ్మెర పోతనకు కనపడిన సరస్వతి దేశం విడచి పెట్టి పోయింది కాబోలని పిస్తుంది.

సికిందరాబాదు పదిఘంటలకొచ్చాం. హోటలులోనికి పోయి అన్నం తెచ్చుకున్నాం. దారితోవలో స్నేహితులు దొరికారు. హైదరాబాదు వచ్చేటప్పటికి నాకుదిట్టమైనస్నేహితుడు. అజానుబాహు మనిషీనల్లగా గ్రామసాలవర్ణం కదలాడుతుంటే వృక్షస్తంభం కదలినట్టుంటుంది. మాట్లాడితే వురిమి నట్టు వుంటుంది. నిజమైన ఆంధ్రుడు దేశాభిమానం క్రిందనుండి పైదాక. రైయిలులో మహాసందడిగ వుంది. మేము బట్టలు పరచుకొని కళాయి గిన్నెలలో అన్నం పెట్టుకొని నేను తెచ్చిన చింతకాయ పచ్చడి నెయ్యికలిపితినడమారంభించాం. బహురుచిగావుంది. మాపాల గ్రామమూర్తిమాకు అన్నంవడ్డించడములో సహాయంచేయుచు యొక్కొక్కమాట గట్టిగాచెప్పే టప్పటికి అది అరిగి పోతూ వుంది.

వొంటిగంట అయ్యేటప్పటికి వాడీ జంక్షన్ చేరినాము. అక్కడ అంజూరాలు కమలాలు మామిడి పండ్లు కావలసి వున్నయున్నవి. చక్కగా ఫలహారంచేసినాం. మద్రాసునుండి రైలువచ్చింది. దానిలో ధర్డుక్లాసు యూరపియను కంపార్టుమెంటు దగ్గరకు వెళ్లాము. ధర్డుక్లాసునేమిటి యూరపియన్ కంపార్టుమెంటే మి. టి రి జ ర్వ డే మి టి కి

వర్ణములేని యూరపియనులకు వర్ణం తెచ్చి పెట్టారేమి! యూరపు దేశములో ఉష్ణవర్ణంగా ఈకాలంలో వర్ణమంతా దబ్బులోనికి మించిన తరువాతకూడా రైలువారు వేరే వర్ణం తెచ్చిపెట్టారేమి అనుకున్నాం. అందులో నలుగో తెలుపోకాని యొక టోపి వాడు కూర్చున్నాడు. మేము మా వైదిక వేషంతో అక్కడకు వెళ్లాం. తలుపుతీశాం వేసుకున్నాడు. మేము యింగ్లీషు మాటలాడకుండా హిందూస్థానితో దర్వాజా ఖోలోజీ అన్నాము. వాడనుమానించాడు. ఇంతటిలోకే యింకొక యువకుడు టోపీ నిక్కరు బూట్సు వేసుకొని సామానుతో వచ్చాడు. తలుపు తనదగ్గరనున్న తాళంచెవితో తీశాడు. లోపలప్రవేశించాడు. ఆయనతో మేమున్నూ ప్రవేశించాము. దొరగా రడ్డం చెప్పలేదు. అచ్చాయని నేనప్పుడే కనిపెట్టా. మనతమిళ బ్రాహ్మణ చిన్నవాడు యెంత దాచుకుంటె నేం ముఖ కవళికే తెలుస్తుంది.

మేమందరము లోపలకుపోయి కూర్చున్న పిమ్మట.

'you are all Brahmins. I suppose' అని అరవ చిన్నవాడు అంటుటోపీతీసి తన సామానుపైన పెట్టినాడు.

'Yes' అని నేనున్నూ నాస్నేహితుడును వొక్కసారిగా అన్నాము.

'I am not a Brahmin. My father was a Brahmin అని యింతకుపూర్వము యూరోపియను వేషమున నున్నవాడు చమత్కారముగా అన్నాడు.

'You have now become a Europeon I suppose' అని నేనును తమాషాగా అన్నాను.

'you too are Euapeons at heart' అని జవాబిచ్చాడు.

'yes, yes. There is great clash of civilizattions going on in our hearts now అని నేనన్నాను

అందరం స్నేహితుల మైనాం. ఒకరి సంగతులొకరికి చెప్పుకున్నాం. మనబ్రాహ్మణక్రైస్తవునిది గొప్పయేముందికాని అరవ బ్రాహ్మణ క్షత్రియవాని వయ్యాధైర్యం యిక్కడకు నాలుగు నెలలనుండి రైలు మీద ప్రయాణం చేస్తూ యిండియా అంతా తిరిగి వస్తున్నాడట. లిమిటెడు కంపెనీలు అన్ని అడిటు చేస్తూవున్నదట అతనిపనేమ్. దానికి బ్రాంచీలు యిండియా అంతావున్నవట. రైలు కంపార్టుమెంటులోనే లెక్కలు తెప్పించుకొని అతనికి చూస్తున్నాడట. అపరములో వుద్యోగం సంపాదించి లెక్కలేకుండా యెట్లా తిరుగుచున్నాడో చూడండి. మన ఆంధ్రుల కుర్రలలో యింతమాత్రం ధైర్యముగా తిరిగినవారు నాకు కనబడలేదు. ఒకవేళ యుండినా యింత వుల్లాసంగావుంటాడని తోచదు. అరవవాళ్ళు యెట్లాగైనా చొరవగా దేశాలు తిరుగుతారు. మనకుర్రవాళ్ళు అట్టే యిల్లువదలేవారు కారు.

సూర్యాస్తమయమైనది ఆసమయంలో ఆయెత్తైన భూమిమీద దృశ్యం యెంత అందంగావుందో చెప్పతరముకాదు. బంగారుపోతభూమికిని ఆకాశానకు పూసివల్లున్నది. నాస్నేహితుడు గంభీరంగా భగవన్నామసంకీర్తన చేశాడు. అందరం ఆనందమును అనుభవించాం. చల్లగాలివీచింది. సుబ్బవేపికొంచెం వానకురిసింది. తరువాతమరల సాయంకాలం ఫలహారం చేశాము. నే తెచ్చిన పులుసటుకులు అందరికును పంచిపెట్టాను. నాస్నేహితులును వారి వారికి ఇష్టమైన వస్తువులు రైలుష్టేషనులోకొని అందరికిని పంచిపెట్టుచు వచ్చిరి. ఇట్టి ప్రీతిభోజనముల వల్లకదా సోదరభావం ఏర్పడుతుంది!

రాత్రిరెండు ఝాములకు పూనాపట్టణం చేరాం. అనురునాడు పూనాలో తెనుగు సమ్మేళనం. ఇదివరకు పదిసంవత్సరముల క్రిందఅయినది. మొదటిది బొంబాయిలో జరిగినది. ఈసారి పూనాలో పెట్టారు. వాలంటీరులు ష్టేషనుదగ్గర ప్రతినిధులను కలుసుకొని విడిదలకు తీసుకపోవుచున్నారు. మేము కూడా వచ్చిన నాయక నాయకీమణులతో కలిశాం. పాపం ఆవాలంటీయరులకు ఎంత సంతోషం. తెలుగు మాటలాడవలెనని వారికెంత అభిలాష. వారి దేశభాషాభిమానమును రక్షించవది వారికెల్లను.

మగవాళ్లు ఆడవాళ్లవల్లనే ఇంకా కొంచెం భాషను జ్ఞాపకముంచుకొన్నారు. మేమువాళ్లను ఉత్సాహించేస్తే ఇంకా బాగా మాట్లాడుతున్నారు.

శివాజీమహారాజు కాలం నుంచి తెలుగు నాయకులు సేవలలో పనిచేస్తు వచ్చినట్లు కనబడుతుంది. అప్పటికాలం వాళ్లు బహుశః పూర్తిగా మహారాష్ట్రులే అయిపోయి వుంటారు. తరువాత తూర్పు ఇండియా కుంఫిణీ వారితో వచ్చిన కుటుంబాలున్నాయి. ఆకుటుంబాలలో ఒకటి ఆయన ఈసమ్మేళనకు ఆహ్వాన సంఘాధ్యక్షుడు. ఆయనపేరు డాక్టరు బుర్రయ్య జాలయ్యా లక్కా. సభకు అధ్యక్షుడు బొంబాయి పురంలో జస్టిసు ఆఫ్ పేసు అను బిరుదు పొందిన రాయాజీనాగూజీ. వారలపేరులు చిత్రంగా ఉన్నవి. మహారాష్ట్ర పద్ధతిని పెట్టుకున్నారు. సమ్మేళన సభలో బొంబాయిప్రాంతి వారులుకూడ కొంత మంది వచ్చీరాని తెనుగులో సంభాషించిరి. వారికి మహారాష్ట్రం వాడుక భాష అయినది. అయినను తమవాండ్రకు తెనుగు చెప్పించాలని లోకలు బోర్డుల వన్నికడ లిస్తున్నారు.' బొంబాయిలో ప్రైమరీస్కూళ్లలో తెనుగుకూడా చెప్పించుట కేర్పాటు చేయుట కాందోళన చేయుచున్నారు. యూనివర్సిటీలో కూడా తెలుగు కవకాశం చేయుటకు కోరుచున్నారు. వీరు అన్నిటికంటె మిలిటరీలో తెలుగు పటాలము లుండవలెనని పట్టుపట్టుచున్నారు. వైసరాయిగారి యుద్ధకు డెప్యుటేషను పోవలెనని అనుకుంటున్నారు. ఇంకను సాంఘిక విషయములను గూర్చి సభలో చర్చించినారు. ఇట్టి ప్రయత్నములకు అసలు ఆంధ్ర దేశపు నాయకులేమి చెస్తారో చూడవలసి యున్నది.

ఈబొంబాయి ప్రాంతములలో నున్న ఆంధ్రులవిశేషం హైదరాబాదు నుండి వచ్చినారు. మొదలు వచ్చినవారు చాలమంది కూలినాలి చేయుటకు వచ్చినారు. అందుచేత కామాటీలుఅని పేరు పొందినారు. అందులోనుండియు అనేకమంది కష్టము చేసి చివరకు గొప్ప శ్రీమంతులును విద్యావంతులును అయినారు. వెనుకటి వృత్తాంతముచెప్పి కళంకముగా వాదించడం న్యాయంకాదు. తిన్నగా వెదకిచూస్తే అందరికి ఎప్పుడో ఒకప్పుడు ఈకళంకం ఉండేఉంటుంది. అయినాకాయ కష్టపడి సంపాదించినది కళంకంగా మాత్రం ఎందుకు చూడాలి. ఓడలు బండ్లవుతుంటాయి. బండ్లు ఓడలవుతుంటాయి. పేదరికము శ్రీమంతత్వము బండికండ్లవలె తిరుగుతుంటాయి.

ఈతెలుగువారే పెద్ద కంట్రాక్టరులుగానుండి బొంబాయి పట్నంలో పెద్దపేరు గాంచిన బిల్డింగులు కట్టించారట. హైకోర్టు రాజాబాయి గోపురము మలబారు కొండ దగ్గర గొప్ప భవనములు వారు కట్టించినవే. ఇప్పటికిని చాలాగొప్ప కంట్రాక్టులు వీరిచేతులలో నడచుచున్నవి. వీరిలోనుండి గొప్ప ధర్మములు చేసినవారుకూడ వచ్చియున్నారు.

తెలుగు సమ్మేళనముకు పునహాలోని సమస్తవర్ణముల వారిని ఆహ్వానసంఘమువారు కష్టపడి పిల్చినారు పంచములు మందులవాళ్లు మొదలుకొని ఉత్తమవర్ణముల వారివరకు వచ్చినారు. వీరిలో ఇంత కలయిక కలిగినందుకు మహారాష్ట్రులుకూడ ఆశ్చర్యపోయినారు.

బొంబాయిలోనున్న ఆంధ్రులు ఏదోవిధంగా తంటాలు పడుచున్నారు. ఆంధ్రరాష్ట్రంలో సరే. ఏదోగొప్పజాగరణ కలిగిందనుకుంటున్నారు. నిజాంలోవున్న ఆంధ్రులమాటేమి. హిందువులకు మొత్తం మీద ప్రోత్సాహం లేదంటారు. అందులో ఆంధ్రులు వెనకబడి వున్నారు. దేశం చాలాభాగం ఆంధ్రం. అయితే ఏమిలాభం. ఆంధ్రులకుకూడా యూనివర్సిటీ పెట్టితావని నిజాము సర్కారువారంటారట. ఎప్పుడు ఏలాగు జరుగుతుందో తెలియదు. వనపర్తి గద్వాలలు వైభవ్యమును పొంది యున్నాయి. ఈఆంధ్రుల అవస్థనుగూర్చి అక్కడివారువచ్చి సమ్మేళనందు చెప్పబోసుకొన్నారు. నిజాంఆంధ్రం తెలిసి మారితేనేగాని ఆంధ్రరాష్ట్రంకు గొప్పతనం రాదు. దీనికి ఇటు బొంబాయినుండి అటు ఆంధ్రరాష్ట్రము నుండి ఆందోళన కలగాలి. ( శేషము )



ఒక ఆంధ్రుడు.

# యుగధర్మానుష్ఠానము.

( క. రాజేశ్వరరాయుడుగారు )

ప్రేయసీ,

వివిధ ధర్మముల ప్రకృతిని గూర్చి నీకొక యుత్తరము వ్రాసి యుంటిని. అందియుండును. అందలి విషయముల హృదయంగమ మొనర్చుకొనుచున్నావని నమ్ముచున్నాను. ఏవిషయమైనను చదివినమాత్రముననే ప్రయోజనములేదు. అందలి విషయమును స్ఫుటముగ గ్రహింపవలయును. భావనామననము చేయవలయును. ఇప్పుడు యుగధర్మానుష్ఠానమును గూర్చి వ్యక్తీకరింపుచున్నాను. దీనిని బాగుగ చదివి యిందలి భావమును జీర్ణమొనర్చుకొని నీకుగల సంశయములను వివరింపుము. దానికదగిన ప్రత్యుత్తరమిత్తును.

కొలది దినముల క్రిందటనే నేనొకగ్రంథమును చదివితిని. అదిభారతీయుల వర్ణాశ్రమధర్మములకు సంబంధించినది. దానిగ్రంథకర్త యూరపుదేశీయుడు. అతడు సంకుచితదృష్టితోడ నీవిషయమును విమర్శించెను. "భారతవర్షమందు విదేశస్థుడైనను చాలకాలము నివసించినయెడల వాడుతన ప్రాచీన జాతీయతను గోల్పోయి సర్వవిధముల భారతీయుడైపోవును. దీనికిని భారతవర్షమందు బుట్టినవానికిని మిక్కిలిభేదము గానరాదు. ఇదియే భారతవర్షము యొక్క విశేషత్వము" అనినుడివియున్నాడు.

మనదేశమందలి యొక సుప్రసిద్ధ వాగ్మినితోడ మాట్లాడునప్పుడాతడిట్లు నుడివియుండెను. "భారతీయులకు బహిర్విషయములగ్రహించుశక్తియత్యద్భుతము. ఎచ్చటనుండియున్నను నిస్సంకోచముగ గ్రహించి జీర్ణమొనర్చుకొనుటయే భారతీయులకార్యము. కాని పరిత్యజింపగలశక్తిమాత్రము శూన్యము"

కాని పరిత్యజింపగలశక్తి మనయందు లేదను విషయమును నేను నమ్మను. ఇతర విషయములను గ్రహింపగలిగినట్టులనే విసర్జింపగలిగియున్నామనుటయే సత్యము; స్వభావము. మనకుగాని సంఘమునకుగాని ప్రయోజనరహితమగు కార్యములను మెల్లమెల్లగ విసర్జింపుచుందుము. దేనినిగూడ నొక్కమారుగ త్యజింపజాలము. ఇట్లొనర్చుటయే సంఘరక్షణకుముఖ్యమార్గము. కావుననిది దోషముకాదు. గుణమే. ఆతడుతనవిషయమును బలపరచుకొనుటకు బాల్యవివాహముల దేకొని యిట్లు నుడివియున్నాడు. "ఒకప్పుడు బాల్యవివాహములు సాంఘికస్థితికి మిక్కిలి యావశ్యకమై యుండెననుటకు సందియము లేదు. కాని మనయందు విసర్జనశక్తియేయుండినయెడల దాని యవసరము దీరినంతనే బాల్యవివాహముల విడిచియుందుము"

బౌద్ధ యుగము తర్వాత హిందూ సంఘము పునర్నిర్మాణ మాయెను. అప్పుడు బాల్యకాలమునందే పిల్లలు సన్న్యాసమును గైకొన బ్రయత్నింపజొచ్చిరి. అట్లొనర్చుట వలన సంఘము నాశనమగుననుట నిస్సంశయముగదా! ఈసమస్యా పరిష్కారముకొరకు బాల్యవివాహములాచరణకువచ్చెను. బౌద్ధ

యుగపరిభావమంతరించియుంతరించక పూర్వమేమన మహమ్మదీయులయాక్రమణముం జుదగులాంటిమి. మహమ్మదీయ యుగమునగూడ బాల్య వివాహము లవసరమాయెను. అంతియగాక ఘోరమగు ఘోషాపద్ధతిని గూడ కొన్ని ప్రాంత్యముల యందు నవలంబింపక తప్పకుండెను. నేడు మహమ్మదీయ యుగ మంతరించినది. దానితో పాటు సంఘ సంస్కరణముగూడ ప్రారంభమైనది. మనదేశమందలి బాలికలు 13–14 వత్సరములకే యౌవనసీమయందు పదార్పణం బొనర్చుచున్నారు. సాధారణముగ 11–12వత్సరములకే వివాహములు జరుగుచుండుట సహజమైనది. సంస్కరణము కావలయునను వారిలో చాలమంది 16 వత్సరములు దాటినగాని వివాహముచేయుటలేదు. ఆచరణయందు సంపూర్ణముగ లేకున్నను దాగుగవయస్సువచ్చినగాని బాలబాలికలకు వివాహము చేయగూడదను భావము క్రమక్రమముగ స్ఫుటమగుచున్నది. పదునారువత్సరములకు స్త్రీలకు వివాహ మొనర్చువారిని సంఘమునుండి వెడల దరుమ వలయునని దలంచు వారరుదుగ నున్నారు.

ముఖ్యముగ గమనింపవలసిన విషయ మేమన్న గ్రహించు శక్తితో పాటు విసర్జించు శక్తిలేనియెడల సంఘమప్పుడే యంతరించి యుండును. మన హిందూసంఘము నందొక్కొక యుగము యాచార వ్యవహారము లొక్కొకవిధముగ నుండెనను టకు ప్రాచీన ధర్మశాస్త్రములే మనకు నిదర్శనములని నిరూపించునటుల వ్రాసియుంటిని. భారతీయులకు మనుసంహితమిక్కిలి ప్రామాణ్యము. ప్రతియుగమున మార్పుజెందుచు వచ్చెను. చిట్టచివరదానిని సంస్కరించినవాడు భృంగర్షి. ఈయనకుపూర్వము మార్కండేయుడు నారదుడు సంస్కారమొనర్చిరి. విసర్జన శక్తియే మనయందు లేనియెడల యుగోపయోగముగ ధర్మశాస్త్రము లెట్లు మార్పుజెందుచుండెను!

పరులను మనయందు గలుపుకొని వారియందలి శ్రేష్ఠగుణముల మనము జీర్ణమొనర్చుకొనిన యెడల పరులవ్యక్తిత్వము నిలచుటకొప్పద మెచ్చట? అట్టిపనికి మనసంఘమెప్పుడును బూనుకొనదు. బూనుకొనలేదు. విరోధస్థలమును గుర్తించి దానిని నిర్మూలనం బొనర్చి సామరస్య మొనర్చుచుండెను. ఈయుగమందు హిందూ సంఘమునకును క్రైస్తవమహమ్మదీయ సంఘములకును వైరుధ్యము గాన్పించుచున్నది. కావున వైషమ్యములను దొలగించుకొనుట ముఖ్యావశ్యకము. విద్వేషములవలన నైక్యతగలుగదు. విద్వేషములు దొలగినగాని యుభయులకు క్షేమముగలుగదు. సమస్త ధర్మ–మతముల యట్టడుగుననున్న తత్త్వమొక్కటియను నంతమాత్రమున మతద్వేషము లంతరింపవు. మనదేశమందలి మహమ్మదీయ క్రైస్తవ మతముల నవలంబించిన వారిలో చాలమంది హిందూ సంఘమునుండి విడివడి క్రైస్తవమహమ్మదీయ మతములకైకొనినవారనుట నిశ్చయము. వారు మన పొరుగుననే నివసించుచు సంపూర్ణ వైషమ్యముతోడ విదేశభావాపన్నులైయుండుట యసంభవము. జాతీయప్రకృతి దేనిని దూరమునుంచుటకు బ్రయత్నింపదు. ప్రతిదానివిధమ యందు గలుపుకొనుచుండును. అదిదానియొక్క స్వభావము. అందువలననే యార్యసంఘమునందనార్యసంఘము గలసిపోయినది. ఇది మనయొక్క దేశమందేకాదు. ప్రపంచమునందే దేశమందయినను జాతీయపరికృతి మానవమండలిని యైక్యముగ చేయుచునేయుండును. కావున నీజాతీయప్రకృతిని శాస్త్రయించిరయే చరిత్రకారులు ప్రాచీనేతిహాసమును మనకు గోచరించునట్లు జేయగలుగుచున్నారు. జాతీయప్రకృతి యపరివర్తనీయము. అందువలన మహమ్మదీయులు–క్రైస్తవులు–పారసీలుయెవరైననేమి–ఏమతస్థులైననేమి–వారు భారతీయులగు హిందువుల పరికృతికి సంపూర్ణముగ విభిన్న ప్రకృతి గలవారుగనుండుటకు వీలులేదు. ప్రకృతి గతమగు సామరంజస్యమే మతధర్మముల సామరస్యమునకు ప్రధాన సహాయము. మహమ్మదీయ యుగమందువిదేశ కుటుంబముల కొరకు

వచ్చి భారతవర్షమునే మాతృభూమిగా నొనర్చుకొని యున్నది. వారి సంఖ్యస్వల్పమగుటకు సందియము లేదు. వారి ప్రకృతిభిన్నమైనను పరిసరములయాకర్షణ వలన వారిప్రకృతి చాలవరకు సంయతమై భారతీయవిధానమున రూపాంతర మొందినది. నేడు భారతీయ చరిత్రయే వారిచరిత్రయైనది. వారి వంశము విదేశమైనను పదిపదునేను పురుషాంతరములుగ భారతవర్షమందే నివసించుచుండుటవలన సర్వతో భావమున భారతీయులై యున్నారనుట నిర్వివాదాంశము. అందువలన వారికొరకు మనము ప్రత్యేక వ్యవస్థను నేర్పాటు చేయవలసిన యవసరములేదు. వారినిగూడ హిందూదేశమందలి మహమ్మదీయుల తోడ సమముగ చూచినజాలును.

మనదేశమందలి పారసీకులు విద్యయందును ధనమందును మిగిలిన సంఘముల కంటె నున్నతస్థితియందున్నారు. అట్టివారు భారతవర్షమునకుమిక్కిలి గౌరవము దెచ్చుచున్నారు. వారుస్వదేశమునుండి మహమ్మదీయుల బారినుండి తప్పించుకొనుటకు మనదేశమునకు పారివచ్చి మనదేశమునే స్వదేశముగ భావించుచున్నారు. హిందువుల మతధర్మములకును వారిమతధర్మములకును మిక్కిలి సామ్యము గలదు. పార్సీల సంస్పర్శనమువలననే మనలో మాయడు, కందర్పుడు, కలి మొదలగు కల్పనలు గలిగినవని చాలమందివిశ్వాసము. బౌద్ధయుగమున కొంతపూర్వము భారతవర్షము తమ స్వాధీనమైయుండెను. అప్పుడు హిందూసంఘమందు పారసీకుల యభిప్రాయము లనేకములు ప్రవేశించెనని చెప్పుదురు. ఈవిషయ మందెంతవరకు సత్యమున్నదో సరిగ నిర్ణయింపజాలము గాని పార్సీలకును ఆర్యులకును సమీప సంబంధముండుట వలన మనదేశమందలి పారసీకులు మనదేశమందొక శాఖవారుగ మారియున్నారు. హిందూదేశమునే మాతృభూమిగ దలంచుచున్నారు. పూర్వమునుండియు వారు భారతీయులనను జ్ఞానమునచేయుచున్నారు.

క్రైస్తవులయందు కూడ నిరుశాఖల వారున్నారు. ఒకశ్రేణివారు హిందూదేశస్థులు. రెండవశ్రేణివారు విదేశీయులు. విదేశీయ క్రైస్తవులింకను భారతీయ భావమును బొందుటలేదు. వారికి కూడ పూర్తిగ భారతీయభావ మలవడినగాని సామరస్యము కలుగదు. వారియందు మేము భారతీయులమను జ్ఞానము వృద్ధియైనచో వైరుధ్యమునకు తావుండదు. క్రైస్తవమతమును హిందూ మతాంతర్గతముగు నొకశాఖగ బరిణమింప చేయుటయంత కఠినకార్యముగాదు.

కాని సర్వజనీనమగు మహోత్తరభావము మీద ధర్మసమన్వయ మాధారపడియుండును. అజ్ఞానము— విద్యావిహీనత మొదలగునవి యీకార్యమునకంతరాయములు. అజ్ఞానమును దొలగించుటకు మనము సర్వవిధముల బ్రయత్నింపవలయును. కావున వర్తమానకాలమునందు దృష్టింపవలసిన ముఖ్యవిషయము అజ్ఞాననివారణము. అందువలన నిదియే యుగధర్మము. యుగధర్మమున శ్రుతగలియునదే పుణ్యకార్యము. శ్రుతిగలియని కార్యము పాపకార్యము. ఈవిధముగ పాపపుణ్యముల విచారణప్రస్తుతకాలమునసలుపవలయును. సమస్త మతములు ధర్మముల మధ్యనుండు విరోధమును దొలగించి సామరస్యమునుగలిగించి భారతవర్షమును నఖండముగ చేయు సంకల్పము విరాజిల్లుచున్న మహాత్ముడియుగావతారము గాదా? మానవకోటికినదుస్యము గాదా ?

భారతీయులనిన యొక్కమతమునకు సంబంధించిన వారలే గారు. హిందూదేశమును మాతృభూమిగ దలచి యీగడ్డమీద నివసించువారెల్లరును భారతీయులే. వీరిలో వీరికిమతవైషమ్యములుదొలంగిరేక మాతృపుత్రులమను జ్ఞానమును గలుగునటుల చేయవలయును. ఇది వరకు మనదేశమందు నేను నామతమను జ్ఞానము దృఢమైపొందుకొనియున్నది. ఇప్పుడు నేను నాదేశము నామతమనుజ్ఞానమును వికసింప చేయవలయును. ఈజ్ఞానమును వికసించినకొలది యంతః కలహములు నశించును. జాతీయ భావమేర్పడును. మహాత్మ్యము

వాటిరేమి? హిందూ మహమ్మదీయ మైత్రి- అస్పృశ్యతానివారణమేగదా!

ఇదివరకు మతముకొరకు రక్తనదులు పారినవి. మానవకోటి సంక్షోభమొందినది. నేడుజరుగుచున్న పోరాటము మతవ్యాపకమునకు కాదు. మతసామరస్యమునకు దమప్రత్యేక వ్యక్తిత్వమును వెల్లడించుటకుగాదు. సమస్త జాతులు మతములకు పరస్పర వైరుధ్యమును తొలగించి సమస్త జాతులు మతముల వికాసమునకు తోడ్పడుటకు. కాని భారతవర్షమందు జరుగుచున్న మహత్తర పోరాటమందు హీనమనునది లేదు. ఇందు శత్రుమిత్రుల వ్యక్తిత్వ వికాసమే గదా ముఖ్యవిషయము. ఇక రక్తపాతమునకు తావెచ్చట?

ఆంధ్రదేశము మేల్కొనుచున్నది. వివిధజాతుల వారు మతములవారు కండ్లు తెరచి తమ తమ స్థానము లన్వేషించుకొన జూచుచున్నారు. వానినిజూచి శ్రేయ మొందదేల? పదునారుకళలు పరిపూర్ణముగ వికసించిననేగదా కమలము యొక్క సౌందర్యము; శోభ. అటులనే యాంధ్రజాతి పరిపూర్ణముగ వికసింప యత్నించుచున్నది. కావున నీ శుభముహూర్తమున కెంతవరకు తోడ్పడగలిగిన నంతపుణ్యము. నియమము తప్పక నూలుతీయుము. అంటరానితనమును పరమత ద్వేషమును హృదయమునుండి కూకటి వ్రేళ్లతోడ పెల్లగింపుము. దేశమును వీడిన సుఖసౌఖ్యములు- పుణ్యపాపములు- మంచిచెడుగులు- లాభనష్టములు- ఇంతయేల దేశమును వీడిన దేవుని వైపు తలయందు గూడ దలంపకుము. నేను, నాగృహము, నాదేశము; నేను నామతము, నాదేశము; అనుత్రిత్వమును నిరంతరము మననము చేయుటతోడ నేను నాదేశము భూమండలము; నేను నాసంఘము మానవకోటికి సంబంధించినవి వివిధమతములు అనుత్రిత్వమును మరువకుము. వీనిని గూర్చి భావింపుచు నే కార్యమొనర్చినను త్రిత్వ సమన్వయ మీమాంసయే పుణ్యము; పుణ్యకార్యమని దలంచి లోకకల్యాణము కొరకు రాటమును చేబట్టుము. సుశాంతముగ చక్రమును త్రిప్పుచుండుము.





# ఇందిరాసుందరులు.



(డాక్టరు గుళ్ళపల్లి నారాయణమూర్తిగారు. యల్. యం. యస్.)

:o:

సుందరరావు తనపేరు సార్థకనామమునుకొనే వాడు. తనంతటి సుందరమైనవాడు లేడనే యతని యభిప్రాయము. అతఁడా సంవత్సరమే సీమదేశము నుండి శాస్త్రపరీక్షలో నెగ్గి వచ్చెను. అతని తండ్రి చిరకాలము గొప్ప రాజకీయోద్యోగమున నుండి కుమారుడు మాతృదేశమునకు వచ్చిన సంవత్సరమే మరణించెను. సుందరరావు చెన్నపట్నములో వకాల్తీ చేయడానికారంభించిన కొత్త సరిలోనే ఒక మోటారుకారు కొన్నాడు. అతనితండ్రి కట్టిన మేడ పూనమల్లి హైరోడ్డులోవున్న దివ్యభవనము. వకాల్తీ ఆరంభించిన మొదటినెలనుండీ నెలకైదారు వందల రాబడి అతనికి వుండేది. వయస్సుగడచిన తల్లితప్ప ఇంట్లో ఇంకెవరూ దక్షతలేరు. మనుపటివంటవాడే ఇంటినింకా కనిపెట్టుకొని యుండెను. సుందరరావు కింకేమిలోపము. కాపరముండడానికి దివ్యభవనము, తన యిష్టంవచ్చిన ఖర్చుపెట్టుకోవడానికి చేయిమునగా ధనం. తల్లితప్ప అతని పోషకవర్గములో ఇంకేబంధువులు లేరు. త్రాగుడు మొదలైన దుర్వ్యసనాలతనికిలేవు. అతని దుస్తులకుతప్ప సింకొక ఖర్చులేదు. సుందరరావు ఎప్పుడూ సూటు బూటు హేటు వేసుకొని నీటుగోటులకు లోటులేకుండా చూసుకొనేవాడు. అతనికి చాలా మొగమాటం. దగ్గిరబంధువు లింటికైనా పిలిచినా వెళ్లేవాడుకాడు. వెంకటరెడ్డిఅనే వయసు ముదిరిన వకీలుకి ఇతనికి బదరీ బాదరాయణ సంబంధ మొకటుంది. ఈ వెంకటరెడ్డి మొదలయిన తన శ్రేయస్సు కోరేవారందరూ సుందరరావు కొక్క లోపముందని అనుకొనేవారు. అతని తల్లికెప్పుడూ అదేచింత. ఎన్నిసార్లో ఆలోపాన్ని పూర్తిచేసుకొమ్మని తల్లిచెప్పిందికాని అతడువినలేదు. ఆవిడమాటలు లక్ష్యపెడితేనా? ఆఖరుకొకనాడు తల్లినూతిలో కూడా పడతానంది. ఊఁ, ఊఁ —ఏమయినాసరే నాకక్కర

లేదూ అన్నాడు సుందరరావు. వ్రతం నేనుమాననూ అన్నాడు. “నీకివాలోకంలో సౌఖ్యంకలగ జేసేదదే! అటువంటిదాన్ని నువ్వెందుకు చేపట్టవు ఏకాకి వైయుంటే నీకేమిసౌఖ్యం? లోకంలోవాళ్లంతా వెర్రి వాళ్లయి చేసుకొంటున్నారా! నీసౌందర్యమంతా ఎవరి పాలుగాను” అని వెంకటరెడ్డి అనేక విధాల బోధపరచాడు. చెవినిల్లుగట్టుకుపోరేడు— ససేమిరా. అతనిబోధలన్నీ తృణప్రాయమూ కాలేదు. ఇంతకీ సుందరరావు పట్టుదలకేమిటీ కారణం. అతడు సీమదేశములో ఉన్నప్పుడొక థియొసాఫికల్ సొసైటీలో మెంబరుగా ఉండేవాడు. ఆసంఘములో ఒక వేదాంతి బ్రహ్మచర్యంలాంటి ఆచరణీయమైన ఆశ్రమమే లేదని గట్టిగా బుర్రకెక్కించాడు. సీమదేశం వెళ్లకముందు తనతండ్రి పెళ్లి చేస్తానంటే “వివాహో విద్యానాశాయ” అన్నాడుకనుక చదువుపూర్తిఅయితే కాని పెళ్లిచేసుకోననిశపథంట్లాడు. సీమనుంచి వచ్చాక ఈశాస్త్రబుద్ధీ కూడాతిరిగి పోయింది. సౌందర్యమనేది ఒకఅగ్నివంటిది. దానివాడవాళ్ల పాలు చేయడమేమిటని వెంకటరెడ్డిని తిరస్కరించాడు.

౨

వెంకటరెడ్డి అనేక విధాల అతన్ని మురిపించేవాడు, మూనులైటు బేండుకు తీసుకువెళ్లి వన్నెలు చేసుకొని వచ్చే పుదుప్పేట దొరసాన్లని చూపెట్టేవాడు. మోటారు బళ్లలో కూర్చొని క్రింది కదుగు పెట్టకుండా అక్కడనుంచే అపుచ్చ పువ్వలాంటి వెన్నెలలో అసముద్ర తరగాల ఘోషలో లీనమై పోయే ఆబేండు మాధుర్యాని కానందించే నడివయసులో ఉన్న నవవిలాసినుల కొందరనో చూపెట్టేవాడు. పాటకచ్చేరీలకు తీసుకొనిపోయి అక్కడికొచ్చిన వగల చీరలు కట్టుకొని మొఖానికి తెల్ల గుండ పూసుకొని ఘుమఘుమ లాడుతూవచ్చే సౌందర్యవతుల కొందరినో చూపించేను ఇంకపార్థసారధికోవెలలో క్రిక్కిరిసితోసుకుని పోయేయువ్వనవతులను, పియారుస్కేరు పూబోణులను, బయస్కోపు ప్రేక్షకులను లెక్కలేకుండా చూపించేడు. ఇందులో నీయిష్టము వచ్చిన వాళ్లను పెళ్లి చేసుకోవచ్చునని కూడా ఖాదీమాట చెప్పేను. ఇంతకంటె చక్కని వాళ్లను ఇంగ్లండులోనే చూసేను. వాళ్లకంటె వీళ్ల గొప్పేమిటన్నాడు సుందరరావు. అన్నాడు కాని అతనిలో మార్పుచూసేరా వెంకటరెడ్డి ఇంటికేనా ఒకనాడైనా వెళ్లకుండా నలుగురిలో కలిసి కట్టుగా తిరగకుండా కూపస్థమండూకంలాగు ఇంట్లో కూర్చుని వుండే సుందరరావు క్రమేణ వెంకటరెడ్డి ఎక్కడికి తీసుకొని పోతూంటే అక్కడకు పోవడం ఆరంభించేడు. కొత్తపదలి ఇంటికి రావడం లేదవు, మోటారులో ఇద్దరూ ప్రయాణము యాలే ఎక్కడికో ఒక చోటికి.

ఒకనాడురాత్రి వెంకటరెడ్డి సుందర రావును కనుబాటు చేసి అతనిబంగారపు వాచీగొలుసుతో సంధించి జేబులో దాచుకొన్నాడు, అంతకు ముందేమి తంత్రం పన్నేడో “సుందరరావూ మననిద్దరిని మోసపుచ్చి, ఎవడో దొంగని వాచి ఎత్తుక పోయెనురా వాడి వెనుక బయలుదేరుదాము” అన్నాడు “ఇంటిలో ఇక్కడకు దొంగ వచ్చాడయ్యా” అన్నాడు సుందరరావు. “నువ్వగదిలోకి వెళ్లినపుడు నేను మేడమీదికి వెళ్లేను. మళ్లీవచ్చేటప్పటికి బల్లమీద వాచీ కనబడలేదు. దొంగయెత్తుకు పోకపోతే ఏమౌతుంది? వేగముపరుగెత్తుకొనివెళదాము రా” అనిసుందర రావుని బలవంతపెట్టాడు స్నేహితుడు. దొరలు రాత్రుల్లు తొడుగుకొనే దుస్తులన్నీ తొడిగి సుందర రావు బయలుదేరేడు_ “ఎందుకీసందులన్నీ తిరగడ” మంటాడుసుందరరావు. ఫర్లాంగుదూరములోదొంగ ముందర పరుగెత్తడం నీకు కనబడలేదా వాడేయింట్లోదూరేడో నాకు తెలుసును. నీవాచినీకిప్పిస్తే సరిగదా! అన్నాడు స్నేహితుడు. మింటువీధిలో ఒక యింట్లో వారిద్దరు ప్రవేశించేరు. సుందరరావును డ్రాయింగు రూములో రౌనుబల్లముందు కూర్చోబెట్టి వెంకటరెడ్డిలోపలికివెళ్లాడు. ఒకగాజుగ్లాసులో లైమజూసుపోసి దానిలో ఒకమంచుముక్కను వేసి తీసుకు

వచ్చి సుందరరావు కిచ్చాడు. ఇంతలో బహువిధ సువర్ణాభరణములతో ఒప్పుచు పదునెనిమిది సంవత్సరముల వయస్సుగల ఒక యువతివచ్చి వెండిపళ్ళెములో ఈనెలుతీసి చిలకలుచుట్టిన కవటాకులు, పరిమళించుచున్నవక్కపొడి, కొనుబల్లమీద పెట్టింది. రెడ్డిమళ్లా వచ్చాడు. "దొంగ యింటికి తీసుకొనివచ్చి గౌరవము చేస్తున్నారండీ" అన్నాడు సుందరరావు. "దొంగ ఈయింటిలోదూరిపారిపోయాడట ఇదిమన వాళ్ళఇల్లే. దొంగ పారిపోయేటప్పుడు వాచీక్రింద పడిపోయిందట. ఈ అమ్మాయికి దొరికింది-ఇచ్చివేయావమ్మా ఇతనివాచి" అన్నాడు రెడ్డి. ఇంతసేపూ గాజుగ్లాసులో మందుముక్క ఏలాగు కరుగుతుందో అనిచూస్తున్నట్లు నటించాడుగాని ఆ స్త్రీ మొగమైనా చూశాడు కాడు సుందరరావు. ఆయువతివాచీతెచ్చి బల్లమీద పెట్టింది. సుందరరావు ఆయిల్లువిడచి వెళ్లిపోయేటప్పుడు "ఈఅమ్మాయి నిప్పిస్తాను పెళ్లాడుతావా" అన్నాడు రెడ్డి. "ఇస్సి ఇందుకుటయ్యా ఇంతదూరము త్రిప్పించంపేవు. అట్లా చెప్పితే మొదటనే అక్కరలేదని వుందునే" అన్నాడు సుందరరావు. "ఆపిల్లను చూడనప్పుడు అని యుందువేమో కానిఇప్పుడేమంటావు" అన్నాడు రెడ్డి. "ఇప్పుడంతకన్న విశేషమేమిటి నావాచినా కిచ్చిందనా" అని సుందరరావు తిరస్కరించాడు.

3

రెడ్డికింకేమీ పాలుపోలేదు. మెల్లగా సుందరరావుని ఒక క్లబ్బులో మెంబరుగా చేర్చాడు. సుందరావక్కడకువెళ్ళి టెన్నిసుబిల్లియర్డ్సు ఆడుతుండేవాడు. ఆ సభవారు సంస్కృతం తెలుగు ఇంగ్లీషు నాటకాలాడేవారు. సుందరరావుకి ఇంగ్లీషులోనేకాక తెలుగులోను సంస్కృతంలోను కొంత పాండిత్యం వుండేది. అతనికి నాటకాల్లో సరదాపుట్టింది. అదివరకల్లా జనసమూహంలోకి వెళ్ళడమంటే చికాకుపడే సుందరరావు సుగుణవిలాస సభనాటకమంటే చెవిగోసుకొని పరుగెత్తేవాడు. ఒకనాడునాయికా వేషధారిని స్తోత్రము చేసి నాటకాంతమున లెక్చరు చెప్పేడు. నాయికాపాత్రధారి పురుషుడైనను స్త్రీలనుమించి సభ్యులను వశపరచుకొన్నాడు. అని సుందరరావు లెక్చరులో చెప్పేడు. ప్రపంచ ధోరణిలో అక్షరాభ్యాసము అయింది కదా అనిసంబరపడ్డాడు రెడ్డి.

౪

మరొకనాడు నాటకమయేక సుందరరావొక్కడు మోటారునడుపుకొని యింటికిపోతున్నాడు. ఒకసందులో మలుపు త్రిప్పేటప్పుడు కారు ప్రక్కను నడుస్తున్న మనిషిని రాసుకుపోయింది. ఆ స్త్రీ వెంటనే క్రిందపడిపోయింది. విశేషం దెబ్బలుతగలలేదుగాని చేతులు కాళ్ళు కొంచెం కొట్టుకుపోయేయి. సుందరరావు మనసు మెత్తనిది. ఆమెకుతగిలిన దెబ్బలకు పరితపించి మీ యిల్లెక్కడ మీవాళ్ళెవరున్నారు. మీయింటికితీసుకొనిపోయి దిగబెడ్తానన్నాడు. నే నెక్కడుంటే అక్కడేయిల్లు నన్నెవరు పోషిస్తే వారే దగ్గరవారు అని జవాబు చెప్పింది యిందిర. సరే నీసంరక్షణకు నేనెగదా బాధ్యుడను అనుకొని ఆమెను మెల్లగా లేవనెత్తి కారులో కూర్చోబెట్టుకొని యింటికితీసుకొనిపోయాడు. ఒకమంచము పరుపువేసి ఆమెను పడుకోబెట్టేడు. ఇంతలో వెంకటరెడ్డి అక్కడకువచ్చాడు. సంగతులు తెలుసుకొన్నాడు. సుందరరావు అనుమతిపైని పరిచయుడైన డాక్టరును తీసుకొని వచ్చేడు. డాక్టరు తగిన చికిత్సచేసి బారిష్టరుగారూ రోగిని నాసెలవులేకుండా యిక్కడనుంచి పంపివేయకూడదు. నేజెప్పినప్రకారం జాగ్రత్తగా సంరక్షణ చేయాలి నేకట్టినకట్టు కదిలిపోకుండా గడియగడియకు చూస్తుండాలి అనిహెచ్చరించాడు. డాక్టరు చెప్పినట్లు కట్టు ఎక్కడ కదిలిపోతుందో అనిగడియగడియకు చూసేవాడు సుందరరావు. కొన్నాళ్ళకాం ది యిందివరకు చాలా ఖులాసా కలిగింది. సుందరరావు ఆమెను ఒకబంధువుగా భావించి ఆమె పథ్యపానాదుల కేమీ లోపములేకుండా యేర్పాటుచేసేడు. కాని ఆమె కెప్పుడూ చనువియ్యలేదు.

౫

ఇప్పుడా యిందిర ఏలాగుందని మీ యభిప్రాయం! వయస్సు పద్దెనిమిది. శరీరచ్ఛాయ విజయనగరం పండు తమలపాకువంటిది. శాంతమైన సముద్ర తరంగములలాగు ఎత్తుపల్లాలతో వుండేనల్లని ఉంగరాలజుత్తు, సింగణీవిండ్ల లాంటికను బొమ్మలు, చేరడేసికళ్లు, ఇంకా నేనేమి చెప్పేదేమిటి ప్రబంధాల్లో కవీశ్వరులువర్ణించే సౌందర్యమంతా ఈమె యందుంది. ఒకనాడుసుందరరావుకువంట్లోచికాకుగావుండిమంచముమీదపడుకొన్నాడు. వంట్లోఎలాగుంది." అంది ఇందిర మెల్లగావచ్చి.

సుంద:— కాళ్ళు లాగుతున్నాయి. కొంచము తల నొప్పికూడా వుంది

ఇంది:— అమృతాంజనం తెచ్చేదా, కాళ్ళుకొం చెంరాస్తాను.

ఆడదానిచేత కాళ్ళు పట్టించుకోవడం తప్పు కాదా! అందులో పరస్త్రీచేత. అని సుందరరావుకు సిగ్గువేసింది. "అక్కరలేదు" వెళ్ళు అన్నాడు.

సుంద:— నాకు చికిత్స చేయించి ఇంతశ్రమపడ్డారు కదా! మీకు సుస్తీగావున్నపుడు నాచేతనైన యుపచారం చేయడం తప్పా.

సుందరరావు జవాబుచెప్పలేకపోయాడు. "కొంత సేపూరుకొని అక్కరలేదులెండి! డాక్టరుగారికి తెలిపోను చేశానుఆయనవచ్చిమందుఇస్తాడు" అన్నాడు. "డాక్టరుగారు మందిస్తారులెండి.— ఉపచారం చేయడానికి అభ్యంతరం ఏమిటో" అనిముక్కుచిరునవ్వునవ్వితిరిగి వెళ్లిపోయింది యిందిర.

డాక్టరు "యిందిరయింకా యిక్కడేవుండాలి జబ్బుపడిలేచిన మనిషిగనుక చల్లగాలి సముద్రపొద్దుకు తీసుకు వెళ్ళాలి. మనస్సు రంజించే నాటకాలు చూపెట్టాలి అప్పటికి కాని మనస్సుకు శరీరానికి ఆరోగ్యం కలుగదు. అదికాక యిందిర అనాథ ఆమెకూ నా అన్నవారులేరు. అందుచేత ఆమెకింక మీయిల్లేగతి" అని తనతో దూరంచెప్పేడు. సుందరరావు కూడా అరమరలేకుండా అప్పుడప్పుడామెను నాటకాల్లోకి తీసుక వెళ్లేవాడు. కాని ఆమెతో-వేళప్పుడైనా సరసమాడబోతే కస్సుమనేవాడు. పైకి ఏలాగున వున్నా మనసులో తత్వం అతనికి తెలియకుండా మారుతూనేవుంది "బలవానింద్రియ గ్రామోవిద్వాంసమపికర్షతి" అన్నట్లు సుందరరావు లొంగడమొక గొప్ప యేమిటి?

౬

ఒకనాడు సాయంత్రము సుందరరావు కోర్టు నుండివచ్చాడు. కోటు చేతికర్ర ఈవిధంగు హేటు పాగాకొయ్యకు తగిలించాడు. వసారాలోవున్న కుర్చీమీదకూర్చొనిపుస్తకము చదువుకుంటున్నాడు. మేడమెట్లుదిగియొకపురుషుడు సుందరరావునుచూచి తుర్రుమని మాట మంతలేకుండ గబగబనడచి వీధిలోకి వెళ్ళి పోయేడు. మోహనరావు అని పిలుస్తు ఇందిర అతని వెనుక మెట్లుదిగింది. సుందరరావు తీక్ష్ణంగా చూచాడు. ఇందిర ఆశ్చర్య పోయింది. కొంత భయంకూడా పుట్టింది. ఆవెళ్లినవాడెవరుఅనిసుందరరావు ప్రశ్నించేడు. అన్నాదొంగతనం బయలుపడిందను కొని కొంచెం ధైర్యం తెచ్చుకొని "చెప్తాను లెండి ఇప్పుడేంతొందర" అని నవ్వుతూ మేడ మీదకి వెళ్ళిపోయి సారంగధరునిమీద మోహాను చేత చిత్రాంగిపాడే పాట పాడుతూంది. ఇందిరకు కావలసిన కొన్ని సామానులు కొని ఆమె అన్నచేత సామానులు వెంకటరెడ్డి పంపేడు. ఆమోహనరావు సుందరరావుకంటబడిఅనుమానానికి కారణమయేడు. సుందరరావుకు ఉండబట్టక మూడ మీదకివెళ్ళి మళ్ళీ ప్రశ్నించేడు. ఎవరోకాని తన స్నేహితు లిల్లను కొని పొరపాటున ఈయింట్లోకి వచ్చేడట. తిరిగి వెళ్లి పోయేడు అని బొంకింది గాని సార్థకం కాలేదు. మోహన రావూఅని పిలుస్తావెవరిని అని మళ్లీఅడిగేడు. ఎందుకండీ ఇన్ని ప్రశ్నలు "మోహనా, రావా" అని పాటలో ఉన్నమాటలు వర్ణించుకుంటున్నాను అని తలవంచుకొని ముసి ముసి నవ్వు నవ్వుతూ" మనం

కూడ నాటకాల్లో వేషాలు వేద్దామా" అన్నదిఇందిర. సుందరరావు అపరిమితానంద భరితుడై పోయాడు "నువ్వు నాటకంలో వేషంవేస్తే ఊరంతా విరగబడి పోరా" అన్నాడు, అంత అందం అంత కంఠమాధుర్యం ఏ స్త్రీవేషధారికి కలుగుతుంది. నాటకాలలో స్త్రీలే స్త్రీపాత్రలనుధరించడమే ఆదర్శప్రాయంగా గణించేవారి కోవకే సుందరరావున్నూ. "పదహేనురోజులలోనలచరిత్రనాటకము. నువ్వు వేషంవేస్తావా" అన్నాడు.

ఇంది:— మీరు ప్రవరాఖ్యుని వేషం వేస్తే నేను వరూధిని వేషం వేస్తాను.

సుంద:— అంతవట్టుకేనా నీకోరిక.

ఇంది:— అంతవట్టుకేలయితే ఎలాగ. ఆవేషాలు వేయకుండానే యిప్పుడుమనమూ నాటక మాడుతున్నాము. ప్రవరాఖ్యుడి వేషంతో తర్వాత వచ్చే గంధర్వుడి వేషంకూడా మీరే వేయాలి

అంటూ నవ్వుకుంటూ వెళ్ళిపోయింది యిందిర.

౨

ఆమరునాడు సుందరరావురివాల్వరు దీసుకొని అడయారు పిట్టలవేట కెళ్లాడు. కారుఆపి కొంతసేపు కూర్చొనే సరికి కళ్లుమూతబడ్డాయి. చిన్నకునుకు పట్టింది. కల,

"అది సాయంకాలం ఆరు ఘంట లయింది. సారంగధర నాటకం పావురాలెగర వేయడపు సీను అయిపోయింది. సారంగధరుడుచిత్రాంగి మేడకు పావురంకోసం వెళ్ళాడు. చిత్రాంగి వేషధారిణి యిందిర ప్రణయ గీతాలన్నీ పాడింది "ఒకసారి నీప్రక్కకొదిగియుండిన చాలు దేవేంద్రపదవి సిద్ధించినట్లు" అన్నది. సుందరరావుకిఆసీను చూస్తున్న కొద్దీకోపం హెచ్చు అవుతూంది. పరపురుషునితో ఇందిరసరస సంభాషణ చేయడం అతనికిష్టంలేదు. సుందరరావుకి కోపంవచ్చింది. రివాల్వారుతీసి చిత్రాంగిమీద పేల్చేడు. ఆదెబ్బగురితప్పి పోయి ప్రక్క తెరమీద వాలిన పావురానికి తగులుగా పావురం ధోరునక్రింద పడిపోయింది. వేటకు వచ్చినందుకు పావురం దొరకింది కదా అనికళ్ళువిప్పి చూశాడు. పావురంలేదు. చిత్రాంగిలేదు.

ఎంతఘోరమైనకల! నిజంగా ఇందిర చిత్రాంగి వేసుకుంటే ఇట్లాజరగవలసిందేనా? ఇంటికివచ్చి ఈకథంతా ఇందిరకు చెప్పేడు.

ఇంది:— నామీద మీకంత ప్రేమవుంటే నన్ను పెండ్లాడ కూడదా?

సుం:— ఇప్పుడంతకన్న నేనేం చేయగలను.

సుందరరావు యిందిరను వివాహము చేసుకొందునని రెడ్డికి టెలిఫోను చేశాడు

౩

సుం:— రెడ్డిగారూ మీకోరిక సిద్ధించిందా?

రెడ్డి:— ఇంతశ్రమ లేకుండా ఆవేళమాపిల్ల చేతసిసా వాచి ఇప్పించినప్పుడే వొప్పుకొంటే నాకెంతసంతోషంగావుండును.

సుంద:— ఆపిల్లేనా? ఈపిల్ల.

రెడ్డి:— మరి?

డాక్టరు:— రెడ్డిగారు క్షమించండి. మీపిల్లను నానిపిల్లాగున తయారుచేసినారేమండి సంసారిలాగున ముగ్గలాగున కనపడదు.

రెడ్డి:— డాక్టరుగారి మేలుమరచి పోలేను. సంఘసంస్కరణంలో యిదొక ముఖ్యమైన సోపానమండి. సానులను సాంసారుల చేస్తేనేగాని పడుపువృత్తి నిర్మూలమైనదేగాని దేశంఉద్ధరింప బడదని సంఘసంస్కారానికి పూనుకోవాలని సుందరరావు నాతోవాదించే వాడు ఉద్యమవ్యాప్తికే కానిండు— వేశ్యను వివాహమాడి సంఘములో నిల్వబడే సమర్థుడెవరు? సుందరరావుని సంఘమిప్పుడు త్రోసివేయలేదు చూడండి. అతనితో అందరికీ, అవసరమున్నది. ఇక నీనాటక మెందుకంటే సుందరరావు వివాహేచ్ఛయే లేకున్నాడు. అతనికా యిచ్ఛకల్గించి వివాహమును చేసు

కుచేటట్లు చేశాను... ఇందిర శిక్ష్యాకుల సంస్కార మనగోరి రెండుతరముల. నుండి అవ్యక్తిమాని సంఘసంస్కారమైనర్చుచున్న కొనసాగిన సద్వంశములోని పిల. సుందరరావుని లొంగదీయడానికి నేనట్లా అభినయింపజేశాను గానిచాలా సరళమైనది.

విద్యావతి—

ఇప్పుడు సుందరరావుకు వెంకటరెడ్డి గురుస్థానమున చేరాడు. సుందరరావు లేచి రెడ్డికి నమస్కారము చేసి కాగిలించుకొనియాశీర్వాద మును కోరుచున్నట్లు గానుంచున్నాడు.

* * * *

తరువాత ఇందిరా సుందరులు వధూవరులుగ వివాహం జరిగింది.

---

# కవితామృదూక్తులు.

(శ్రీ. అన్నమరాజ శర్మగారు)

ఎవరి వాఙ్మయ ఖనులందు నెసఁగుచుండు
బాహ్యదృష్టికిఁ గనరాని పరమభూతి
కవిమనోగత మార్దవ గానమందు
కఠినశిలలైన నీరమై కరఁగుగాదె.

కుసుమ కిసలయ గుచ్ఛముల్ కోమలత్వ
మెడల నిశితంపుశరములై యెవని యాజ్ఞ
పరిణమించునో యక్కవి ప్రభువిహారయ
కావ్యమర్మంబులు హరింప గలుగునెవఁడు?

ఏరసాతిరేకంబుచే నిందుబింబ
మంబరము నుండి యగ్నికణాళిగురియ
కోకిలారావములు కర్ణకుహరములను
ములుకులైయుండు నెవ్వారి పలుకువలన?
కవిమనోవార్ధి కెందేని కడలుగలవె?

పడఁతి మొగమెట్లు నలినమై పరిణమించె
విమలశశికాంత సౌధముల్ వింటికెగసి
యరుణ శుభ్రాంశు పథముల నడ్డపఱచు
ప్రకృతికంటెను మున్ముందు పరుగులెత్తి
యభినవంబైన సృష్టిని నాచరించి
తనర విద్యుల్లతాంగినే తలఁపునందు
కంటివో? మోహనంబుగ కవివరేణ్య!

భానుకిరణంబులెవ్వారి వాక్కువలన
శీతలాంశులై హర్షంబు సేకరించె;
పలుకనేర్చెనో మోహన ప్రకృతియెల్ల
హృదయమై కావ్య వీధులం దెలుఁగునెత్తి.

భావసౌందర్య మహిమచే బలుకరాని,
చిత్రదృశ్యంబు లెన్నొ రచించెదీవు,
కవివరా! మనోదృష్టిని గాంచఁగలవు,
నిర్ణయాతీత కాంచన నిధులసంధ్య.

రవికర స్పర్శమున విచ్చు పరిసరకళిక
పాడెడివి నూత్నసమ్మద భావగీతి,
గనుఁగొనానంద బాష్పముల్ కడలుకొనఁగ,
గానమొనరించు వాఁడొక్క కవియె కాదె?

# పండిత కునిగలు రామశాస్త్రిగారు.



(పండిత - హెచ్చి - సుబ్బరాయశాస్త్రిగారు)



1825వ సం॥ ప్రాంత్యమున మైసూరు సంస్థానమందు తిరుపతి శ్రీనివాసాచార్యులను మహాపండితు లుండెను. ఆయనప్రియ శిష్యుడు కునిగలు రామశాస్త్రి. ఈయన పురాతన సాంప్రదాయాను గుణ్యముగ



మైసూరు సంస్థానీయులగు
స్వర్గీయ కునిగలు రామశాస్త్రిగారు.

గురుకుల వాసమొనర్చి విద్యనుగరచి పేరు ప్రతిష్ఠలుగల పండిత మండలియందు గణన కెక్కెను.

1830. 31 సం॥ బ్రిటీషువారుమైసూరు సంస్థానాధిపత్యమును గైకొని మహారాజుకు నెల 1కి 25 వేలరూప్యము లిచ్చుచుండిరి. అందువలన మహారాజు గారనేకమంది పండితుల కిచ్చుచున్న వేతనములను దగ్గించిరి. రామశాస్త్రి తండ్రికి నగరినుండి 5 వరహాలు మాసాశన ముండెను. దానిని రామశాస్త్రి కిచ్చుచుండిరి.

అప్పుడు శ్రీనివాస బ్రహ్మతంత్ర ఘంటావతారస్వాములవారు పరకాల మఠమున కధిపతులుగ నుండిరి. వీరుస్వయం పండితులు. త్రియంబక శాస్త్రితోడ వాక్యార్థమొనర్చి పీష్వా బాజీరావు సభయందు బహుమానములు బొందియుండిరి ఈయన కునిగలు రామశాస్త్రి విద్యాబుద్ధులు మేధాశక్తికానందించి నెలకు 15 రూప్యముల చొప్పున మాసాశనమిచ్చుచుండెను. వ్యాసరాయమఠము నుండి 25 రూప్యములు వచ్చుచుండెను. వీనితోడ కాలముగడుపుచుకొన్ని వత్సరములైనతర్వాత మైసూరుపశ్చిమభాగమున నున్నపూర్ణయ్య సత్రముకడ 400 లకొకయిల్లునుకొని యందు నివసింప జొచ్చిరి.

వీరికి మతవైషమ్యము లేదు, అందువలననే త్రిమతములకు సంబంధించిన విద్యార్థులకు రెండుపూటల భోజనము బెట్టుటయేగాక, వర్షమున కొక్కధోవతుల చొప్పున

గూడ నిచ్చుచుండిరి. ఈయన గృహమొక కాలేజివలె నుండెడిది. వీరికడ విద్యనభ్యసించి మహత్తర యశమును గడించిన వారి పేర్లుకొన్ని యుదహరింపుచున్నాను. శ్రీమ రంగాచార్యులు (పరకాలస్వామి యను పేరున బరగిరి.) ఆనందాళ్వాన్ సింగరాచార్యులు. శ్రీరంగ శ్రీనివాసాచార్యులు. రామగిరి శ్యామాచార్యులు. వెంకటరమణాచార్యులు. గద్వాల శేషశాస్త్రి. అనందాచార్యులు మొదలగు ముప్పది మంది వరకు వీరిశిష్యులు మహాపండితులైరి.

రామశాస్త్రి శిష్యమండలితోడ సంచారము చేయుచుండెను. ఆయన సంచారసమయమున కూడ పరులయింట భుజింపకుండెను. అందువలన నారాయణశాస్త్రి వాసుదేవశాస్త్రియను వారాయనకు వంటచేసి పెట్టుచుండిరి.

ఆకాలమున మైసూరు నందలి పండితులలో యొక్కొక్కని కడ 3. 4వందలమంది శిష్యులు చదువుచుండిరి. వీరికి భోజనమెట్లు! విద్యార్థుల కన్నమిడుట ప్రతి గృహస్థునకు ముఖ్యకర్తవ్యముగదా? గృహస్థులు పెట్టుచుండుట యేగాక పుణ్యాత్ములు అన్నసత్రములగూడ నేర్పాటు చేయుచుండిరి. అందుముఖ్యులు భాగవత సుబ్బారావుగారు. ఈయన బొబ్బూరు కమ్మకులస్థుడు. ఈపుణ్యాత్ముడు నగరిలో యాంతరంగిక బొక్కసాధికారులలో నొకడైయుండెను. 200మంది విద్యార్థులకు భోజనమేర్పాటుచేసి స్వంతభవనమునే సత్రముగ నిచ్చెను. దేవాలయమును తటాకమును దీయించిన పరోపకారి. రాజుగారు విద్యార్థుల యోగ్యత ననుసరించి నెలకు రు 0-3-6 పైసలు మొదలు 6అణాలవరకు నిచ్చుచుండిరి.

సాధారణముగ గురువులు ప్రథమ పాఠములను విద్యార్థులకు శిష్యులతోడ జెప్పించుచుందురు. కాని స్వయముగ జెప్పరు. ఈదుర్గుణము త్రియంబకశాస్త్రియందు మిక్కుటముగనుండెను. అందువలన రామశాస్త్రి యాయనకడ విద్యనభ్యసింపక విఫలమనోరథుడై వెనుకకుమరల వలసివచ్చెను. వీరు దయము ౧-౨ గంటలవరకు నుద్గ్రంథములను పాఠముచెప్పి, సాయంతనము ౪ మొదలు ఆరువరకు పంచకావ్యములను బాలవిద్యార్థులకు జెప్పుచుండిరి. తనను మించిన శిష్యుని విద్యాప్రౌఢిమను గాంచి యానందించు భాగ్యం గురువులెల్లరకు లభింపదు గదా? ప్రతివత్సరము రామశాస్త్రి 21దినములు గణపతి మంగళారతి యుత్సవము చేయుచుండెను. ఒకవత్సర మీయన గురువర్యులగు తిరుపతి శ్రీనివాసాచార్యులు సభయందు పరుగు చర్చలో బాల్గొనెను. కాని యాగురుశిష్యుల చర్చకంత మెచ్చుట? తెల్లవారు ఝామాయెను. కోటిపైకోటి యెక్కుచుండెను. ఆప్రసంగమును చూచి విద్వాంసులు సరస్వతి దక్షిణామూర్తులకు జరిగెడి వివాదమా యేమియని యచ్చెరువొందుచుండిరి. అప్పుడు శ్రీనివాసాచార్యులు పండితులజూచి యిట్లనిరి "మా రాముడుశాస్త్రి దక్షిణామూర్తి యవతారము గాదా? వానికెవరుత్తర మీయగల రప్పా?" అనుచు నానందాశ్రువులు రాలశిష్యుని గౌగలించుకొనెను. పండితమండలినుండి జయధ్వానములు మిన్నుముట్టెను. ఇందువలన తిరుపతి శ్రీని

వాసాచార్యుల యుద్దాంత ద్రోణాచార్యులకు మించెననుటకు సంశయింప వలయునా?

బాజీరావు సంస్థాన పండితుడు త్రియంబక శాస్త్రి. ఆయనరాయ దుర్గములో నున్నప్పు డాయనకడ రామశాస్త్రి చదువు కొనెను. అప్పుడు రామశాస్త్రికి 15వత్సరముల వయసుండును. పిమ్మట తిరువళ్ళ శ్రీనివాసాచార్యుల కడ వేదాంత తర్కమీమాంసాదుల చదివి ధన్యులైరి. శ్రీనివాసాచారి సహపాఠియైన శ్రీయప్పాచార్యులు త్రియంబకశాస్త్రి వ్రాసిన యద్వైత మతగ్రంథముల ఖండించెద నని చెప్పుచు మైసూరు వచ్చి మహారాజును సందర్శించెను. రామ



స్వర్గస్థురాలైన మీనాక్షమ్మ గారు.
(కుటుంబరుగల రామశాస్త్రిగారి మనమరాలు)

శాస్త్రితోడ వాదించ మనిరి. ఆతడు నాసహపాఠి శిష్యుడగుటవలన వాదించుటకు వీలుగాదన, శ్రీనివాస బ్రహ్మతంత్రస్వామి సాన్నిధ్యము పత్రికా ప్రసంగము చేయవచ్చునని సంధి కుదిర్చిరి. ఆవాదనయందాతడు సంపూర్ణముగ యోడింపబడెను.

దక్షిణ దేశదిగ్విజయయాత్ర.

1344 సం॥ రామశాస్త్రి శిష్యుల్తోడను, మైసూరు మహారాజొసంగిన శ్వేతచ్ఛత్రమకరతోరణబిరుదావళులతోడ దిగ్విజయయాత్రకు బయల్వెడలిరి. అప్పటికివారికి 37వత్సరముల వయసు. పుదుకోటకేగి యచ్చట బ్రహ్మచారి యను పండితుని యోడించి ప్రథమతరగతి బహుమతిని గాంచిరి. అటనుండి పండితుల కాటపట్టయిన కాంచీపురమున కేగిరి. అచ్చట దేశికాచార్యులను మహావిద్వాంసు నోడించిరి. కంచియందే వీరికి కడపటి పుత్రుడుగలిగెను. అతనిపేరు యజ్ఞనారాయణ శాస్త్రి. కాంచి పురమున సంస్కృత విద్యాలయమును స్థాపించి మూడు వత్సరములకు తిరిగి స్వస్థానమునకు వచ్చిరి, వీరుశత కోటియను నొకతర్క శాస్త్ర గ్రంథమును రచించిరి, అందువలన శతకోటి రామశాస్త్రియను పేరు వీరికి వచ్చెను.

సౌమ్య (1659AD) సంవత్సరములో మైసూరు సంస్థానమునకు వంగదేశము నవద్వీపములో న్యాయవేదాంతశాస్త్రములో ప్రతిభ చెందిన అనుగమభట్టాచారి బిరుదునొందిన వేంకట రామశాస్త్రి యను ఆంధ్రదేశీయుడొకడు రామశాస్త్రి పేరువిని అతని విద్యాగర్వమడంచ వచ్చి కృష్ణరాజ వొడయరు దర్శించెను. వీరిరువురికి పరకాలమఠములో వాక్యార్థము జరిగెను. శంకర భట్టాచార్యుల సిద్ధాంత ప్రకారము అనుగమ విధిలో వెంకటరామశాస్త్రి ప్రతిపాదన మొదలుపెట్టుచుండెను. మైసూరులోనున్న మహావిద్వాంసు లందరు కాశీ తిమ్మణాచార్యులను మాధ్యస్థమున కేర్పరచిరి. వారికీవాదమే తెలియ కుండెను. అప్పుడు రామశాస్త్రి "చింత లేదు. వాదమ్ముం తయ్యకానిండు" అనిరి. ఎనిమిది దినములు

వాక్యార్థమైన పిదప అదే యనుగమ రీతిలో శ్రోత్రవిషయములు చేసి వెంకటరామశాస్త్రిపై కోటియెక్కించిరి. వీరుచెప్పినది వెంకట్రామ శాస్త్రికిమాత్రమర్థమైనది. కాని సభ్యులలో నెవ్వరికర్థము కాలేదు. తుదకు అనుగమభట్టాచార్యునకు వాగ్బంధనమునకు వారు మిక్కిలి సంతోషించి రామశాస్త్రిని బట్టుకొని నేననేకరాజసభలను చూచితిని. అనేకమందివిద్వాంలనెదుర్కొంటిని. కానిందు రామశాస్త్రి సాక్షాత్ గౌతముడు.వీరున్యాయ శాస్త్రమునకు మూలపురుషులు. ఇది సహజ పాండిత్యము అసాధారణమైన ప్రతిభ అని సభలో స్తోత్రము చేసిరి. అప్పుడు మహారాజు రామశాస్త్రికి 4000 రూప్యములు ఒక కంఠహారము మొదలగు వానిని వెంకట్రామ శాస్త్రికి 3000 రూప్యములు కంఠహారము మొదలగు వానినిచ్చిరి. తరువాత రామ శాస్త్రి మైసూరులో ఈ యనుగమవీధి పాఠము చెప్పుచుండిరి. వీరిసిద్ధాంతమే కాశి గయ కలకత్తాప్రాంత్యములలో వ్యాపించెను.

## ముద్దు కృష్ణాచార్యుల పరాభవము.

ఆ కాలములో ములకనాటి తెగకుచేరిన స్మార్త బ్రాహ్మణు డొకడుండెను. మహారాజుకు నింగ్లీషుకంపెనీవారికి వైమనస్యము తొలగించ ప్రయత్నించి రాజ్యాదాయములో పంచమాంశమును కృష్ణరాజ వొడెయరుగారికి యిప్పించితినని చెప్పుకొను బడాయికోరొకడు రాజ్యాంగములోవృద్ధి నొందుచుండెను. అతని పేరు తిమ్మణ్ణాచార్యులు. రామశాస్త్రి ప్రాబల్యమునకు యీర్ష్యజెంది, గానినెటులైననుపడగొట్టుటకు యత్నించుచు ఘన విద్వాంసుల జాడలు తెలిసికొనుచుండెను గద్వాల వనపర్తియను రాజసంస్థలు కొన్ని సనాతనముగ మహా విద్వాంసులకు వృత్తులు కల్పించుచుండెను. ఆప్రాంత్యములో సుప్రసిద్ధులైన ముద్దు కృష్ణాచార్యులను పండితులను పిలిపించి మహారాజు దర్శనమునుచేయించెను. నగరిలోనే రామశాస్త్రితో వాక్యార్థము చేయ నియమించిరి. రామశాస్త్రి శిష్యులను రామ గిరిశ్యామాచార్యులతో మొదటఅనువాద ప్రత్యనువాదములు జరిగెను. తరువాత మరొక శిష్యు



పంచలింగేశ్వరస్వామి యొక్కయు,
కాశీవిశాలాక్షమ్మ యొక్కయు, దేవళములు.

లగు విజయ రాఘవాచార్యులతో వాక్యార్థముజరిగెను. అతడుచెప్పినదెద్దియుముద్దుకృష్ణాచార్యులు గ్రహింపజాలక తాము వీరితో వాక్యార్థమునకు రాలేదనియు వీరిగురువుగారగు రామశాస్త్రితోడనే వాక్యార్థమునకు వచ్చితినని నుడివెను. తరువాత రామశాస్త్రి నిలచి అతిస్వల్పకాలములో వారిపరాక్రమ మడంచిరి. తిమ్మణ్ణశాస్త్రి మత్సర మనుగంచెను. ఇదిజరిగినది పరీధావి. సంవత్సరము (1852A.D) ఈవిజయముచే శ్రీరామ

శాస్త్రిగారిసంస్థానవేతనము 5 నుండి10 వరహాలు చేయుబడెను.

1854 శతకోటి రామశాస్త్రి దక్షిణ దేశ ద్వితీయసంచారమునకైబయలుదేరెను. విజయ రాఘవాచారిమున్నగుశిష్యులు వెంట నుండిరి. మహారాజా కృష్ణరాజ ఒడయరు గారికి చెప్పకయే వెళ్ళిపోయిరి. ఇట్లు వెళ్లుటకు తిమ్మణ్ణాచార్యుల చాడీకోరతన మేకారణము. చాడీకోరులున్న సంస్థానము మహావిద్వాంసులకువాసయోగ్యము కాదు. మహారాజుగారి జ్యేష్ఠపత్ని లక్ష్మీవిలాసమ్మగారు చనిపోయినప్పుడు వీరిస్నాన సంధ్యాది నిత్య కర్మానుష్ఠానములు తీర్చుకొని వెళ్లునంతలో దహన క్రియలై యుండెను. ఇంతమాత్రమునకే చాడీకోరని దుర్బోధలచే పూరితమైయున్న కృష్ణరాజఒడయరు మహాసుగుణ సంపత్తి కలవాడైనను తనస్వారస్యవు త్రాటిని తిమ్మణార్యుల వశముచేసి యున్నందున స్వబుద్ధికోల్పిచిన వాడాయెను. అగ్రగామి అయిన ఈ పండిత ప్రకాండు లుధీరోదాత్తాదిమహాగుణ సంపన్నులువారిని భరింప ప్రపంచ వైశాల్య మెంతయేని చాలకపోవచ్చును. ఈసంచారానంతరము శ్రీ మహారాజుగారే వారిదిగ్గేశ జయధ్వానములు విని యేకోయిక స్వంత కార్యమునకై శ్రీరామశాస్త్రి శ్రీరంగ పట్టణమునకు వచ్చి పశ్చిమ వాహినీ నదిలో స్నానమొనరించుచుండ వీరికి సాష్టాంగ దండ ప్రణామంబా చరించి కుశల ప్రశ్నలడిగియిట్లనియె. శాస్త్రిగారూ తమరు మదరాసు కంచి ప్రాంత్యములలో చేసిన దిగ్విజయ యాత్రావిశేషములు విని యెంతయో సంతసించితిని.

దానిని న్యాయముగా చూచుభాగ్యమునాకు గలుగలేదు. దుష్టులమాటలవలన భాగ్యహీనుడనైతిని తాము సర్వజ్ఞులు నామీద కోపపడకూడదు. మైసూరుకు తప్పక దయచేయవలెను!! అని ప్రార్థించిరి. దీనికి శాస్త్రియంగీకరించి తిరిగి మైసూరు ప్రవేశించెను. వీరికి ముగ్గురు కొమరులు. వీరు మహావిద్వాంసులు. మూడవవారగు శివస్వామిగారు జగద్గురు పీఠమధిష్టించిరి.



# గ్రీష్మఋతువు

:o:

(శ్రీమతి కృష్ణారావు గారు)

౧

దివస మంతకు నంతకు దీర్ఘ మయ్యె
నాఁటినాఁటికి నెండలు గాట మయ్యె
సవితృఁ డుత్తరదిక్కున సంచరించె
వేడిగాడ్పులు మెండుగ విసరఁ జొచ్చె.

౨

పల్లె కొలఁకులు వాగు లిట్టింకులింకె
కీలి కాననసీమలఁ గేళి సలిపె
గగనతలమున సుడిగాలి నెగసె ధూళి
తరుల నాకులుఁ బువ్వులు కరము వాడె.

౩

పానశాలల నిలిచిరి పథికజనులు
చప్పరంబుల భోగినిచయము దాఁగె
ఎండమావులు! దండిగ! మెండుకొనియె
భీష్మతర మగు గ్రీష్మంబు పెచ్చుపెరుఁగ.

౪

శిఖిని సెగకంటిచిచ్చులఁ జెలిమి చేసి
బాడబానలకీలల జోడు గూడి
వేవెలుంగులవేల్పుతో వియ్య మంది
విసరె వడమటిగాడుపు భీకరముగ.

౫

దండిగాఁ గాయు నెండల మండి మండి
కొండ లోర్వక మొఱవెట్టి కూసె ననఁగ
గహ్వరంబుల పేరి వక్త్రములఁ దెఱచి
బెబ్బులులు గాండ్రిని బొబ్బరించె.

౬

తరణిబింబపుగాట్పైన కిరణములను
సన్నసూఁగాను వడికి గ్రీష్మంబు పేరి
సాలె నేసిన జిలుగువస్త్రంబు లనఁగ
ఎండమావులు గన్పట్టెనిండు జిగిని.

౭

బెడిద మగు నెండవేడిమి నుడికియున్న
భూతలంబును శీతలంబుగ నొనర్ప
కరుణ నబ్ధిరా జంపిన తరఁగ లనఁగ
ఎండమావులు గనుపట్టె నెల్లయెడల.

౮

భీష్మతర మైన దారుణగ్రీష్మమందు
గాలిచే మింటి కెగసినధూళి యొప్పె
దండిగాఁ గాయు నెండకుఁ దాళ లేక
పుడమిచేడియ దాల్చినముసుఁ గనంగ.

౯

ధరణిఁ దనతోడునీడయై యరుగుదెంచు
చాయ చన లేక తరువులచాయ మసల
దినకరుఁడు దాని సారెకుఁ దనకరాళిఁ
జవిచి యెత్తంగ దినములు దీర్ఘ మయ్యె.

౧౦

మిటమిటని గాయు నెండలఁ బెటిలి నేల
పగులువాఱఁగ సంధులఁ దగులువడిన
తనపదంబుల సారె విడల్చికొనుచు
దినకరుఁడు సాఁగ దినములు దీర్ఘ మయ్యె

కీర్తిశేషులగు



దేశబంధు చిత్తరంజన దాసు. గారు

# చిత్తరంజనదాసస్మృతి.



"మన్మహాస్వత్వమును వీడి మనుట కొఱకు
ఎల్లప్రతిభలు తఱుఁగ వీక్షించు కొఱకు
ధరణికెల్లర నట్టు లధఃపథాంత
దుఃఖధూసర దురదృష్ట ధూళి నన్న
వలముకొనకుండు గాత:—

యీయఖిలజనము

శ్రవముసోకభీతిలు నవల్లంఘనీయ
మౌ యమోఘాహ్వానే యస్మదంఘుమోద
జీవితోషస్సనంద్రైన చెవిని యొక్క-
వేళ నాహాత మవనిమ్ము; పెంపుమీఱు
యౌవనముతీరు మున్నె నన్ననుసరింప
నిమ్ము మృత్యువు నదియు మేలే......"

చిత్తరంజనుని యాకాంక్ష యిదియే యైనచో నది సార్థకమైనదని చెప్పవలెను. అతనికీ యమోఘాహ్వాన మెప్పుడు వచ్చినది! మహాసమరమధ్యమున నతడు ప్రభంజనుని యార్భటితో విజృంభించుచున్న వేళ—అతని ప్రతిభలు పరిస్ఫారములై సౌరభదాన మొనర్చుచున్న వసంతమున— ఆసేతుహిమాచలపర్యంత సమస్త జనసంఘముల నతఁడు తనతో నీడ్చుకొనిపోవు సంరంభమున—అప్పుడు చిత్తరంజనునికీ యనుల్లంఘ్యమగు నాహ్వానము వచ్చినది. అతఁ వెనుకటి యనేక మహాపురుషులకువలె స్వప్రతిభాజ్యోతిస్సుల దశదిశల వ్యాపింపజేయుటయె యేగు దురదృష్ట మతనికి కల్గలేదు; జీవితాస్తమయము ననుగమించు విషమస్మృతులనుండి యాతడు బాహిరిలిపోయెను. అతని స్థూలప్రయోజనము మనకు లేక పోయెనుగాని, మహావిజయము వఱకు నాతడు మనతో జీవించియే యుండును. మనమతని మఱచినగదా యాతడు మృతుఁడగుటకు? ... ... ...

యీనద్భారతవర్షము నేడతని వియోగమునకు దుఃఖించుచున్నది. ఆత్మబంధునిగోల్పోయినట్లు పరితపించుచున్నది. ఆ బాల్యాంతముగ నతనిజీవితమునందలి ప్రతిఘట్టమును స్మరించి స్మరించి హృదయభారమును సడల్చుకొనుచున్నది. ఈభారత స్వాతంత్ర్యయుద్ధమున ప్రస్తుతుడైన ప్రతియోధుడును, హస్తము స్తంభించి పోయినట్లు, కృపాణము జారిపోయినట్లు, వీనిమరణమున జేసి, విషాదము జెందుచుండెను. అతని యనుయాయులు, విపక్షవ్యూహభేదనమున, నాతడట్టి యుత్సాహమును—తీవ్రబలమును ప్రయోగించి విజయసాధనాదక్షు డగుచుండెనో, యంతటి యుత్సాహమును బొందుటకు నంతటి తీవ్రబలముతో జయమును సాధించుటకు నతని మహత్తర జీవితమును శ్రద్ధాన్వితులై స్మరించుకొనుచున్నారు.

... ... ...

కేవలము చరిత్రశ్రవణమునకుగాక యామహావ్యక్తి యొక్క యుత్కృష్టసాధనమున కుపయోగపడిన దైవసామగ్రియేదియో

యవధరించు సంకల్పముతో, నతని జీవిత క్రమము నొకమారు సావధానముగ నాలోకింతము.

చిత్తరంజను డసహాయోద్యమమున ప్రవేశించుటకు ముందు కలకత్తా న్యాయస్థానమున అడ్వకేటుగ- నాయకుడుగనున్నపుడు, దేశ ప్రజా హితములగు నెన్నియో కార్యభారములను మీద వైచికొనియుండెను. వీని సంపూర్ణ సహాయములేని యొక సంస్థగాని, యొక సంఘముగాని, తుదకు ట్రాంవే రైల్వే, కూలీల సమ్మెకట్టుగాని లేదనియే చెప్పవచ్చును. అన్ని కార్యముల యందును చిత్తరంజనునితోడ ద్వితీయుడుగ నుండి పని చేయుచుండినది యస్. సి. సేన్. గారు. వీరికి దాసుగారి యందు భక్తిమెండు. చిత్తరంజనుని ధర్మశీలమును గూర్చియు, త్యాగశక్తిని గూర్చియు వివరించుచు దేశీయుల విధిని గూర్చి సేన్‌గారు ప్రస్తావించు సందర్భమున "అయిన మీరు న్యాయవాదివృత్తిని యేల మానలేదు" అని ప్రశ్నించినవుడు, వారు దానికి సమాధానముగ, "మాజీవితము లాదర్శ విహీనములుగ లేవు. పూర్వోద్దిష్టమగు కార్యము నెరవేర్చవలసినను మేమింకొక కార్యమునకుదొరకొనము. మేమే కార్యమునర్పవలె నన్నను సంపూర్ణ మనస్సుతో సర్వశక్తుల నందులగ్నమొనర్చియున్నము. నేనిప్పుడుగృహస్థుడను. నాదేశీయులు బీదవారు. వారికి రక్ష నొనరుపవలెనన్న (నావంతు) ధనము కావలెను. నేను దాని నార్జించి నిస్సహాయులకు పంచిపెట్టెదను. గృహస్థాశ్రమ విధులను నిర్వహించినమీదనే మాదాను త్యాగమొనర్చినది' అని చెప్పుచు కొన్ని వంగ కుటుంబములనుగూర్చియు దద్భుత వృత్తాంతముల నుదాహరణముగ దెల్పిరి.

వంగదేశము, యావత్ప్రపంచమును మోహముగ్ధ మొనర్చి సత్కరింపబడు నొక మహాకవిని గాంచిన దన్నను, దేశబాంధవుని గనినదన్నను, ప్రజాశాస్త్రులగు మహాన్ కళల వర్ధించిన దన్నను- దీనికి మూలమేమి? ఇదియూ వంగీయవంశ నాయకుల సాధనా గాథల నవధరించిన బోధము నాగలదు.

మహా స్వత్వమును పొంది శ్రద్ధా జీవులై తమజీవితముల నొకయాదర్శమున నొక ప్రయోజనముకొఱకు గడుపు నద్భుత వ్యక్తిత్వము వారియందు గన్పడుచుండును. పారంపర్యముగ నీ వ్యక్తి సాధన యావంశముల యందు ప్రసన్నమగుచుండుటచే నిదివారికి బిగువుమీద తెచ్చికొనినది గాక సహజమై యుండును.

దాసు వంశము.

చిత్తరంజనుని వంశమిట్టి సాధకుల కాశ్రయమై యుండెను. తండ్రియగు భువనమోహనదాసు కలకత్తా హైకోర్టులో అటర్నీగా నుండెను. అందుమంచి కీర్తిగడించెను. బ్రాహ్మోపబ్లికు ఒపీనియన్, బెంగాల్ పబ్లికు ఒపీనియన్, మొదలగు పత్రికలకు సంపాదకుడుగనుండి సంపాదకులలో గొప్పప్రతిష్ఠ నార్జించెను.

భువనమోహనదాసు ధనము విశేషముగనే యార్జించెడివాడు. కాని దానినంతయు "శక్తుడగువాడు నిస్సహాయులు దుఃఖజీవులు నగు స్వజనకోటిని పోషించవలెను." అను ప్రాక్తనార్యధర్మము ననుసరించి బీదలగు బంధువుల కుటుంబముల

పోషించుటకై వెచ్చించుచుండెడివాడు. తన పుత్రులకొఱకై యతఁడేమియు కూడబెట్ట దలచుకొనలేదు. కూడబెట్ట కూడదని యును కొనలేదు. తాను సంకల్పించిన ధర్మమును తదేక శ్రద్ధతో చేయుచుండెను. అందుచే నతఁడు తన యాదాయమును మించివ్యయము గూడఁ జేయుచుండెను. తనకు కలిగిన యాదాయమునకన్న హెచ్చుగ ఖర్చుపెట్టుటవలన నతనికి ఋణము హెచ్చెను. ఆ ఋణశేషముతో ఇన్‌సాల్వెన్సీ పిటీషను పెట్టనౌసరమాయెను. కాని "ఆపటిమాట మాచుకొనక ధర్మము నాచరింప వలయు"నను సాహస యుఁడతఁడు సిద్ధుఁడైనాఁడు.

ఇతని మాతగారు ధర్మశీలను నను, ఔదార్యమునను, సాహిత్యమునను వన్నెకెక్కిరి. అన్నగారగు ప్రఫుల్లరంజనదాసుగారు పాట్నా హైకోర్టు జడ్జిగా నుండెను.

విద్యార్థి.

జనకునిసాధన పరిణతినిజెంది, సైన్యక ధన సంక్షేపమును బోలి, కుమారునిది నయ్యెను.

చిత్తరంజనుఁడు కలకత్తా విశ్వవిద్యాలయమున (1890లో)పట్టభద్రుఁడయ్యెను. అప్పటికతనికి 20 వత్సరములు. అప్పుడే యసాధారణమగు వక్తృత్వమును పాండితీ విశేషమును చిత్తరంజనునియందు గన్పట్టుచుండెను. పట్టభద్రుఁడైన పిమ్మట ఐ. సి. యస్. పరీక్షకు పోటీచేయ నింగ్లాండు వెళ్ళెను. కాని సందర్భములు మారినవి. చిత్తరంజనుఁడు ఉదారమును విశాలము నగుహృదయము గలవాఁడు, అతనిమనస్సేరీతిని దానిలోనోనంకుచితముకాదుం తానేపని చేయుచున్నను మిగిలిన విషయములయందు గూడ నాదరమును నుత్సాహమును జూపునైజము గలవాఁడు. అందు చేనప్పుడు జరుగుచున్న పార్లమెంటు ఎన్నికలలో దాదాభాయినౌరోజీ తరఫున పనిచేసెను. పిమ్మట జాన్‌మాక్లి యను పార్లమెంటు మెంబరొకఁ డుపన్యసించుచు హిందువులను గూర్చియు, మహమ్మదీయులను గూర్చియు నతి హేయముగ ప్రసంగించెను. దానికి అభిమానహృదయుఁడగు చిత్తరంజనుఁడు సహించి యూరకొనలేక పోయెను. ఇంగ్లాండు నందలి భారతీయుల నెల్లర రప్పించి యొకసభ గావించి ఆపార్లమెంటు మెంబరు నాక్షేపించుచు తీవ్రముగ నుపన్యసించి యతనిచే క్షమాపణను గోరుటకు తనపదవికి రాజీనామా నిచ్చునట్లు చేసెను. ఈవ్యవహారముల వలననే సివిల్ సర్వీసులో నితనికి స్థానము దొరుకక పోయియుండును.

తరువాత న్యాయశాస్త్రము నభ్యసించి (1893లో) తిరిగి భారత దేశమునకు వచ్చి కలకత్తా హైకోర్టులో న్యాయవాదవృత్తి నవలంబించెను.

ఋణదాత.

తండ్రి ఇన్‌సాల్వెంటైన కుమారుని కెట్టి బాధ్యతయు నుండదు. కాని చిత్తరంజనుని కది యవమానకరముగ నుండెను. వంశమునకు గల్గిన యీమచ్చ నతఁడు తుడిచి వేయ సంకల్పించుకొనెను. అతని హృదయమాకళంక మొకనమొనర్ప నావేగమును పొందెను. తండ్రి యప్పులవాండ్ర కడకేగి తానాఋణములను వడ్డీతోకూడ తీర్చెదనని యొప్పించి వచ్చెను. ఒక దీక్షితునివలె నాతఁడందుకుగానుధనార్జన మొనర్పసాగెను.

అప్పు యివ్వాలును తీరువఱకు నాతని యీ వేడి చల్లారలేదు. చిల్లిగవ్వలతో సహా వడ్డీతో సహా తండ్రిఋణములను తీర్చివైచెను. దీనితో సీతనియందు సముదాత్తుడగునుత్తమ పురుషుడనిలోకమునకు గురుత్వము కల్గినది. (1903 లో) అరవిందఘోషుగారి మీద వచ్చిన కుట్ర కేసులో ఆయన పక్షమున దాసువాదించిన వైఖరీవిశేషముల వలనకలకత్తా వకీళ్లలో ముందునకు వచ్చెను. ఆకేసులో చిత్తరంజనుడు పడిన శ్రమ అపారము. ధనమునాసించి యీతడిందుకు బూనుకొనలేదు. అరవిందుని దేశసేవానురక్తిని ఉదారజీవితము నెఱిగి వానికితాను ప్రయోజనమగుట కొఱకువచ్చెను. ఆరు మాసములా కేసులో విరామము లేకుండ పనిచేసెను. ఈసమయమున తనకుటుంబము జరుపుకొనుటకు గాను ఋణముగూడ నతడు చేయవలసి వచ్చినది. కాని పట్టిన పట్టు విడువక అతిసమర్థతో విపక్షుల డీకొని అరవిందుని బంధనమండి విముక్తుని జేసెను. నిజమగు త్యాగమునకు ఫలితము కల్గకమానదు. దాసుకీర్తి యావద్దేశమున బ్రాకెను. అతనివాదము తీవ్రబలీయమని, అమోఘమని యెల్లరకు గాఢ విశ్వాసము కల్గినది. దానితో అతనిసంపాదన హెచ్చినది. అంతియే గాదు. ఇందుమూలమున అరవిందునిమాహాత్మ్యము నువిశుద్ధజీవితమును లోకమునకువిస్పష్టమగుటయు నరవిందునికిని చిత్తరంజనునికిని గాఢమైత్రి యేర్పడుటయు గూడ కల్గెను.

అరవిందుని విడుదలయైన తరువాత దాసుగారికి గొప్పగొప్ప కేసులువచ్చి నెలకు ముప్పదివేల రూప్యముల ఫీజుకూడవచ్చెడిది. కానియాధనమెల్ల నితడును రేపటి మాటయేమియని లక్ష్యపెట్టక తండ్రివలెనె నిస్సహాయుల రక్షణార్థము ధర్మకార్యముల కొఱకు వ్యయమొనర్చెను. తుదకు దేశము కొఱకై సర్వస్వమునర్పించెను. సర్వవ్యావృత్తులమాని దేశముకొఱకై తనను కూడ సమర్పించుకొనెను.

### సాగరసంగీతకవి.

చిత్తరంజనుడు వైష్ణవ భక్తుడు. చైతన్య మతప్రియుడు. ఒక్కదేవతామూర్తికి తనఆశయములను భావములను ప్రవృత్తులను ఇష్టాపూర్తిగ త్యాగమొనర్చుటాలు మహాత్యాగి. అతని హృదయము సముద్రము వలెనే అఖాతమైనది. చిత్తరంజనుని సముద్రునికి పోల్చ వచ్చును. అతని వలెనే దర్శనమున గంభీరుడు— శక్తి సంగ్రహమున శాంతుడు— ఔదార్యమున విశాలుడు— ఉద్వేగమున తీవ్రుడు-ప్రళయసంరంభమునవిప్లవకారుడు- గనుకనే సముద్రరహస్యము నెఱిగి తదంతస్సంగీతమును బాడగల్గినాడు. ఎంతటి ధీరమైనదిగాక అతనిశ్రవము సముత్తుంగవీచీముఖరితసముద్రకోలాహలఘోషను సంగీతముగా నాకర్ణింపగలిగినది! దుర్బలుడగునొక కవి కది రోదనముగ విన్పించెను గభీరమునపారమునగు క్షీరసాగరమువిష్ణునకుశయ్యాయైఆనందదాయకములగుస్తోత్రములజేయును. ఈసంగీతములో తనుసకలసృష్టిచైతన్యమూలమునకుగొనిపోయి అటనుండి యనంతోన్ముఖముగ తానభిగామి యగుచున్నటుల స్ఫురింప జేయుచుండును.

### స్వరాజ్య యోధుడు.

సాగరసంగీతకవి యింతటి విశాలుడు— మహావకాశుడు గనుకనేయతడు (1919లో)

స్వరాజ్యసమరమున ప్రస్తుతుడైనపుడు, "మహాత్ముని ధ్వజచ్ఛాయ నిల్చితిని" అని చెప్పుకొనుటకు సంకోచింపలేదు. మహాయోధుడు గనుకనే, నాయకుడ గావలయునను నానచే దుర్బలహృదయుడుగాక, "నేనొక సేనాపతి" యని చెప్పుకొనగల్గినాడు. స్వతఃదాసు మహాస్వత్వసంపన్నుడు. విజిగీష యతనిప్రవృత్తి. ఆ కారణమున మహాత్ముని కార్యప్రణాళిని వరుసగా స్వయముగ ప్రయోగించుచు వచ్చెను. విద్యార్థులనువిదేశపాఠశాలలనుండియీవలకు లాగెను. న్యాయవాదుల ననేకులవృత్తి మాన్పించెను. ఖద్దరుప్రచారము నుగావించెను. కాని ఫలితము స్థూలరూపమున వెంటనే కనుపడలేదు. విజయము సన్నికటమున లేనితఱి సేనాపతి వ్యూహమును మార్చుకొనునటులనే శాసన సభలలోనికిజని, ఇష్టముకానిచట్టములకు ప్రతిష్టంభనములగావించి యచటి రంగయవనికను విశీర్ణ మొనర్చె శాసనసభలను వశ మొనర్చుకొనెదమని యటుమరలెను. అట్లుచేయునప్పుడు గూడ నిదర్శనముగ సునిశ్చలముగ, నసహాయవాద పక్షమునకు నచ్చచెప్పియె చేసెను.

స్వరాజ్య పక్షనాయకుడుగ చిత్తరంజనుడొనర్చినవిశేషసేవ యెల్లరెఱింగినదియే.

దాసు అసహాయ వాదులనుండి చీలిపోయినప్పటికి నతని నెవరు శంకింపలేదు. అతని విశుద్ధజీవితమునందు - గార్యశూరత్వమునందు - శ్రేయ సంకల్పమునందు - ఆ యీ పక్షములను వివక్షలేక యెల్లరకతని యందు స్థిరవిశ్వాసముగలదు. అందుచేతనే సకలమతములవారు, సర్వపక్షములవారు- ప్రతిపక్షనాయకులు గూడ నతని నిర్యాణమున సమదుఃఖము ననుభవించినారు. అతనిచితి చుట్టు ప్రదక్షిణమొనర్చి దుఃఖాశ్రుజలంరాల్చుటకొఱకు నపార జనసంఘమావేశకాంఘుట్టమున, మూఁగినది.

ఈదేశబంధువుని మహాప్రస్థాన సమయమున లక్షలు కుందిజనులు శవము కను సరించిరి. చెదరి పోవుచున్న హృదయములనుబిగ్గ పట్టుకొనియాదృశ్యమునుభరించిరి. మహాత్ముని స్థిరచిత్తముఁగ ర్తవ్యతామూఢమైపోయినది.

... ... ..

"ఎచట వీరోత్తములు మరణింప లేదా
యచటి వారలు దుఃఖింప వగుదు గాక!
ప్రాణసంత్యాగ మొనరిచి బ్రిజలకొఱకు
నెత్తురోడ్చుచునే మరణించి వారు
వారు మాఱాధులని చెప్ప భాగ్యమబ్బ
మనము చింతింప నేల ... ..."

"ప్రాణమునైన వీడి దేశసేవ యొనర్చెద" నని ప్రతిజ్ఞ చేసినట్లే చిత్తరంజనుడు దేశముకొఱకు ప్రాణమును కూడ త్యజింపగల్గెను. అతనియాత్మ యొక్క తీవ్ర జ్యోతిస్సులకు ఆవరణమై యతని శరీరము నిల్వలేక శీర్ణమై పోవుచు విశ్రాంతికొఱకు ఘోషించినను-ఆఅపత్సమయమున గూడ నతడీ విషయముగు సంచలనమును మానక యుద్ధమధ్యమున ప్రాణముల నుత్సర్గ మొనర్చెను. దేశదాస్యవిమోచనమె వానియాకాంక్ష. జగత్పతిభారతవర్షమునకుదాస్యవిముక్తిప కలుగజేసి దేశబంధునిఆత్మకు శాంతికల్గజేయుగాక!

... ... ...

"సర్వ ధర్మముల పరిత్యజించి దాని (ధర్మము)కొఱకు పూర్ణముగనాహుతిగమ్ము. ఆయాహుతి పవిత్రమైనదియు ప్రకాశవంతమైనదియగును." ఇది దేశబాంధవుని జీవితము యొక్క ఫలశ్రుతి.

పిం. నా.

# చిత్తరంజన నిర్యాణము.

( తల్లాప్రగడ సూర్యనారాయణరావు గారు. )

సీ॥ నాముద్దు బిడ్డఁడు నన్నెడబాసెనే, యనుచుఁ గోరుచు దేశజనని యేడ్వ.
కుడిహస్తమే నాఁడి పడిపోయెననిగాంధి, పరితాపమునను బాష్పములరాల్ప.
కామితార్థములిచ్చు కల్పవృక్షము పోయె, ననిధర్మకార్యార్థు లడలుచుండ.
మానాయకుఁడు పోయె మాకేది దిక్కని, కోడిస్వరాజ్య వాదులుగలంగ
గీ॥ వంగకవిశేఖరులుజాల వగలఁబొగల, గుండెదడబోయి రిపుకోటి కుదురుపడగ
శోకమున భారతీయులశ్రువులుగురియ, చిత్తరంజను డక్కటా! చేరెదివికి॥
సీ॥ తనధనం బిసుమంత దాటిపోకుండంగ, జనులకిచ్చియు వెంట గొనిన ప్రోడ
తనయశఃకాయంబు ధర నావరింపంగ, నొడలగ్ని కాహుతి యిడినదంట
ధైర్యసాహసములు దనచెంతఁ జేరంగ, నభయ మొసఁగిన యట్టిదిట్ట
అహింసవెట్టిన కార్యమునకు జయమిమ్మ, కనుసన్న మెలఁగ జేసిన ఘనుండు.
గీ॥ ప్రాణమున్నను బోయిన బ్రజలకొఱకె, యనెడు వాక్యంబె యంత్యవాక్యంబుగాగ!
దేశమాతారాధనము చేయ దివికి త్యాగి, చిత్తరంజనుడక్కటా! చేరెదివికి॥
సీ॥ విద్యలుండెడిచోట విత్తము నిలుబోదు, వితరణముండదు విత్తమున్న
వాక్శక్తి జెలంగ వక్తృత్వముండదు, ప్రతిభయుండదు రెండు జతగనున్న
పతిమంచివాడైన సతిమంచి దుండదు, సుతుమేల్మి బుట్టుచో జతనుపడదు.
ఊరని చేరున్న నుండదు దేశాల, ఖండ ఖండమ్ములగల్గదనలె.
గీ॥ నాయకతయున్న నగ్రగణ్యతలభింప, దొనరెనన్నియు జిత్తరంజనుని యొద్ద
భరతఖండంపు నేటి దౌర్భాగ్యమేమొ, నస్తమించెను గుణరాశి యక్కటకట!
సీ॥ నేలకు వేల్వచ్చు వృత్తి విసర్జించె, గ్రామవాసమ్ముల ద్రోసిపుచ్చె
స్వస్తిచెప్పెను దేహసౌఖ్యమ్ములకు నెల్ల, నధికారములు నేని యాసవీడె
బడలి స్వాతంత్ర్యంబె వడివడి త్యజియించె, ద్రోసి రాజనియెను రోగవీధి
ఆలుబిడ్డలమాట యడుగున బడద్రోచె, నైహికమ్ములకు సన్యాసమిచ్చె.
గీ॥ తల్లి గతకండ్లబడుచుండ ధర్మవిదుఁడు, తనయుఁడెటువలె సౌఖ్యమ్ము గనెడునంచు
సకలము సమర్పణము చేసి జననికిపుడు, ప్రాణములె హారవోసె మాతృఋణమునకు.
సీ॥ కవివతంసుఁడవు భక్తవతంసుడవు నీవ, భోగివి నీవ విరాగివీవ
కార్యవాదివి నీవ ఖడ్గవాదివి నీవ, ధనికుండవీవ పేదవును నీవ
నిర్మూలన క్రియానిపుణుండవను నీవె, నిర్మాణ కార్యధీవిధివి నీవె
గడియించితీవ లక్షలకొలంది ధనంబు, తృణముగా దాని వెచ్చించితీవ
గీ॥ సరస సంగీత సాహితీ సహితుడీవ, కట్టి విప్పంగ గలజగ జెట్టివీవ.
" చిత్తరంజన! యైహికోద్వృత్తి నీకు, చాలినది లేకపోయితే స్వర్గమునకు.

# విజ్ఞానవిషయములు

:o:

( ఆర్. రంగనాథశాస్త్రి గారు. )

## ౧. నూతన పతనరక్షకము.

ఇటీవల సార్జంటుఫోర్డు (Sergeant ford) అనునొక అమెరికా దేశపు వైజ్ఞానికుడు ఆకాశమునబోవువేళ విమానము భగ్నమైన నందు మనుష్యులు క్రిందపడిపోకుండ



ఫోర్డుదొర గిరుర్రున తిరుగుచున్న విమానమునుండి తనచే నిర్మింపబడిన యంత్ర సహాయమున ఆకాశమున వ్రేలాడు చున్నాడు.

రక్షించుటకై నూతనపద్ధతిగా ఒకవిచిత్రమగు పతనరక్షక (paracchute) ను నిర్మాణము చేసియున్నాడు. దీనియొక్క కార్యదక్షత్వమును పరీక్షించుటకై అతడొనర్చిన ప్రయత్నములను విన్నవారికి మహదాశ్చర్యము కలు



ఫోర్డుదొర కేలపైదిగి పతనరక్షకమును ఉక్కపెట్టుచునాడు.




చిత్తవిక్షేపముయొక్క వైచిత్ర్యము.

గును. నేడీనూతన నిర్మాణము వైజ్ఞానిక మండలమందు జీవనరక్షాయంత్రముగ ప్రసిద్ధి బడసియున్నది.



ఘోరుదార పతనరక్షక సహాయమున భూమి పైకి అవతరించు చున్నాడు.



కవిలోదిగక పూర్వము ఫోర్డు పతనరక్షకమువరీక్షచేసి చూచుకొను చున్నాడు.

౨. సౌధోద్యానములు.

న్యూయార్కు పట్టణమందుకొందరు అత్యున్నతములైన తమసౌధో పరిభాగములందు రమ్యములగు నుద్యాన వనములనునిర్మించి తమవిలాస విహారములను



రాచపుండు చికిత్సాయంత్రము.

జరుపుకొనుచున్నారు. మేడలపైపెద్ద పెద్దవృక్షములను నానా లతాదులను పాతుటయేగాక మధ్యమధ్య జలాశయములను నిర్మించిఅచ్చట నౌకలయందు కూడ విహరించుచున్నారు.

3. నౌకలపై విమానములు.

ఇదివరకు కేవల స్థానాభావముచేనౌకలపైనుండి విమానము లెగిరిపోవుట కవకాశములేదు. ఇప్పుడుయీ

యిబ్బందినినివారించుటకై యొక క్రొత్త యుపాయము కనిపెట్టబడినది. ఇందు మూలమున ఆకాశ విమానమును మహాసముద్రముల మీద కావలయు నన్నపుడు వదలి తదితర సమయముల కట్టి యుంచవలయు.



స్టీమరు పైన విమానము విశ్రమించి యున్నది.



మునిగెడు పడవ జలోపరిభాగమందు నిలిచియున్నది.



జలాంతర్భాగము నందలి పడవలు.

౮. మునిగెడు స్టీమరులు.

శత్రు వర్గమువారి స్టీమరులను ధ్వంసమొనర్చుటకై వైజ్ఞానికులు కొందరీ స్టీమరును కనిపెట్టియున్నారు. ఆకాశవిమానమెట్లు భూమి నుండి ఆకాశములోనికెగిరిపోగలదో ఇదియట్లు సముద్ర గర్భమునకు దిగిపోగలదు. సముద్రోపరిభాగమునందు కూడ నౌకవలె సంచరించగలదు.

౯. రాచపుండు.

మానవ శరీరమునకు లోపలి భాగమున లేచు కురుపులకు 'రాంజన్స్' రశ్మికిరణములతో చికిత్స చేయుటకై డాక్టరు డబ్ల్యుకూలిడ్జ (Dr. W. Coolidge) అను నొక వైజ్ఞానికుడు క్రొత్త యంత్రమును కనిపెట్టినాడు. దానివలన లోపలనున్న కురుపు ఏ స్థితి యందున్నదియు త్వరలో కనుగొనవచ్చును.



సముద్రప్రవేశమునకై కవచము తొడుగుట. ఒకడు కవచముతో సముద్రములోనికి ప్రవేశించు చున్నాడు.

### ౬. చిత్తవృత్తి పరివర్తక యంత్రము.

తామసువిల్ఫ్రేడ్ (Thoms wilfred) అనునొక వైజ్ఞానికుడు కలర్ ఆర్గన్ (Colour organ) అను నొక నూతన యంత్రమును నిర్మించి దానిచే మానవులయందిమిడి



గాలితిండిసప్లయి చేసెడియంత్రము.

యున్న ఇచ్ఛాశక్తిని తనయిష్టము వచ్చినటుల మార్పగలుగుచున్నాడు. ఈ యంత్రమూలమున వెలుతురునవే కరంగులుగా విడదీసి మానవ చిత్తమునకు ఒకప్పుడు సంతోషమును ఒకప్పుడు ఆగ్రహమును వచ్చునటుల చేయును. ఈ యంత్రము లొసగించు వెల్తురు సహాయముచే అనేక రోగుల మానసిక వ్యాధులను నయము చేసియున్నాడు.

### ౭. సముద్రప్రవేశమున కుపాయము.

మునిగిపోయిన స్టీమరులను మరలపైకి తీసుకొనివచ్చుటకై కాప్టెన్ చార్లెస్ విలియం

అను నత డొక యుపాయమును కనిపెట్టి ధరించి సముద్రాంతర్భాగము నందువ్వ యున్నాడు. ఆతడొకవిధమగు కవచమును చ్ఛందముగ విహరింప గలుగుచున్నాడు.



చిత్రవృత్తి నిర్దేశక యంత్రము.



వెలుగురేఖలు.



సముద్రమునందలి అధోభాగము.

ఒక్కసారిగ పతితు సముద్రములో అయి వారు మానములుండగలరు.

౮. ప్రాచీన స్తంభము.

పెన్సిల్వానియా విశ్వవిద్యాలయము



ప్రాచీన కాలపు స్తంభము. విశ్వవిద్యాలయములో మ్యూజియములో నిలవబెట్టుచున్నారు.

మ్యూజియమునందు ఆకు పాషాణ నిర్మితము లగు వేలాసంవత్సరముల నాటిదని అభిప్రాయైన ప్రాచీనకాలపు స్తంభములపైన వ్రాయ యపకుచున్నారు. ఒక్కొక్క స్తంభమును బడిన లిపిని చదివి కొందరు పురాతత్వవిశేషజ్ఞుల బరువుగలది.



# యోధబలి.



ఆ నవనభూమి ప్రస్తుతులైనవారి
కర్మభూతముమ్రింగ వక్త్రింబుదెఱచె!
దాన నెడదలు చిదురలై ధైర్యమేది
చివికి చిల్లరకాండ్రు నిర్జీవులయిరి.

నిలుచువారును నిస్తేజనేత్రులగుచు
న్రపసన్నముఖావ్యాకులంబు
ముద్రిగ్రైనాన శేతనమ్ముగములందు
చితికిపోయి రెండును బరాచీనులగుచు.

ఆత్మలక్ష్యంబు లోఁ బరాస్తములయి
రాయి గుండియముఖ్య శీర్ణములుగాఁగ
అలసతనుజెంది జర్జరితాంగమగుచు
జనత కర్తవ్యతామూఢతను వహించె.

అట్టిగంభీర నైశ్శబ్ద్యమందునుండి
నూత్నరాగంబులూది వేణుధ్మఁ డొకఁడు
ప్రళయకాలాంధ్యమున సినీవాలి వోలె
దవరి యాకర్మభూతాస్యమున జొరంగ
బాహిరిలివచ్చి నిశ్చిద్రప్రాంగణమున.

వాగులుప్పొంగి బరలెంచు వరదవోలె
చిట్లిత్రేగడి విద్యుదర్చిఃకణంబు
గతిని ప్రేక్షకులెల్లరద్భుతపడంగ
హానికోరలు బెరికి తద్వక్త్రగహ్వ
రాంత ప్రత్యంతకూపంబులందునదిగి
యరిగి లియ్యమైపోవు కాపఁడు—జంత
కర్మభూతము శాంతమంగళ సురూప
భవ్యమైయొప్పె నీయోధబలికతమున
దళితజాతి ప్రణూత్నచైతన్యమందె
జనతకాతఁడు చిత్తరంజనుఁడునయ్యె.

(పాఠకుఁడు.)

# జపానుదేశము.

## సాంఘికపద్ధతులు.

(కె. యస్. చౌదరిగారు)

నేను జపానుదేశమందు కొలది మాసములు మాత్రమున్నను ఆదేశమందలి యాచార వ్యవహారముల గూర్చి తెలిసికొనుటకు మిక్కుటముగ బ్రయత్నించితిని. జపానుదేశమును గూర్చి నామనమునకు గోచరించినంతవరకు సోదరదేశీయులకు తెలుపవలయునను సంకల్పముననీ వ్యాసరచనకు గడంగితిని.

ఆ దేశస్థులు పరస్పరమెట్లు పరిచయము గలిగించుకొందురను విషయము మొట్టమొదట మనముంకు దట్టును. మనదేశమందు నమస్కారము—వందనము—క్షేమమా—బాగున్నారా!— అను మొదలగు వానిని పరస్పరము పరిచయముకొరకుపయోగింపుచుందురు. వీనియందొకింత భేదముగలదు. కులములు — కొద్దిగొప్పలు—విద్యాబుద్ధులు— మొదలగు వానినిబట్టి పైవాక్యములనుపయోగింపుచుందుము. ఇటులనే జపానునందు గూడ భాషాగతమును భావాగతమునను వివిధభేదములతోడ నాత్మపరిచయ మొనర్చుకొనుచుందురు. పరిచయము లేనివారి యింటికెవడయిన యేగినయెడల "గమేంకుదాసాయి" అనిపిలిచి వాకిలియొద్ద నిలుచుందును. అప్పుడా యింటిలోనివాడు తలుపు తెరచి యిట్లనును. "ఇరాస్యాయి" అనగా దయచేసి కూర్చుండవలయుననియు, గమేంకుదాసాయి అనగా క్షమింపుడు— తప్పు బట్టకుడనియు గ్రహింపవలయును. అపరిచితుడగు వాడీవాక్యమును బిగ్గరగ నుచ్చరించును. స్త్రీలయినచో నమ్రతతోడ మెల్లగ నుచ్చరింతురు. ఇరాస్యాయి అనుటలోగూడ స్త్రీలయినచో నిదానముగను పురుషులయినచో స్ఫుటముగను పల్కుదురు.

పరస్పర పరిచయస్థులొకచో గలసినప్పుడు గమెంకుదాసాయి అనియనరు. "కన్నిచువా" అనియందురు. కాని యీకన్నిచువా యనువాక్యమును అపరిచితులలో నెప్పుడు నుపయోగింపరు. దీనియర్థము సుదినము లేక గుడ్డుమార్నింగు సమతుల్యము. ప్రాతఃకాలమైనచో "వాహావాంగోజాయిమాస్" అనియందురు. అనగా సుప్రభాతమని సాయంత్రము లేక రాత్రియైనచో కన్నిచువాకు మారుగ కొంబాంవా అని యుపయోగింతురు. అనగా గుడ్ యీవినింగ్ అని యర్థము.

మనదేశమున సాధారణముగ ప్రసంగమైన పిమ్మట లేక కార్యాంతమున సెలవు—పోయివస్తాను— వెళ్ళొస్తా—మంచిదిపోయిరా— అనియనుచుందుము. ఇదేవిధముగనే జపానునందు సాయోనారా, యనియనుచుందురు.

మిక్కిలి స్నేహితులైనచో కన్నిచువా మొదలగు వాక్యములకు మారుగ ఇయాసిక్కే అను వాక్యమును వ్యవహరించెదరు. ఏమిటి—ఎట్లావున్నావు? అని దీనియర్థము. సాంఘికశ్రేణీవిభాగము ననుసరించి యభివాదక వాక్యములుగూడ మారుచుండును. మనదేశమందు నమస్కారమను నప్పుడు చేతులు జోడించెదము. అటులనే జపానునందు పెద్దలతోడ యభివాదనం బొనర్చునప్పుడు పరస్పరము తలవంచెదరు. గృహములయందయినచో మోకరించి కూర్చుండి

తలవంచెదరు. యూరోపునందు సాధారణముగ కాలిజోడుతోడనే గృహములయందు తిరుగుదురు. మన దేశమందటులగాదు. కాలిజోడునువిడచి యింటియందు సంచరించెదరు. జపానునందుకూడ కాలిజోడును నియమిత స్థలమున విడచి గృహములోని కేగవలయును. సాధారణముగ వారిగృహములయందు అ 1 1/2 యెత్తుగల తక్తా బల్లయుండును. దానిమీద దాదాపుగ 1 అంగుళము మందముగల పరుపుండును. దానిమీద కూర్చుందురు. ఉపాసనకాలమందు చేతులనోడించుకొని తలవంచి యుందురు. మన దేశమునుండి యీ సంప్రదాయము బౌద్ధధర్మముతోబాటు జపాను దేశమునకేగినది.

పూర్వకాలమునకును ఇప్పటికిని యతిథిసేవయందు చాల వ్యత్యాసము గన్పడుచున్నది. మనయాంధ్రదేశమునందతిథి సత్కారమిప్పటికిని పూర్తిగ లోపించినదనజాలము. దీనికి కులాచారములు మిక్కిలియాటంకమును గలిగించుచున్నవి. అందువలన బంధువులుతేక యేశాఖవారయినచో యోచింపవలసినదేలేదు. కాని సాధారణముగ స్వశాఖీయులుగానివారు పరమాప్తులయినప్పుడు నాగరికుల గృహములయందు కాఫీ, టీ తాంబూలాది మొదలగు వాని నిచ్చి సత్కరించుటతోడ దృప్తిపరచుచున్నారు. ప్రాచీనకాలమున మనదేశమందతిథిని దేవతుల్యునిగ దలచి పూజించుచుండిరి.

బాలోవా యదివావృద్ధో
యువావా గృహమాగతః
తస్యపూజా విధాతవ్యా
సర్వదేవ మయోతిథిః

(చాణక్య నీతిశాస్త్రము.)

ఆభావము నేడుపూజ్యమని మరువుటచే సంశయింపవలసినపనిలేదు. జపానునందు అతిథిసత్కారమింకను పూజ్యమాయెనని నుడువజాలము. బంధువులు మొదలగువారు వచ్చినయెడల వారిని సగౌరవముగ బలుకరించి గృహమధ్యమందుండు (జాబికీ), యనుపరిదేశమున గూర్చుండబెట్టి మాట్లాడుదురు. ఆదిమన దేశమందలికచేరిసావడివలె చక్కగనలంకరింపబడియుండును. అతిథులుబంధువులు స్నేహితులు మొదలగువారు వచ్చి కూర్చున్న వెంటనే తేయాకునీరిచ్చెదరు. తేయాకు నీటియందు పంచదార పాలుగలిపి మనము త్రాగుచుందుము. ఇదిపాశ్చాత్యులవలన మనకు లభించిన మహాభాగ్యము. జపానునందు ప్రతియొక్క యింటియందును కచేరిసావడియందు నిప్పుకుంపటి యుండును. దానిమీద వేడినీరెప్పుడును కాగుచుండును. అందువలన నతిథ్యభ్యాగతులు వచ్చినంతనే యందు తేయాకువేసి యానీటినిచ్చెదరు. కాని యందు పాలను పంచదారను కలుపరు. ఆదేశమునందెల్లరును తేయాకునీటిని తయారుచేయగలిగియుందురు. బాలికలవిద్యను విధిగ నేర్పుదురు. దీనిని సంసిద్ధపరచు మార్గములనేకములున్నవి. వానిలో కొన్నిటినభ్యసించుటకైనను బాలికలకు మూడు వత్సరముల కాలము పట్టును. "తేయాకునీటివలననే జపానువారు రష్యాను జయించిరి." అనియొకడనిన హాస్యప్రవచనము పేర్కొనదగినది. భోజనపదార్థములు దేశకాలముల ననుసరించి మారుచుండును. జపానుదేశమందు గ్రీష్మకాలమున తేనీటినిచ్చుటయేగాక లిమొనేడు సోడా ఫలరసములో సిద్ధపరచిన షరబత్తు మొదలగు వానిని యిచ్చుచుందురు. మనదేశమునుబట్టి చూచినయెడల జపానునందు సంవత్సరమునకు 9 మాసములు శీతకాలమని నుడువవచ్చును. జూన్—జూలై—ఆగస్టు మాసములందు శీతముండదు. దానికే గ్రీష్మకాలమని నుడువవచ్చును. వారు శీతకాలమున నుష్ణపదార్థములను ఎండకాలమున చలువ పదార్థములను దినుచుందురు. భోజనము వేళమించి యతిథులు వచ్చినచో హోటలునుండి భోజన పదార్థములను దెప్పించి పెడుదురు. కాని శాకరికులను గొనువారు సాధారణముగ హోటలునుండి దెప్పించుట కలవడియున్నారు. ఈపద్ధతి పట్టణములకుసంబంధించినది. కానిపల్లెలుకూడ నీమార్గమునే యవలంబించుచున్నవి. నేడుపల్లెలకును పట్టణములకును నంతగాభేదము కానరాదు. పల్లెలయందుకూడ పూటకూళ్లయిండ్లు, దుకాణములు, సోడాషాపులు మొదలగునవి యున్నవి.

అందువలన నతిథులకు తమయింట చేసిన వస్తువులు బెట్టుటకంటెను హోటలునుండి భోజనమును దెప్పించి బెట్టుట గౌరవముగ దలంపుచున్నారు. జపానునందలి పట్టణములయందు పూర్వసాంప్రదాయము గానరాదు. పల్లెలయందొకింత యతిథియభ్యాగతుల పూజగన్పడుచున్నది.

మనదేశమునందు బ్రాహ్మణులు వైశ్యులు మొదలగువారుదప్ప మిగిలినవారు మాంసమును మత్స్యములను దిందురు. అన్నము, పప్పు, కూర, పులుసు మొదలగువానిని యెల్లరును దినుచుందురు. పాశ్చాత్య దేశస్థులు మాంసభుక్కులు. వారు దానితోడ రొట్టెను, బంగాళా దుంపలను దినుచుందురు. దేశభేదమునను సరించి యాహారము మారుచుండుటవలనే భోజనపద్ధతులుకూడ నొక్కొక్క దేశమందొక్కొక్క విధముగనుండును. మనదేశమందు భోజనకాలమందు పురుషులు భోజనమైన తర్వాత స్త్రీలు భుజించెదరు. కూర్చుండుటకు పీటలుండును. సాధారణముగ శాకభక్షకులు ఆకులయందును, మాంసభక్షకులు పళ్లెములయందును భోజనపదార్థములనుంచుకొని వానిని చేతితో దీసి నోటబెట్టుకొనిదిందురు. ఇప్పుడాచరణయందు లేకున్నను భోజనమునకు గను మాట్లాడ గూడదను నియమముగలదు. పాశ్చాత్య దేశీయులు బల్లమీద పళ్లెములయందు పదార్థములనుంచుకొని వానిచుట్టు కుర్చీలమీద స్త్రీలు పురుషులు పెద్దలు పిన్నలు కూర్చుండి కత్తులు చమచాలు మొదలగువానితో బట్టి వానిని దిందురు. కాని చేతముట్టరు. బల్లకడ కూర్చుండి భోజనమగువరకు కబుర్లు కథలు జెప్పుకొనుచు దినుచుండుటయే వారిపద్ధతి.

మనయాంధ్రదేశస్థులవలె జపానువారిముఖ్యఖాద్యము వరియన్నము. చీనా-జావా-శ్యాము-బర్మా మొదలగు దేశములవారి భోజనముగూడ యన్నమేను. జపాను శీతప్రధాన దేశమగుటవలన వత్సరమున నొకపంటమాత్రమే పండును. వానికి ప్రశస్తమైన యెరువు వేయుదురు. అందువలన మనదేశపు బియ్యముకంటెను వానివెల మిక్కుటము; రుచిగ నుండును.

ఇప్పుడు సాధారణముగ బర్మానుండి జపానునకు మిక్కుటముగ బియ్యము ఎగుమతి యగుచున్నవి. ఏలయన ఇవిచౌక. జపానునందు శేరుబియ్యము వెల 6-7 అణాలకు తక్కువయుండదు.

జపానువారు వరియన్నముతోడ మత్స్యములు మాంసము కూర మొదలగువానిని గలుపుకొని తిందురు. ఒకచిప్పయందు భోజనపదార్థములనుంచుకొని కొయ్యముక్కలతోడ దానిని నోటియందు వేసికొని తిందురు. మన దేశమందలి కూరకాయలన్నియు నచట దొరకును. ఆశాకము లొకవిధముగ నుండును. మనదేశపు తాలింపులు మొదలగు వానిని వారెరుంగరు. జపాను చుట్టు సముద్రమేగదా? అందువలనవారు సముద్రపు చేపలను దిందురు. నదులయందలి మత్స్యములు వారికప్పుడప్పుడు లభించును. జపాను వారిని మత్స్యభుక్కులనవచ్చును. వారిలో యొక్కొక్కరు పెద్దపెద్ద మత్స్యముల రెండింటి నైనను దిననిది భోజనము పూర్తిగాదు. పూర్వకాలమున జపాను దేశమునందు సముద్రము తీరమునందుండనివారు శాకభక్షకులై యుండిరి. కాని క్రమముగ వారుగూడ మత్స్యముల దినసాగిరి. 60. 70. సం॥ క్రిందటివరకు జపానునందు మాంసమును దినువారు లేకుండిరనుట యతిశయోక్తి గాదు. కాని పోర్చుగీసులు, స్పెయినులు, రష్యనులు, అమెరికనులు, ఇంగ్లీషువారు వచ్చిన తరువాత వారిని జూచి జపానువారు మాంసభక్షణకు గడంగిరి. ఇప్పటికి 80. 40 సం॥ క్రిందటవరకు నెచటనైన నొకరిద్దరు మాంసము దినువారుండినను వారత్యంత రహస్యముగ దినుచుండిరి. ఏలయన నావిషయము నిందనీయమైయుండెను. కాని యిప్పుడు మాంసముదినని జపానీయుడే లేడు. వారుగంజి వార్చనియన్నమును దిందురు. కూరనెయ్యి, పులుసు ఉప్పు మొదలగు వానిని వేయుదురు. (సోయిడ్, అనేకవిధములగు వస్తువులు వేయుదురు. అందువలన కూరలకు మంచిరుచి కలుగును. ఈమసాలా యితర దేశములకుగూడ యెగుమతి యగుచున్నది.



# సంధిపత్రము.



(వి. వేంకటసుబ్బారావుగారు.)

ప్రాచ్యదేశ స్వతంత్ర రాష్ట్రముల వారు సంధి జేసికొనిరను విషయము వెల్లడియయ్యెను. దీనిని పురస్కరించుకొని సభ్యరాష్ట్రముల యందంతటను నాందోళనము ప్రారంభమైనది. గతించిన మహా సంగ్రామము జరుగుటకు పూర్వమందును సంగ్రామానంతరమునను అనేక విధములగు సంధులను స్వతంత్ర రాష్ట్రముల వారు జేసికొని యుండిరి. కాని యవియన్నియు యూరపు రాజ్యములకు సంబంధించినవి. ఆ యొడంబడికల యందు ఆసియా ఖండవాసులకెట్టి సంబంధమును లేదు. ఈ సంధి మాత్రము ప్రాచ్యదేశములకు సంబంధించినది.

రుషియా, జపాను, చీనాదేశముల వారొక యొడంబడికకు లోబడి పెకిను నందు సంధి పత్రముమీద సంతకముచేసిరి. ఈ సంధిపత్రమందలి ప్రధాన విషయమిది. ఇంగ్లీషువారుగాని లేక ఫ్రాంసు అమెరికావారిలో నెవరైనను పెకిను గవర్నమెంటుకు విరుద్ధముగగాని లేక చీనాదేశమునకు విరుద్ధముగ సైన్యముల ప్రయోగించినచో రుషియావారు చీనావారికి రెండులక్షల సైన్యమును నీయవలయును. జపానువారా సైన్యమునకు గావలసిన మందుగుండు సామానుల నొసంగవలయును. చీనాదేశమందలి తూర్పు ప్రాంత్యమందు రషియావారికి యనేక రయిలు మార్గములుగలవు. వానిలో సగము జపానువారికీయవలయును. Saktrlian యను ప్రదేశమును జపాను వారికీయవలయును. అయిదు వత్సరములలోగా జపాను వారు రుషియా వారికి 5 యుద్ధనౌకలను 30 సబ్ మెరీన్‌లను 6 డిస్ట్రాయరులను నీయవలయును. వ్లాడివస్టాకునందు సర్వోత్తమమగు హార్బరునుగట్టవలయును. అది యాసియా ఖండమునకంతకు ప్రాముఖ్యముగ నుండును. దీనిని గట్టుటకయిన ఖర్చులో 100 కు 60 చొప్పున జపానుదేశమును 40 చొప్పున రష్యాదేశము భరించును. చీనావారు 8 లక్షల సైన్యమును శాంతిరక్షణకొరకు రుషియా జపానువారు చెప్పినటుల యుంచవలయును. యుద్ధ సామగ్రిని చీనాదేశము రుషియా జపాను దేశముల

యందు మాత్రమే కొనవలయును. ఇతర దేశములయందు కొనరాదు. 30 వత్సరముల వరకీ యొడంబడిక యుండును.

జపాను-చీనా గవర్నమెంటువారి సంధివిషయము పర్యాబద్ధమని విడివిడిగ బహిష్కరించియున్నారు. జపాను వాణిజ్య సంఘమువారి సంధిని పురస్కరించుకొని సంధిపత్రమున కంగీకరించి సంతకముచేసి వందులకు రష్యావారికి వందనము లర్పించి యుండిరి.

యుద్ధమొనర్పవలయునను దలంపున లేక యేదయిన యుద్ధము సంభవించినయెడల స్వరక్షణకొరకు రష్యాపు టొడంబడికలు చేసికొనుచుందురు. మహా యుద్ధానంతరము మానవకోటి స్థితిగతుల యందును, చింతన మందును నత్యద్భుతమగు పరివర్తనము సంభవించినది. కాని శాంతి చేకూరలేదు. అశాంతిమాత్రము దేదీప్యమానమై వర్ధిల్లుచున్నది.

అమెరికావారు ఎమిగ్రేషనుచట్టము నేర్పాటుచేసి వారి దేశమునుండి జపానువారిని తరిమియున్నారు. భూకంపము మొదలగు మహావిపత్తులు సంభవించనియెడల జపాను వారిప్పటికే దానికి ప్రతిక్రియను జరపి యుందురు. అందువలన ప్రతిక్రియకు కాల యాపనంబయినదని దోచుచున్నది. కాని వారూరుకొందురని దలంపరాదు. బ్రిటను, ఫ్రాంసు, అమెరికావారు ఆసియాఖండము నకు ప్రభువులైయున్నారు. జపానువారి శక్తిస్వల్పము. అందువలన పరుల సహాయమున బలిశాలియైనగాని అమెరికా మొదలగువారిమీద తిరుగబడజాలదు.

కావుననే జపానునకును రష్యాకును సంధిప్రయత్నములనేక దినములనుండి నడుచుచున్నవి.

ఇంగ్లీషువారు సింగపూరునందు హార్బరు గట్టుచున్నారు. ఇది జపానువారి భయమునకు ముఖ్యకారణము. ఇటనుండి యింగ్లీషువారును అటనుండి యమెరికా వారును ముట్టడించిన జపాను నిలుచుటదుస్తరము. ఇంగ్లీషువారు అమెరికావారు జపానును సరియగు దృష్టిని చూచుచున్నారని నుడువజాలము. క్రిమోన్నతశాలియగు నీచిన్న జపానుదేశము ప్రాచ్యఖండమునందు వర్తకమును వ్యాపింపజేసికొనుచున్నది. ఈవిషయము ఇంగ్లీషువారికిని అమెరికావారికిని కంటకముగనున్నది. అయినను దానికి విరుద్ధముగ బ్రవర్తింప జాలకున్నవి. పై కారణములవలన జపానువారు రష్యాపు టొడంబడికను రషియా చైనాదేశములతోడ జేసికొనియుండవచ్చును. ఇదివరకు జపాను రషియాదేశములకు బహిరంగముగనే సంధి జరిగియుండెను.

చీనాదేశమందు ఇంగ్లీషు అమెరికా మొదలగు వారి ప్రభుత్వములున్నవి. జపానుకు విరుద్ధముగ బ్రవర్తింపదలచిన యెడల చీనా దేశముమధ్యనుండి రావలయును. ఇదియే సరియగుమార్గము. గతించిన రష్యా జపాను యుద్ధసందర్భమున రష్యావారు చీనానుండి వచ్చిరనుట చరిత్రవిషయమేగదా? ఇప్పుడు చీనాదేశము అంతఃకలహములతోడ తల్లడిల్లుచున్నది. ఈసమయమున చీనాదేశముమధ్యనుండి శత్రువులువచ్చి జపానునకు నష్టముగలిగించిన గలిగించవచ్చును. ఇందువలన చీనావారిని గూడ తమలో జేర్చుకొనుట

జపానువారికి విధి. కావున నీ రహస్య సంధి ఏదికానటయిం దాశ్చర్యములేదు.

ఇంగ్లీషు, అమెరికా వారు జపాను వారికి విరుద్ధముగ నిల్తురనుట నిశ్చయము. వర్తమాన స్థితిగతులబట్టి చూచిన ఫ్రాంసు జపానుమీద కత్తి గట్టదు. ఇంగ్లీషు వారు ఫ్రెంచివారితో స్నేహితులుగనున్నను వీరిలో వీరికి వైరము రాకతప్పదు. స్వార్థగతుణకే యింగ్లీషువారు ఫ్రెంచివారితో మైత్రి సల్పుచున్నారు. జర్మనీ సంబంధమున రావలసినదబ్బు యింగ్లీషువారికి సరిగ రాలేదు. భాగ్యగనుల యందెక్కువ భాగము ఫ్రాంసువారికి లభించినవి.

అనేక కారణములవలన యింగ్లీషు వారు ఫ్రెంచివారికి స్నేహితులైయున్నారు. కాని ఫ్రాంసు యింగ్లీషువారి చర్యలు మరచునని నమ్మవలేము. ఫ్రాంసు జర్మనీని యత్యంత భయముతో గాంచుచున్నది. అందువలన యింగ్లీషువారివైపునకు దృష్టి యొకింత మరలినది. భూమధ్య సాగర సంబంధమగు కలతలు వీరిలో వీరికి దొలంగునవి కావు. భూమధ్య సాగరమునుండియే యెల్లకును ప్రాచ్యదేశములకు దావలయును. అందువలన నందలి యధికారము నెల్లరు వాంఛింపుచుందురు. ముఖ్యముగ నీసముద్రమార్గ సంబంధమున ఇంగ్లీషు ఫ్రాంసువారికి కలతలు గలిగి తీరును.

యూరపునందు యుద్ధము సంభవించిన యెడల ప్రాచ్యదేశములయందలి యుపనివేశ దేశములు రక్షించుకొనుటకు ఫ్రాంసు జపానుతోడ సంధి యొనర్చుకొనును. యూరపునందు యుద్ధము సంభవించును. కాని జరుగదని గట్టిగ నుడువజాలము. ఇందువలన ఫ్రాంసు జపానుకు విరుద్ధముగ నెప్పుడును కత్తిగట్టదు. ఫ్రాంసువారు కత్తిగట్టుదురను భయము లేకున్నను బ్రిటీషు అమెరికా దేశముల భయము చీనా జపానుదేశముల కున్నది. ఈ కారణమువలన నిరహస్యపు సంధి కుదిరి యుండవచ్చును.



చిన్ని చిగురుల నోరును చెదరవిచ్చి
కేతపూరేకు కనురెప్ప లేవనెత్తి
మింటనరయుచు మొఱనిడుచుంటగనవొ
నిమ్మచెట్టదే; నిమ్మకునిరమవేలె?

మొగ్గలరవిచ్చి వాడినమోములనఁగ
వల్లెపల్కు మల్లియ మెల్లగ వినుము
మంద రీరీతి నిముగోర మందఁగొనవె
నీటిబిందువ! దిగిరమ్మ నీవుభువికి‖

నీవు లేనికతంబున జాగవగుచు
యీటువోయిన మొగ్గలిట్లేడ్చుచుండ
వంగలతయెల్ల కసలిపోవ నటించు
మొల్లకొఱకైన దిగిరమ్మ పుడమికీన ‖

మావిలేమూన లెల్లలను మాడుచుండె
చిగురుటాల్కులు ప్రేలఘోషించుచుండ
హాహామనుచుండె చేతిపోతలజలంబు
చాలుటే లేదు దిగిరమ్మజలకణంబ!

పోతపిరిది యొకలక్ష బుంగయేని
చెట్టుచేమలదాహంపు చింతమాన్ప
జాలదీవొక్కమారు నీచల్లమెస్తు
విచ్చి కేదను దీర్పవాయేమియింక?

చల్లనై పరిశుద్ధమై సహజముగను
స్ఫటిక నైర్మల్యత వెసంగు పావనకర
హస్తపల్లవముల శ్రమ వార్పజాలు
నీదు కౌగిటి సుఖమబ్బునే ధరణికి?

పుడమితీగ బోడిగడుసరియగు దిశ
కాజానొల్లదపుడు రౌద్రిమూర్తి
యగుట, జల్లవయ్యావగుటచే నిన్నా శా
గోరు, ధర్మమూనె గోముగుటుప?

చాతకములుసురిక్కి చాలగానితోలి
చుంబనంబునిచ్చి సుఖపరప్రము
శుక్తి నిన్నుగూడ జాచెడుముత్యంపు
కోమరుపొందు నాక గునిసియాడ‖

తమ్మియాకుపైవఁ థళథళ దిరుగుచు
తమ్మిమొగ్గలోన దాగికొనుచు
నంచపూవుపోను లారయవచ్చిన
తెల్లిదొగవుకేరి తెసియుయుందు‖

పుడమికన్ని ... వుడుముత్తయంపు
సేసలోయన పచ్చికసీమనెల్ల
నివిహారంపు థళథళల్ నిండుకొనగ
నవతరింపుము భువికి నీ వంబుకణమ‖

ధారుణీమణి పచ్చనిచీరపైట
చెరగొకింతమెక చెదర నాశ్లేషమిచ్చు
నప్పుడానంద భాష్పచయంబు రాలె
ననగ భ్రమనింపరమ్మ నీవంబుకణమ!

మొయిలువరదంబుపై జాలహొయలుమీర
నెక్కి విహరింప భ్రమ్మించు నిగురుబోండ్లు
పార్శ్వముల చామరానిల వ్యాప్తి నెఱప
గురుములను భేరిమ్రోయ సంబరముతోడ
రమ్మదిగిరావు మహితసన్నమ్మ కాగ!

ఘనము దేహంబుపై నెక్కి యినుని బోర
నన్నెచిన్నెల ధనువును బట్టుటగని
విజయివై వత్తువని కడు వేడ్కనాడు
తూంనిగల కోర్కెనైన తీర్తువిక రమ్ము!

ఎండబారిన మహియెల్ల నిగురువెట్టు
తెల్లవారిన దరులెల్ల నల్లవారు
సృష్టియంతయు శోభిల్లు శ్రీదనర్చు
జాగుసేయక దిగిరమ్మ జలకణంబ!





# హిమబిందు



[ అడివి బాపిరాజుగారు. ]

## మూడవ ప్రకరణము,

### దండయాత్ర

శ్రీముఖ శాతవాహనుని సైన్యములు ఆంధ్ర రాజ్యరత్నమగు ధాన్యకటక నగరబాహ్య ప్రదేశముల విడిచియున్నవి.

మహారాజగు శాతవాహనుడు తాను జైత్రయాత్ర కరుగుటకు మహాసభను పిలిపించెను. వివిధ విషయములనుండి సభ్యులు విచ్చేసిరి. గ్రామణులు, దశనాయకులు శతనాయకులు వివిధ సమితిసభాధ్యక్షులు, దండనాయకులు మంత్రులు బౌద్ధభిక్షుకులు, బ్రాహ్మణులు పండితులు వణిక్సమూహాధిపతులు, వివిధ శ్రేణి సంఘాధ్యక్షులు, చిత్రకారకులు, శిల్పులు ఆమహాసభలో వాక్కుచే సభ్యులు, అందరకు రాజాజ్ఞలు అందగనే అధిపతి సలుపబోవు సత్కృష్ట కార్యమొక్కదానికి అనుమతి నిచ్చుటకు గాని, వీలులేదని త్రోసిపుచ్చుటకుగాని విచ్చేసిరి.

విశాలమగు సభాభవనమున మహారాజు సింహాసనాసీనుడైయుండెను. సభికులు కొలువుదీరియుండిరి. ప్రధానామాత్యుడగు ఉపేష్ణుడు లేచి సభ్యుల దిక్కుమొగంబై ఈవిధము నుడివెను. "మహాసభ్యులారా! మాళవాధిపతి మన రాజ్యమునుండి విడివడి, మహారాజుపై యుద్ధము ప్రకటించి, యుజ్జయినికోటలో విపరీతమతిని ముట్టడించినాడు. మాళవునికి సహాయ్యముగా భోజులు, పులిందులు, వైదేహులు, మాగధులు వచ్చి చేరినారట. ఆంధ్రరాజ్యము గొడ్డుపోయినదా గౌతమీకృష్ణవేణీ పవిత్రాంబువులు మీరక్తాల ప్రవహించుటలేదా ప్రియదర్శియగు అశోక చక్రవర్తికి లోబడక సమముగా రాయబారముల నడిపి స్వతంత్ర పూరితమై ఒరులకు తలయొగ్గక విశాలవంతమై ఆంధ్ర పతాకమగు సింహధ్వజ భీషణారావంబుల దశదిశల పర్వకేయు మనదేశము నేడు మాళవునిచే పరాభవింపబడవలెనా? ఉజ్జయినిలో మాళవుడు విజయ

నుందును. ఆసైన్యములతో మనదేశముపై విడియును. శాక్యశకటము కృష్ణలో కలియునా! ప్రతిష్ఠానము గౌతమిలో లీనమైపోవునా! కోటపల్లి సముద్ర తరంగములలో మాయమైపోవునా! ఆంధ్రరాజ్యలక్ష్మి ఫాలమునుండి సౌభాగ్యతిలకము మాసిపోవునా? నేను ఆంధ్రసైన్యములు మహారాజా స్వయముగా నడుప పోయి విజయయాత్ర సలిపి విరోధుల నడంచి ఆంధ్ర పౌరుషమెల్ల యెడల చాటిరావలయునా! తెలియ జేయుడు. ఇంకొకటి ఆయాత్రకు ధర్మ మహాశ్రమణు లగు వారుగు పూజ్యులవారు ధరించెదనని వాగ్దానము చేసినారు.

ఇట్లు సర్వసైన్యాధ్యక్షుడును సచివుడు మంత్రియు మహావ్యాసములు సలిపిరి. అనేక వేల జనములు పోవ్రైయున్న యామహాసభ జయజయధ్వానములు సలుపుచు మహారాజా ఈజైత్రయాత్ర విషయమై ఏమియొన రించినను వల్లెయని యొప్పుకొనిరి.

ఆంధ్రసైన్యములు బయలుదేరినవి. శతాబ్దములనుండి ఆంధ్రవాహినులు భరతభూమిని ప్రసిద్ధి గాంచినవి. చంద్రగుప్తుని కాలమున ఆంధ్రులు సర్వస్వతంత్రతకు పరాక్రమపూరితములగు మహాసైన్యము కలిగియుండిరి. అశోకునికి మిత్రులైరి. అశోకుని వెనుక భరతభూమిని ఆంధ్రసైన్యముల బలమును ఢం దొకరాజ్యమునకు లేదు. రెండు వేల ఏనుగులు, 6 వేల అశ్వికసైన్యము రథములు, పదాతి దళములు బయలు దేరినవి ఎనిమిది వృషభములు, గాల్లబృషభములు పూన్చినబండ్లు సామానులను సేవకులను దాస దాసీ జనంబులను కొనిపోవుచుండెను*

ముందు కొన్ని వేగుసైన్యములు బయలువెడలినవి. కృష్ణానదిదాటి వ్యాఘ్రదేశము§ కడచి గోదావరికడకు వచ్చునప్పటికి అచ్చట పడవలు వేనవేలు సిద్ధముగా నుండెను. రేవుస్థలములదాటి సైన్యములన్ని సిద్ధముగానుండెను. రేవుస్థలములదాటి సైన్యములన్నియు ఆవలియొడ్డుకుబోయినవి. దక్షిణకోసలము గడచిరి. కుంతలము దాటిరి. ఆంధ్రకళింగము వెనుక బడెను. తెలివాహానది దాటి కిరాతలోకములు పరిపాలించినవి. ఉప్పెనవలె ఎడారులలో వీరయు భయంకరముగు ఇసుకగాలులవలె, ఆంధ్రసైన్యములు కదనపరిమాణములు పోగిపోవుచునే యున్నవి.

ప్రకారకుమారుడు విహ్వలచిత్తుడై దుఃఖము లేనివానవలె తిరిగినాడు. అతడేమి చేయవలెను - ఆచారింపవలయునా! బాలికలవలె కన్నులనీరు సంతత ధారాగా ప్రవహింప ప్రవహింప, శోకమేమైనా ప్రాణాలు ప్రవహింపగా పోవునందాక కృశింపవలయునా? పిచ్చివాడయిపోయిన వెదన్నయ్య వెర్రిమొంతి మాటలు దిసనోలచింపిరిజుట్టు, హృదయముఏమియు కాన నెరుంగని తన్మయత్వస్థితి! నేను రౌద్రమూర్తియై ఎవరిని అడంచుట సర్వప్రపంచము నాశనము చేయుటం బమ్మయ్యో! భయంకరమది. పవనములై ఎర్రందనముగ చెలువారు అతని వేలిగ్రోళ్లు కఠోరములైపోయి పల్లవ కోమలాకారములగు పాణితలములు దృఢమై కన్నార మగు ముష్టుల గాయము లొనరించినవి. ముఖ్యముతో సొబగునవ్వుల పూలమొగ్గలై, వెలిసంపదల చంద్ర కిరణములైమిసమిసలాడు అతినిదంతములు అరుణకారుణ్య మధురరుచి ప్రవాహపూరితములైన మెత్తందనపు పెదవుల గాంట్లుపగలినవి. బోనుపెట్టిన అరణ్య మృగమువలె అతడిటు నటు తిరుగాడ చొచ్చినాడు.

మహాశిల్పియగు సమరకుమారుడు రాజాధిరాజ శ్రీముఖ శాతవాహన ప్రభువును వెన్నంటి పోయి నాడు. తానిచటకడ నుండవలయునుగా రాజాజ్ఞ. సైన్యములు బయలుదేరునప్పుడు స్తూపముల ప్రార్థనల సలుపునప్పుడు, దేవళముల నారాధన మొనరించు నప్పుడు భేరీభాంకారములు మ్రోగునప్పుడు ఈసైన్యాలవెంటపోయి ఆంధ్ర పౌరుషమునకై పోరాడి వీర శయనమున పడిపోవ అతనికి కోర్కె కలిగినది.

ప్రకారకుమారుడు ధీరోదాత్తుడు. అతనికి స్నేహితులు లేరు. అతనిహృదయము ప్రేమరసపూరి

---

* ఇట్టిబండ్లు అమరావతీ స్తూపశిల్పములలో పెక్కు-లుకలవు

§ వేంగినాడు

తనయొక్క హాస్యప్రియత్వమున కెన్నడు వ్యక్తమగు నతికాదు. అతడు సాధారణముగ అందరితోడను మాట్లాడువాడుకాడు. హాస్యము చేయుట యెరుగడు. ఎవరైన హాస్యమాడిన చిరునగవు సుగంధమువలె ప్రసరింప చేయువాడు. తండ్రిని గురువుగ పోష దత్తాచార్యుని తల్లిని తమ్ములను చెల్లెండ్రను తానుపెంచు పుత్రములగు వృషభములను గాగిలములను తనశిల్ప పుంబవిమల్లను మాత్రమాతడు ప్రేమించువాడు. గారవించువాడు. అట్టిదినేడాతడు తన్నుమించి వేసి పట్టి మహాగాఢమగు ప్రణయముతో హిమబిందును ప్రేమించినాడు.

బొమ్మలపై మనసుపోదు. వృషభశాలకుపోయి తానుపెంచు చిన్నగిత్తలు కోడెదూడలు ఉన్నతములైనవి తన్నుశకట పందెమున విజయునిగాచేసి భారత వీరునితో సమకీర్తిశాలి గావించిన ఆవృషభముల సోదరులగు నాచిన్నిపసరముల కడకుపోయి అతడు వాని చెవులలో తన హృదయ వేదన బోసికొనక డగ్గుపడి యుద్యాన వనమునకు తరలిపోయినాడు.

సరే. తానొక బాలపై కోర్కెలమునిగినాడు. ఆమెనిరాకరించినది. తన్నుహాస్యమాడినదా! ఏలహాస్యమాడవలెను. ఒరులను ముట్టుటకు సిగ్గు తనకు తానామెను కౌగలించుకొనిన యప్పుడు తనకేమియో పులకరము కలిగినది. హృదయము మేమేమియో అయినది. అలాగున కౌగలింప ఆమెతనకేలయుత్తరము వ్రాసినది? బాలనాగితనతో చిత్రముగ ముచ్చటించినది. తనచెల్లెలు నాగబంధునిక నిర్మలహృదయముతో తనకడకు వచ్చి అన్నయ్యా హిమబిందువకు నీవన్న అమితగౌరవము కలిగినది. నీవు ఆమెకవసరముండక ఆమె జీవింప లేదని బాలనాగినితో చెప్పినది. అనిఏలఅనవలెను? అరోజున అట్టి కఠోరవాక్యములు హిమబిందు యెట్లుపలికినది. ఆమెహృదయము చిరిగిపోవునట్లు యేడ్చినదే! కొలది దినములలో మనస్సుమారిపోవునా? కాదు. యేదియో అడ్డము వచ్చినది. ఏ విభూతియో సైంధవునివోలి దారికెదురైనది. ఆ అడ్డము యెన్నడు విడిపోవని దృఢలోహాలమైపోవునా? అట్లయినచో నింకతన జీవితమేమి! తాను ధాన్యకటకమున నుండి చేయునదియేమి.

శక్తిమతీదేవి కుమారుని మూర్చచూచినది. కొన్నినాళ్ళు అతడు పరధ్యానమున నుండుట వాడిన ముఖముగ యెర్రబారిన కన్నుకొలకులుండి, భోజనము అందభీష్టము లేక వర్తించి, మరల సంతోషమున తేజరిల్లినాడు. మరల యిదియేమి! విద్యావంతురాలును సాధుశీలయును గడుసు దనమున చరించునదియు నగునాపె అతడు హిమబిందును ప్రేమించుచున్నాడని జ్ఞప్తికి తెచ్చుకొన్నది. హిమబిందు తనయింటికి వచ్చినప్పుడు తనయందెంత సౌహార్దము చూపినది. చనువుగ ప్రేమను సంచరించినది. అప్పుడే ప్రహరుడు ఆమెయును కలిసికొని స్నేహమున మాట్లాడిరనియు. దృఢానురాగ పాశబద్ధులైరనియు సాంకేతికముల నేర్పరచుకొనిరనియు నాగబంధునిక చెప్పినది. ఇప్పుడు వీనికిమరల యీ విచారమేమిటి. కుళ్లిపోవుచున్నాడు. ఆనంద మొకింతయు కానబడదు.

ఆమెనాగబంధునిక కనుపించినది. ఇరువురు మాటాడిరి.

శక్తి:— ప్రహరుడు మనస్సు బాధచేసుకొను చున్నాడేమిటి తల్లీ!

నాగ:— నాకు తెలియదు. అడిగిన మాట్లాడడు. ఏదియో పనిపంకమీద ఎక్కడికో పోవుచు నుండును. ఒకచిత్రము లిఖింపలేదు, శిల్పకాంతి పోకలేదు.

శక్తి:— మహాలినిపిలు.

నాగబంధునిక మహాలినికొనివచ్చెను.

శక్తి:— బాలనాగితో మాట్లాడి నావా మహాలీ?

మహా:— మాటాడినానమ్మా, ప్రహరకుమారు డేతనకు ప్రాణము. అతడు లేనిచో జీవింపలేనంత స్థితికి వచ్చినదట హిమబిందు. ఉత్తరములు వ్రాసికొన్నారు. వారితోటలో కృష్ణాతీరాన్ని కలిసికొన ఏర్పాటుచేసికొన్నారు. ఇంతలో

యేమి జరిగినదట. గుండె వ్రయ్యలగునట్లు ఏడ్చినదట. హిమబిందు మూర్ఛలో మునిగినదట. ఎట్లనో అతికష్టము మీద ప్రహరుణ్ణి కలిసికొన్నదట. అక్కడనేమిజరిగినదో పిచ్చివానివలె అబ్బాయి పారిపోయి నాడట. హిమబిందు వాడలు తెలియక ప్రవాహములవలె కన్నీరు ప్రవహింప తేరపైనింటికి వచ్చినదట.

శక్తి:— ఏమిది, అబాల, యక్షిణికాదుకదా?

మహాలి:— ఏమోనమ్మా! బాలనాగి ఏదియో జరిగియుండుననియు తండ్రికి హిమబిందు ప్రహరుని ప్రేమించు చున్నట్లు తెలిసి, వద్దని చెప్పినాడనియు అన్నది. అందుకనే హిమబిందు తండ్రికి వ్యతిరేకముగా సంచరింప నిష్టములేక బెంగపెట్టుకొని ఏడ్చుచున్నదని చెప్పినది.

నాగ:— హిమబిందు తండ్రికి వ్యతిరేకము చేయదు! అంతవిధేయురాలా! ఆమెఎవరికైనా విధేయురాలుగా ఉన్నదీ? ఆమెకు ఇష్టము వచ్చినట్లు ఆమెచేయుటయేగా! ఎట్టిపెంకి అన్నయ్యను పెద్ద హాస్యముచేయవలెనని చేసినది. నాకు తెలియదా! ఆమెసమవర్తిని ప్రేమించినది, తండ్రిఎద్దులుతోలి సమవర్తి యోడినాడు. అన్నయ్య నెగ్గినాడు అప్పుడుఆఅమ్మాయిముఖము నేనుచూచుట లేదాఏమిటి? కోపమున జేవురించినదిలేఅమ్మా, మండిపోయినదే! మహారాజు గారికుమార్తెలతో నాట్యమాడి అన్నయకు హారతి ఇచ్చినప్పుడుఅంతే. అందుకని నిప్పుడిట్లుపరాభవించినది. అన్నయ్యతో నేనుఅంతా చెప్పవలె.

శక్తి:— ఛట్! వెఱ్ఱిపిల్లా ఆసంగతినాకు వదలిపెట్టు నేను నాన్నతో మాట్లాడి అంతా తెలిసి కొనెదను,

## నాల్గవ ప్రకరణము

శక్తిమతీదేవి విద్యావంతురాలు పలుచగపొడగరియై, లావణ్యవంతమగు దృఢ శరీరముకలిగి అందమున కొప్పులకుప్పయై యుండును. ఆమె సౌందర్యమునకు నొక్కటేలోటు. ఆమెముక్కు గరుత్మంతుని నాసికవలె పెద్దది, అయినను నిడుదలైవిడబారినకన్నల కలువరేకులవలె తారకల్యములుతిరుగుచున్నలును, అందములగు చెవులు, దిద్దితీర్చినట్లు కనుబొమలు హసనము లీనుచు అవంద రేఖాలాలిత్యము అరుణకాంతులలో లీనమైపోవు ఆమెపెదవులు, ఆమెముఖమును చాలా చక్కనిదిగా చేసినవి, నాగబంధునికి అచ్చముగా తల్లిపోలిక, ఆమెగడుసుదనమే ఆమె అందమే, దూరమున నుండిచూచి ఒక సారిప్రహరుడు అమ్మా అనిఆమెను పలుకరించినాడట. చిన్నపిల్లయగుసిద్ధార్థినికి అన్నగారిపోలిక. కానిదేహదార్ఢ్యములేనిబాలిక, కోపమెక్కువ గడుసుదనములేదు. తెలివితేటలలో అందరిని మించినను అమాయకమగు మనస్సుతో సంచరించును.

శక్తిమతీదేవిభర్తను లోతెరుంగని ప్రేమతో ప్రేమించును, ఆయనకు తెలియనిబుద్ధి సూక్ష్మముల ననేకములు ఆయనకు సలహాలనిచ్చును, గూఢార్థము అగునట్లు పరిహాసము చేయగలదు, బౌద్ధదేవుని సదాఆరాధించును. భక్తిగలతల్లి ఇల్లాలు. ఆమెధర్మ చక్రమొక్కటి అమరావతీ స్తూపమునకుదానము చేసినది.

ప్రహరకుమారులవారు శిల్పవిద్యయందసమాన ప్రతిజ్ఞావంతుడే. సర్వమత సిద్ధాంతములు పూర్తిగనెరుగును. కానిగడుసుదనములేదు.

శక్తిమతీదేవి మరునాడుదయము కుమారుని సమీపించి దగ్గిర కూర్చుండమని ఇట్లు పలికెను.

శక్తి:— బాబూ ఈమధ్య బొమ్మలు ఏమీచేయుట లేదు. పాలరాళ్ళు రూపుమారుటలేదు. వొంట్లోఏమీ అస్వస్థతగాలేదుకదా.

ప్రహర:— ఈమధ్య బద్ధకముగా నుందిఅమ్మా! ఏపని చేయుటకు ఇష్టములేదు.

శక్తి:— కంటకశిల * పోరాదూ! మామయ్యతో మోటుపల్లిపోయి ఓడలను నానాదేశాల మనుష్యులను చూచెదవుగాని!

* ఇప్పుడు ఘంటసాల అందురు

"ఉపసైన్యాధ్యక్షులతో సమర కుమారుల వారి పుత్రుడు ప్రహారకుమారుడు వచ్చినాడని చెప్పుము"

భటుడు:- నేను వమ్మునటుల నిశ్చయించుకొనలేను.

తక్కిన భటులందరును నవ్విరి. లోన నేమి జరుగుచున్నదో చూచుటకు కుతూహలము పడుచున్న జనులందరు ప్రహార కుమారుని చుట్టుముట్టి లోనికి పోనీయండని కేకలిడిరి.

ఈగడబిడవిని యచ్చట తిరుగాడుచున్న దళవాయి యొక్కడక్కడకు వచ్చెను. అతడు ప్రహార కుమారుని గని గురుతు పట్టి లోనికి తీసికొని పోయెను. ప్రహార కుమారుడు కక్ష్యాంతరములు గడచి శాలకాగి తోను సాధ్యక్షులగు కాపుండకులవారు మాట్లాడుట చూచెను.

బాల:- మేమిద్దరము చాలాకాలము మాట్లాడుకొనుచు ఆతోటలో నుంటిమి. ఇంతలో విప్వ హుని నల్గురు మనుష్యులువచ్చి గుడ్డలు మా ముఖములకప్పి నోట గుడ్డలు కుక్కినారు. నాకు మతి తప్పి పోయినది. మరల మెలకువ వచ్చి చూచునప్పటికి నేనా ప్రదేశముననే పడియుంటిని. నానోట గుడ్డలున్నవి కానిచేతులు కట్టబడక యుండుటచే నోటనున్న గుడ్డలు దీసికొని కన్నులు విప్పి చూచునుకదా హిమబిందు కుమారికచుట్టు ప్రక్కల నెక్కడనులేదు. తూర్పు తెల తెల్లవారు చున్నది. భయముతో బెద్ద కేకలు పెట్టితిని. తోటపనివారురక్షకభటులు కొందరు దాములు పరిగెత్తికొని వచ్చినారు. వారితో హిమబిందు కుమారిక !ఏదనిఅడిగితిని. వారు నిశుమతి పోయినదా పడకగదిలోనె యుండును. ఏలనీవీ కేకలు పెట్టుచున్నావని అడిగిరి.

పరుగు పరుగున అభ్యంతర మందిరమునకు పోయితిని. ఆమెయచ్చట లేదు. నేనినపక్కవేసి వట్టి- పరుగెత్తుచునే రాత్రిజరిగిన సంగతు అందరికి చెప్పుచుంటిని. వారు లిటుకటు పరుగెత్తిరి. ఆమె యొక్కడనులేదు. ముక్తావళీదేవిగారును కన్పింపలేదు. వారితో చెప్పుటకు ఒగర్చుచు వారి శయనాగారమునకు పోవ అక్కడ తెరలు చిందరవందరగా నుండెను. రత్నకంబళిపై బురదతోనున్న అడుగులచిహ్నములు కాన్పించినవి. ఇరువురిని చోరులెత్తుకొని పోయినారని గగ్గోలు బయలుదేరినది.

కాపు:- భవనోద్యానవనములో నేవైపున ఇయ్యది జరిగినది.

బాల:- ఉత్తరమున కర్జూరపు పొదరిండ్లకడనున్న చంద్రశిలా వేదికప్రక్కనున్న లతామంటపములో కూర్చుండి యుంటిమి.

ప్రహారకుమారుడచ్చటకు పరువిడెను. అచ్చట చిందరవందరగా అడుగుల జాడలు కాన్పించినవి. ఆయ్యవి కోటగోడవరకునున్న భవనబహిష్కుడ్యముల వరకు నున్నవి. అచ్చటహిమబిందువస్త్రము కొంచెము చిరిగినముక్క కన్పించినది. అప్పటికక్కడ కొందఱు భటులు నోకమంత్రియునుండిరి. ప్రహారు డమితవేగమున సింహద్వారము వెంబడి భవనకుడ్యములచుట్టి యెచ్చటనుండి చోరులు గోడలదాటిరో అచ్చటకు వచ్చెను. అచ్చటకు జనములు పోగైయుండిరి. అతడు నెమ్మదిగా అడుగుల జాడదీయుచున్న ఒక వర్తకశ్రేష్ఠుని ఒక చమూపతిని సమీపించి వారిరువురు అనుకొన్న మాటల వినియెను.

చమూ:- ఈజాడలు కృష్ణబిడ్డువ వరకూ నున్నవట.

వర్త:- అంచెగుర్రములమీద హుటాహుటిగా పోయియుందురు.

చమూ:- మహా మాయా ధురంధరులగు వేగులవాండ్రు జాడల నరయుటకై సాగిపోయినారు. చారగుప్తుని ఆశ్వశాలలలో ప్రసిద్ధాశ్వముల నెక్కి దళవాయులు కొందరు వారిని వెంబడించినారు.



# దౌలతాబాదు దుర్గము



దౌలతాబాదు దుర్గము అతి ప్రాచీనమును చరిత్రప్రసిద్ధమునై యొప్పారుచున్నది.

ఈ పట్టణము దేవగిరి యాదవులకును, మహమ్మద్ బీన్ తుఘలక్ కును, రాజధానియై శోభావంతమై యుండెను. కాని అట్టి పట్టణము నేడు కాల వైపరీత్యమున శిథిలమై చూపరుల మనస్సుకు ఖేదపరచుచుండెను.

ఈ దుర్గమునందు ఒక పెద్ద మసీదు కలదు. ఇది పూర్వము యాదవులు నిర్మించిన సహస్రస్తంభ మంటపము. దీనిని మహమ్మదీయులు, మధ్యభాగము నందలి స్తంభములను పడగొట్టి, మసీదు గోపురమును కట్టిరి. ఇప్పటికిని స్తంభముల మీది విగ్రహములు కొంతవరకు కాన్పించుచున్నవి. ఏనుగుల స్నానము కొరకు కట్టబడిన పెద్ద తటాకము కలదు. దుర్గములోపలనే అల్లాఉద్దీన్ చే నిర్మింప బడిన "చారమినార" స్తంభము కలదు. ఇయ్యది ఆకృతిని కుతుబ్ మినారను బోలి పరిమాణము నందు చిన్నదిగనున్నది. దుర్గోపరిభాగమున ఒక పెద్ద రాజహర్మ్యము కలదు, దుర్గముపైన ఒక పెద్ద ఫిరంగి కలదు. అట్టి ఫిరంగుల మన పూర్వులు దుర్గోపరిభాగమునకు నెటుల తీసుకొని వెళ్లిరో దురూహ్యము. ఫిరంగి ఇప్పటికిని చెక్కుచెదరక యున్నది.

అనేక ఆకృతులతో యందు పెద్దపెద్ద ఫిరంగులు కలవు. ఆ ఫిరంగి యొద్దనుండి పరిసర ప్రాంతములను చూచిన దేహము పులకరించును.

ఈ దుర్గము చుట్టును కొన్ని మైళ్ళ దూరము వరకు కొండలు కాన్పింపవు. సమభూమియందు ఈ దుర్గము ఒక్కటియే ఏకాకియై యున్నటుల కాన్పించును.

ఈ దుర్గము చుట్టు నిట్టనిలువుగా కొండ 150 అడుగులు యెత్తువరకు కోయబడియున్నది. కొండచుట్టూ లోతైన కందకము కలదు. ఇటులుండుట వలన పూర్వకాలమున ఈ దుర్గము శత్రువులకు దుర్భేద్యమై యుండెను. కందకము లోపల విషజంతువులు కూడ యుండెనట! ఈ దుర్గము నుండి 12 మైళ్ళ దూరమున గల ఎల్లోరా గుహాలయముల వరకు సొరంగముండెనట! ఈ దుర్గమునకు నీరు 4 మైళ్ళ దూరమున రెండు కొండల మధ్య కట్టబడిన తటాకము నుండి వచ్చుచుండెను.

ఈ దుర్గము చుట్టును 5 ప్రాకారములు కలవు. ఈ ప్రాకారముల మధ్య అనేక శిథిలములైన మసీదులు గోరీలు రాజ హర్మ్యములును గలవు.

ఈ దుర్గమును దర్శించి యాత్రికులెల్లరు ప్రాచీన భారత వైభవ సమృద్ధి సాక్షాత్కరింప పులకిత గాత్రులై, హర్ష బాష్పములు రాల్చి ధన్యులమయితిమని ముగ్ధులగుచుందురు.

(ఆనంద)



# వియోగలహరి

(పెనుమర్తి వెంకటరత్నంగారు.)

ఎన్నినాళ్ళాయె నీవు గతించిపోయి
నాఁడు నాఁటికి నీస్మృతిగూడ లేక
మానసంబు లైహిక చింతలో మెలంగి
కుమిలి పోవుచున్నవి-కుపితమైన
కాలపురుషుని శాతనఖంబునందు
లీనమైపోయి, మాకుఁ గల్పించినావు.
ఈమహా దుఃఖభరము భరింపలేము!

ఇంతలో యెంతజరిగిన నేమిచేయఁ
గలము కన్నీరు కాలువల్ గట్టిఁపొంగి
పారలు నేగాని, యీదుఃఖభరకృశాను
నార్పివేయంగలేవ, యేమందుమయ్య
ఈమనోహరధాత్రి లగించు దివ్య
శాశ్వతసుఖానుభూతి యస్తంగమించె
నయ్యయో! నీదు జీవితమందు సౌఖ్య
సర్గకోటకు సమీపించి, చండవాత
పోతములలోనఁ జలియించిపోయినావా!

ఆకుంఠితరాగ భావములందు వహ్ని
యేమిచేయఁగలేదు!- దహించివేయు
నీజగంబుల వేల్మిడి నింతవరకు
దాని గెలిచిన యోధసత్తములు లేరు!
ఏయమాహ్యాపదంబుల నెచటనుండి
యట్టిపరుగిడివచ్చునో అంతులేని
అకుంఠిభాభావవహ్ని- దయాపరీత
లోకరక్షణనెడఁద వెల్లువలుపార

ఎంతటియమాయకాఁడవు మాహృదయమం
మండిపోయెను శోకధూమములతోడ [దు
నీస్వరూపముఁ భావ్యదీప్తులావి
మోహనంబయి వెలుఁగులు బాహిరిల్లు.

ఏమిలాభము? హృదయాన నింకరాని
శోకలహరితరంగముల్ ప్రాకులాడు
అవలిగట్టు నెఱుంగక అడలిపోవు
వానిబంధించు సాంత్వనగానమేది?
ఈ కురంగంబు కనపడెనా, కిరాత
శాతబాణప్రహార సంఘాతమునకు
ఇంతకటికపు గుండె ధరించినేను
భక్తులను కాతునంచు డంబంబులేలా?

మాయచేఁ గప్పఁబడి జగన్మండలమున
మత్సరము బెంచుకొందు రున్మత్తులగుచు
నీవిలోల శరీరంబునేఁ గుపిదప
మత్సరంబులు దానితో మాయమొందు.
ఏయనంత లోకంబుల నీవు, శాంతి
గీతములు పాడుచున్నావొ? గీయమాన
స్వఃపురీదేవకన్య కాస్వాదురాగ
వల్లకీరావమధురిమ పల్లవింప!
ఈజగత్తును వీడిన నీయమూల్య
జీవమూర్తికి శాంతి రచించుగాత!
హృదయవహ్ని స్రవించిన యీవిషాద
బాష్పధామములందు నాభావమూర్తి!

# ధనకటకము



(చిల్లరిగె శ్రీనివాసరావు పంతులుగారు)

## ౧

## ప్రభంజనరావు బహద్దర్ గారు



ఇప్పటికి చాలతరముల క్రిందటి కథ. హిమవత్పర్వత ప్రాంతమున నొక కోన గలదు. అది చాల మనోహరమైనది, సమస్తమైన పంటలకు నాలవాలము. దానికన్ని వైపులను కొండలు నిలువుగా నేర్పడి ఎక్కుటకు దిగుటకు దుస్సాధ్యములై యున్నవి. వాని శిఖరములు మేఘములను పొడుచుకొని పోవుచున్నవి. వానిమీద తెల్లగా పేరినమంచు ఎప్పుడును ఆవరించుకొని యుండును. ఆమంచు క్రిందకు దిగజారుచు పెద్దపెద్ద జాలములై పారుచుండును. వాని నుండి యేర్పడిన సెలయేరులు మృదంగ ధ్వనులు సేయుచు నలుప్రక్కలకును కుప్పించి దుముకుచుండును. ఇందులో నొకటి పడమటి దిశకు పడుచున్నది. అది ఒక ఎత్తైన గండశిలమీదపడి సన్నసన్న తుంపురులలోనికి చిందుచున్నది. సాయంకాలపు సూర్యుఁడా దిక్కు చూచినపుడు వింతవింత రంగుల నచ్చట రచించుచుండును. క్రింద పల్లములో చీకట్లు క్రమ్మినను సూర్యభగవానుడచ్చట కొంచెమెక్కువసేపు నిలిచి తన చాకచక్యమును జూపించి యరుగుచుండును. అందుచే నానదీపతనమును హిరణ్యవతి యని పేరుపెట్టి పిలుచుచుండిరి.

ఆదేమి చిత్రమోగాని యాపర్వత ఝరులెవ్వియు నాకోన లోనికి పారుటలేదు. అవి అన్నియు వెలుపలవైపుపడి కొండలను జుట్టివచ్చి పెద్ద మైదానములగుండ ప్రవహించి గొప్ప గొప్ప పట్టణములమీదుగా పోవుచున్నవి. కాని యాకోనలో నీళ్లకు కరవులేదు. మంచు కరగిన నీరు వలసినంత లోపలకు వచ్చుచునే యున్నది. బయట గాడ్పులు వడగొట్టుచున్నపుడు లోపలచల్లగా నుండును. బయట వానలు కొట్టుచున్నపుడు లోపల తెరపిగానుండును. ఆసమశీతోష్ణ స్థితికి సమస్త సస్యములు నాకోనలో చక్కగా పెరుగును; దానిమ్మలు దబ్బకాయలంత; పచ్చి కిసిమిసి రుచి చెప్పతరముగాదు, అనాసలు కొల్లలుగా దొరకును. జహాంగీరులు నాజూకు బదనులు విపరీతపు కాపు. పాడి పంటలకు పెట్టినది పేరు. అందుచేత దానిని ధనకటకమని యందఱును పిలుచుచుండిరి.

ఈచిన్న కటకిమునకు యజమానులు నల్గురన్నదమ్ములు. వారలపేరులు వరుసగా భైరవుడు, సాల్వుడు, శౌనకుడు, సిద్దప్ప, ఇందు పెద్దవారలుముగ్గురును భీకరాకారులు. ముఖములు ఆముదపుసిద్దెలవలె కళదప్పి యుండును. కండ్లు జ్యోతులవలెను మెరయు చుండును. వారెప్పుడు మాటలాడినను సగము కన్నుమూసి మఱొక్క వలుకు చుందురు. వారి మనసులలో కబురు ఎవ్వరికిని బయటకుతిన్నగా తెలియరాదు. వారలు మాత్రము అందరమనస్సులోనికిని దూఱి చూచుచున్నట్లుందురు. వారలకు పెండ్లి పేరంటములున్నట్లు లగుపడదు. వారిభోగము రాక్షసభోగమని అందఱును చెప్పుకొందురు.

వారు ధనకటకమును పండించుకొని అనుభవించుచున్నారు. వ్యవసాయమును జేయుటలో వారలితరులకంటెను మిన్నలు. తమ పంటకును ఫలమునకును పనికిరాని వానినెల్ల నాశనము చేయుటయే వారిపని. పండ్లను గొట్టివేయునని చిలుకలను బ్రతుకనిచ్చెడువారుకారు. పొలములమేసివేయునని వేళ్లను వేటాడి వేసెడివారు. కాకులు ఇంటిలోదూరి అన్నము ఎత్తుకొని పోవునని వానికి మందు పెట్టి చంపివేసెడివారు. తొండలును ఉడతలును ఎక్కడకనబడిన నక్కడే బడితెలతో బాది బలిమార్చెడివారు. నిమ్మచెట్లు మొదలైనవానిమీద సూర్యకాంతపు పక్షులు పాపము గూడుకట్టుకొని కిచకిచ సంతోషించుచుండ వాని గూళ్ళను పీకి అవతల పారవేసెడివారు. తెల్లవారుఝామున నిద్రచెడగొట్టునని కోవెలల గొట్టి తఱిమి వేసెడివారు. కూలీలచే దిట్టముగా పలిపి పని చేయించుకొనెడివారు. వారికి జీతములిచ్చు సమయమునకు ఏదోయొక వంకపెట్టి విరుగకోతలు కోయుచుండెడివారు. పనిలో నేదైన బదులుచెప్పిన వెంటనే తొలగించి కొత్తవారిని పెట్టుకొనెడివారు.

ఈవిధముగా వ్యవసాయము చేసిన భాగ్యమునకేమితక్కువ? భూమియామంచిది.. వసతులా చక్కగా నున్నవి. పనులా పోరి చేయించుచుండిరి. కొలది కాలములోనే ఐశ్వర్యవంతులైరి. ఎందుకుకారు? పండిన ధాన్యమును పాతరవేసి బాగుగా ధరయెక్కిన పిమ్మట అమ్ముకొనెడివారు. ధనము బాగుగా గడించిరి. సంపాదనవంతయు బంగారములోనికి మార్చిరి. వారియింటినిండా బంగారపు కణికెలు దొర్లుచుండెను. కానివారెవ్వడును ఒక్కరికొక్క దమ్మిడీనైన నిచ్చిన పాపమున పోలేదు. దయాదాక్షిణ్యములు వారియొద్దశూన్యము. అందుచేత వారితో వ్యవహార సంబంధమున్న వారందరును వారిని 'తేరికాగ్నులు' అని మారుపేరున బిల్చుచుండిరి.

నాల్గవవాడు సిద్ధప్ప ముగ్గురన్నలకును వీనికిని పోలికలేదు. చూపులలోగాని వర్తనలోగాని వీనికిని అన్నలకును పూర్తిగా భేదము. వారలెంతధూర్తులో వీడంతసాధువు. వీనికిపండ్రెండేండ్లు తిన్నగాలేవు. చామనచాయ, విశాలమైనకన్నులు, ముఖమునుండి కరుణారసము గారుచుండును. కాని వీనిని చూచిన అన్నలెవ్వరికిని సరిపడదు. వారలు దర్జాగా బయటకు షికారు వెళ్లినపుడు వీనికి వంటపొయిదగ్గర దీనముగా నుద్యోగమిచ్చి వెళ్ళెడువారు. తక్కినసమయములలో

యిల్లూడ్చుట తప్పాలాలు తోముట కంచములు కడుగుట పక్కలు వేయుట దీపములు వెల్గించుట మొదలైనపనులు— వీనికి అంతులేని చాకిరీయుండెడిది. దీనికి ప్రతిఫలము కంచములలో మిగిలిన ఎంగిలికూడు, అది చాలనిమెతుకులు పైన కావలసినన్ని గుద్దులు— యిది వానికి దినశిక్ష.

ఈవిధముగా చాలదినములుగడచినవి. ఒకనాడు వేసవికాలములో గాలివాన పట్టుకొన్నది. చుట్టుప్రక్కల ఊళ్ళలో యిండ్ల మీద కప్పులెగిరిపోయినవి. ధాన్యమంతయు తడిసి పోయినది. పశువులు కొట్టుకొని పోయినవి. గడ్డివాములు ఎగిరిపోయినవి. కరువుకు జనులు బాధపడుచున్నారు. ఒక్క ధవకటకములో మాత్రము నిర్మలముగా నున్నది. బయట వాన కురిసినపుడు ఇక్కడ వాన కురియదు. బయట ఎండకాసినపుడు ఇక్కడ చల్లగానుండును.

కార్తీకమాసము వచ్చినది. చలి గాలులు వీచుచున్నవి. ఒకనాడు అన్నలు ముగ్గురును బయటకుబయలుదేరిరి. ఇంటిలో జాగ్రత్తయని ఎప్పటివలెనే సిద్ధప్పకు చెప్పి పోయిరి. "ఎవ్వరినీ, అతిథినిగాని అభ్యాగతిని గాని లోనికి రానియ్యవద్దు. ఎవ్వరికీ ఏమీ చేతులో పెట్టవద్దు. వచ్చునప్పటికి నేతిలో పూరీలు వేయించి సిద్ధముగా ఉంచు" అని చెప్పివెళ్ళిరి. సిద్ధప్ప పొయ్యిదగ్గర కూర్చుండెను. బయట జోరున వర్షము, లోపలకూడ చెమ్మ జివజివ లాడుచున్నది. సిద్ధప్ప బాణలిలో నెయ్యి పోసి పూరీలు వేయించుచున్నాడు. కమ్మని వాసన గుప్పుమన్నది.

సిద్ధప్ప తనలోతానిట్లు వితర్కించెను. "మాఅన్నలెవ్వుడూ ఎవరిని యింత భోజనానికైనా పిలవరు! ఊరిలో అందరూ కరువునపడి ఏడుస్తుంటే మాకు మంచి పూరీలు నేతిలో వేలుతున్నాయి. ఇటువంటి సమయంలో ఎవరైనా వచ్చి మాయింట్లో ఇంత తింటే వానికెంత సంతోషం. మాకుకూడ ఎంత సంతోషం.,

ఈమాటలు వానిమనసులో పలుకుచుండగా వీధి తలుపెవ్వరో దబదబ కొట్టినట్లు వినబడెను. ఆదెబ్బలు ఘట్టిగానే ఉన్నవి గాని అంత తీక్ష్ణముగాలేవు. చేతులుకట్టియున్నవాడు కొట్టినట్లున్నది, మనుష్యులు కొట్టినట్లులేదు. ఒకవేళ గాలి విసిరిందేమో! గాలికాబోలు లేకపోతే మాతలుపింతగట్టిగా కొట్టేటంత ధైర్యమెవడు చేస్తాడు! అనిసిద్ధప్ప ఎత్తిన తలతిరిగి వంచి పొయ్యి మీదిపూరీలు గరిటెతో కదలించుచుండెను—

కాని ఆదెబ్బలు కొట్టినది గాలికాదు తిరిగి దబదబ బాదినట్లు వినబడినది. ఈసారి కొట్టుటవినగా కొట్టినవానికి తొందరెత్తినట్లే యున్నది. అంతేకాదు ఏతంటావచ్చినను ఆచుకొనుటకు సంసిద్ధముగానున్న ధ్వని చన కనబడినది. సిద్ధప్పకర్రలు కొంచెము బయటకు దిగలాగి కిటికీదగ్గరకుపోయి తలుపు తెరచి చూచెను.

వానలో ఎవరు నిలుచుని యున్నది? చిత్రమైన మనిషి. నాలుగడుగులే ఉన్నాడు. ఒకదిట్టమైనరజాయికోటు తొడిగియున్నాడు. దానితో పొడుగెంతయున్నాడో అడ్డమంత యున్నట్లున్నాడు. ముక్కు బుర్రముక్కు—

బుగ్గలు బూర్లెమూకుళ్లు లాగున్నవి. కళ్లు తళుకు తళుక్కుమనుచున్నవి. మీసములు మెలికెలు మెలికెలు తిరిగిపోవుచున్నవి. తలమీది వెండ్రుకలు తెల్లగానుండి జడలుగట్టి వీపుమీదికి జారిపడుచున్నవి. ఇక నెత్తిమీద పెద్ద తలపాగా ఒకటి దాని తోక వీపుమీదవడి పిక్కలవరకు వ్రేలాడుచున్నది. దానికుచ్చు పొడుగుగా పైకి నిక్కపొడుచుకొనియున్నది. అందులో నెమిలి ఈకెలు కూడ సొగసుకొరకు సవరింపబడి యున్నవి.

సిద్దప్ప ఎన్నడును అట్టి చిత్రమైన మనిషినిచూడలేదు. వానిని చూడగానే నిర్ఘాంతపోయి ఒక్కమాటైనను మాటలాడలేక నిలువబడెను. అంత నాముసలివామనమూర్తి కొంతసేపటికి కిటికీవైపుచూచి ఇట్లు సంబోధించి పలికెను.

వామనమూర్తి:— ఏవరోయి అబ్బాయి తలుపుకొడితే అట్లా దిగాలుపడి చూస్తావేం. తడిసిపోతున్నాను. కనపడుతూవుందా?

యథార్థమునకు ముసలివాడు తడిసి ముద్దైనాడు. వాని తలపాగా కుచ్చులోనున్న నెమిలి-ఈకెలు క్రిందకు వ్రాలి నీళ్ళు కార్చుచున్నది. మీసాలకొనలనుండి చూరుల మీది జలమువలె థారలుపడుచున్నవి. ఇక తలపాగా తోకసంగతి వేరుగా చెప్పనక్కరలేదు. దానివెంబడి ఒక సెలయేరు క్రిందకు దూకుచున్నది.

సిద్దప్ప:— బాబూ, క్షమించండి. నాకు చాలా విచారంగానే ఉందిగాని లోపలకు రానియ్యడానికి నాకధికారంలేదు.

వా. మూ:— అధికారంలేదూ!

సిద్ద:— లేదు లేదు. నిజంగాలేదు. మాఅన్నలు చంపేసేస్తారు. నీకామాట తెలపడానికి కూడా అధికారంలేదు. మీకేమైనా కావలిస్తే అక్కడనుండే చెప్పండి.

వా. మూ:— నాకేమైనా కావలిస్తే ఇక్కడనుండే చెప్పాలా? చాలామర్యాదగా వుందే! నాకిల్లుకావాలి. చలి కాచుకోవాలి. చస్తున్నాను. లోపల మంట భగభగమండుతూంది. తలుపుతియ్యి. చలికాచుకోవాలి. వణికిపోతున్నాను.

సిద్దప్ప కిటికీ తలుపుతీసి చాలాసేపు నిలువబడియున్నాడు. ఈపాటికి ఈదురుగాలి యేమాత్రమో అర్థమైనది. లోపల క్రిందకు లాగిన కొరువులు బాగా పెళపెళమనుచున్నవి. 'వృథాగా మండిపోతున్నాయి కాస్త చలికాచుకుంటే ఏంపోయింది' అనుకున్నాడు.

'పాపం ముసిలాడు తడిసి చచ్చేటట్టున్నాడు. ఒక్క పావుగంటసేపు లోపల కాచుకోనిచ్చి పంపేస్తాను" అని సిద్దప్ప ఆలోచించెను.

లోపలనుండి తిరిగివచ్చి సిద్దప్ప తలుపుతీసెను. వామనమూర్తి లోపల కుడిపాదముపెట్టెను. పెట్టగానే ఒక్కసారిగా రంయ్యని గాలివిసరెను. ఆదెబ్బకు దూలాలు గజగజ వణకిపోయినవి.

వా. మూ;— మంచి వాడవోయి అబ్బాయి మీఅన్నలతో నేను మాట్లాడుతానులే. నీకొచ్చినభయంలేదు.

సిద్దప్ప:— బాబూ, ఆపనిమాత్రం పెట్టుకోకండి, కొంపతీసి వారొచ్చేదాకా మీరువుంటే నాచావు దగ్గఱకొస్తుంది.

వా. మూ:— ఓసట్లాగా! నామూలాన నీకెందుకాయాసం. అయితే సరేగాని నేనెంత సేపుండొచ్చో చెప్పు మరి.

సిద్దప్ప:— అవిగో ఇక పదిపూరీలున్నాయి అవి అయేవరకు ఉండొచ్చు.

అంతట నా వృద్ధవామనుడు మెల్లగా వంట యింటిలోనికి ప్రవేశించెను. అక్కడొకపీటమీద చతికిలబడెను. నెమిలిఈకెల మీది నీళ్ళు దులిపి తిన్నగా మరల సర్దుకొనెనుగాని ఒంటిమీది బొంతగాని తలపాగగాని తీయలేదు. మనిషి ఊరికే నీళ్లు తెగకార్చుచుండెను. వంటయిల్లు అంతయు మడుగైపోవుచున్నది. చూచిచూచి సిద్దప్ప సహింపలేక, "మీబొంతను నేను తీతునా?" అని అడిగెను.

వా. మూ:— వద్దుబాబు. నీకెందుకాశ్రమ.

సిద్ద:— తలపాగా తీదునా పోనీ—

వా. మూ:— ఎందుకు బాబూ—నీకు శ్రమ నాకుకులాసాగానేఉంది (అని కొంచెము తీక్షణముగా బలికెను). సిద్దప్ప (సంకోచముతో) అబ్బే, శ్రమకాదు. పోయిలోకి నీళ్లొస్తున్నాయి. పొయ్యి ఆరిపోతే పూరీలు తయారుకావు' అనెను.

వా. మూ:— (నిర్లక్ష్యముగా) మీనయం. నేనుమతికాస్సేపు లోపలుండవచ్చు.

సిద్దప్పకు ఏమియు దోచలేదు. ముసలివాని వినయములో ధూర్తత్వమున్నది. వాడు కొంచెము సేపు మరల పూరీలవైపుకు చూచుచుండెను.

ముసలివాడు కిణముూరకున్నట్లుండి, అబ్బాయి, పూరీలు మహాబాగా ఘుమాయిస్తున్నాయి నాకోరెండియ్యవూ?, అనెను.

సిద్దప్ప:— అమ్మో, మాఅన్నలు చంపరూ!

వా. మూ— బాగా ఆకలి మండుకు పోతూంది. విన్న మున్నపస్తే. మీఅన్నలు లెక్కపెట్టుకో వస్తారాఏమిటి. రెండియ్యవూ, నాయనా, ఆకలికి చచ్చిపోతున్నాను.

వానిమాటకు సిద్దప్ప గుండె కరిగి పోయినది. 'నాకు నాలుగు పెడతానన్నారు. అవి నీకు పెడుతానుతిను. అటుపైన అడిగేవు సుమా?

వా. ము:— మా నాయన మంచివాడు.

సిద్దప్ప కొంచెము పంచదార తెచ్చి పూరీల మీదవేసి ముసలివానికిచ్చెను. ముసలివాడు కరకర నమలి తినుచున్నాడు. 'కొట్టితే కొట్టుతారు. ఏమిచేస్తాను' అని సిద్దప్ప మనసులో అనుకొనుచున్నాడు. అంతధడాలున తలుపుమీద దెబ్బ గట్టిగా పడినది. ముసలివాడు పీటమీదనుండి ఒక్క ఎగురు ఎగిరెను. ఇంటినిండా నీళ్ళు ఝల్లుమని చిందినవి. వేడినేతిమీదపడిచిటచిటలాడెను. సిద్దప్ప తలుపుదగ్గరకు పరుగెత్తెను, తలుపు తెరచెను.

'తలుపు తీయ్యవేం మొద్దులాగ, వానలో తడుస్తాం.' అని భైరవుడొక్క కేకపెట్టి గొడుగు పుచ్చుకొని మొగాన కొట్టెను.

'ఏంచేస్తూన్నావురా గాడిదా?' అని సాల్వుడు చేతిలోకర్రను మీదకు విసరెను.

'ఒళ్ళు పొగరేసి కొట్టుకుంటావురా' అని శౌనకుడు పొగడీసి ఒక్క దెబ్బ గూబ గుయ్యిమనునట్లుపుచ్చుకొనెను.

'ఇదేందోయి!, అని భైరవుడు ముసలి వానిచూచి గద్దరించెను.

'శాంతం, భూషణం అనిముసలివాడు చెప్పుచు తలపాగనుదీసి అతి వినయముగ వంగి, "నమస్తే నమస్తే నమస్తేనమః" అని ముగ్గురు అన్నలకును స్వస్తిచెప్పెను.

'ఎవడ్రావీడు' అని భైరవమూర్తి మూలనున్న పెద్దరోకలిబండనెత్తి సిద్దప్ప వైపు తిరిగి ముఖమునంతయు ముడతలు పెట్టిచూచెను.

సిద్దప్ప గాభరాపడి, 'నేనెరుగ నన్నయ్యా, నేనెరుగనన్నయ్యా, నన్ను చంప కన్నయ్యా, బాబో నేనెరుగను, అని చేతులు రెండును నెత్తిమీద పెట్టుకొని తలకాయ వంచుకొని పెద్దపెట్టున నరచెను.

'వీడు లోపలకెట్లావచ్చాడో నిజం చెప్పు. లేకపోతే చస్తావు యివాళ' అని భైరవుడు గర్జించెను.

"అన్నయ్యా, నిజంచెపుతా, రక్షించు ముసలాడు వానలో-" అని సిద్దప్ప చెప్పం బోవుచున్నాడు.

రోకలిబండ వానినెత్తిమీద పడం బోవుచున్నది. ఒక్కక్షణములో ముసలి వాడు పాగాలోని ఒక్క నెమలిఈకను లాగి దానికడ్డముపెట్టెను. అదేమి వింతయోగాని ఆరోకలిబండ దానికి తగులగానే వెనుకకు ఎగిరిపడి గాలిలో గడ్డిపరకలాగ పోయి ఒక మూలపడినది.

భైరవుడు:— 'ఎవరయ్యా నువ్వు' అని వామనమూర్తి వంక తిరిగి ప్రశ్నించెను.

సాళ్వుడు:— (వెంటనే) నీ కేంపని అయ్యా యిక్కడ?

శౌనకుడు:— మాయింట్లో సొమ్మంతా దోచుకోడానికివచ్చావా యేంచెప్పు.

ముసలివాడు చాల వినయవిధేయతల నభినయించుచు! 'నాయనా' నేనుముసలివాణ్ణి పేదవాణ్ణి' ఎవరూ దిక్కులేరు. చలికివానకు చచ్చిపోతున్నా. ఇంట్లో మంటవెలుతురు కనబడ్డది. కాస్త వెచ్చ వెచ్చగా కాచుకో వచ్చనిఅనుకున్నా. బుల్లిబాబునడిగి తలుపు తీశాడు. ఒక్కపావుఘడియ కూర్చుని వెళ్లి పోదామనుకున్నా బాబు. బాబుదేమీదోషం లేదు.' అనెను.

భైరవుడు:— దొడ్డవాడవేగాని ఇక బయటకు నడు.

సాళ్వుడు:— చాలుచాల్లే ఇల్లంతా తడిపేశావు. ఇకపద బయటకు.

ము. వాడు:— బాబూ, ముసలివాణ్ణి- బయటచలి యిదిగో చూడుబాబు తలంతా నెరిసిపోయింది,

శౌనకుడు:— నెరిస్తే నెరిసిందిగాని వెచ్చగా వుండడానికి వెంట్రుకలు పూరా ఉన్నాయిలే. పద— పోతావా, ఒక్కతోపు తోయ్యాలా?

ము. వా:— అక్కరలేదు పోతాను గాని, ఆకలి బాగా వేస్తుంది నాయనా, ఇదుగో నాలుగు పూరీముక్కలు పెట్టి పంపించండి. లెక్క నాలుగు (అని వేళ్ళు చూపించెను)

భైరవుడు:— పూరీలు కావు గీరీలు. నీకోసమే ఇక్కడ తయారుచేశాము. రమ్మన్నారు పాపం. కందగడ్డలాగ మొఖం నువ్వూను.

సాల్వుడు:— ఆనెమలీక అమ్మకో, ఏమైనా రెండుదమ్మిడీలు వస్తాయేమో అవి పెట్టి కొనుక్కో. కావలసినన్ని పూరీలొస్తాయి నీ మొఖానికి.

ము. వా:— రెండెట్టనయ్యా బాబు, నాలుగు లేకపోతేను.

భైర:— ఛీ, ఛీ అవతలికి పొమ్మంటే.

ము. వా:— అయ్యలారా, అనుగ్రహించండి.

శౌన:— ‹అనుగ్రహమా, అట్టా బయటకు పోయిచావమంటే' అని మెడమీద చేయివేసి గెంటబోయెను. కాని మెడమీద చెయివేసిన తోడనే వాడును రోకలిబండవలెనే ఎగిరి వెళ్ళి ఇంకొకమూలపడెను. అంత భైరవు డుగ్రుడై చెయి చేసుకొనెను. వాడి పనియునంతే అయినది. తరువాత సాల్వుడును మీదకు వెళ్ళెను. వాడును ముసలివానిని ముట్టుకొనగానే నాలుగవ మూలకు ఎగిరిపడి తల గోడనువేసి కొట్టుకున్నాడు. రోకలిబండతో సహా నలుగురును నాలుగు మూలలలోను నిర్విణ్ణులైపడిరి. అప్పుడు వృద్ధవామనమూర్తి ఒకసారి అందరవైపు నకు గిరుక్కున చక్కరకొట్టి బహు నిర్మల శాంతముతో నిట్లుపన్యసించెను.

‹అర్యులారా! మీకందరకును నావినయపూర్వక నమస్కారములు. అతిథి దేవోభవ అని వేదములు ఘోషించుచున్నవి. నేను మీకతిథిని. అంతకంటె అభ్యాగతిని. మీరు నాకు సత్కారముచేయుటకు సందేహించిరి. అయినప్పటికిని నేనా యవమానమును మనస్సులో పెట్టుకొనదలచలేదు. ఈరోజు నిసిరాత్రి నేను తిరిగి వచ్చెదను. అదియే నాకునుమీకును దర్శనము మీరు సత్కారముచేసినాసరే చేయకపోయినాసరే. అంతటితో మీకును నాకు సరి'

భైరవుడు మూలనుండి లేచిముందుకు వచ్చి నగముచచ్చిన కంఠముతో ‹ఇంకొకసారి వస్తేనా, అని యేమో చెప్పబోవుచుండెను. కాని వాక్యము పూర్తికాకముందే ముసలివాడు బయటకు వెళ్ళి ‹ధాం, అనితలుపుదగ్గరకులాగెను. వానివెంట మేఘములు గిరగిర తిరుగుచు వర్షము కురిపించుచు పరుగెత్తెను.

భైరవుడు సిద్ధప్పకేసి చూచి, ‹బాగా ఇంద్రజాలం చేయించావురా సిద్ధా! నీలెక్క కుదురుస్తా. పూరీలు లెక్కప్రకారం ఒప్పగించు. నీదొంగవేషాలు నాదగ్గరపనికిరావు. పూరీలు ముక్కలు క్రిందపడివున్నాయి అదేమిటి? పంచదార వాలికిందేమిటి—

సిద్ధప్ప (భయముతో వడకుచు) మీరు నాకు నాల్గిస్తానన్నారుగా ఎట్లాఉంటాదో అని తిని చూచా.

భైరవుడు;— ఓహో ముందే నువ్వా! ఈసారెప్పుడైనా తింటుగాని నడు బయటకు నడు.

సిద్దప్ప యేడ్చుచు బయటకు వెళ్ళెను. ముగ్గురన్నలు పూరీలు తినగలిగినన్ని తినిరి. తరువాత మాంసములు తీసివెల్చుకొని

మెక్కిరి. పిమ్మట సారాయి దిట్టంగాపట్టించిరి. మిగిలినవానిని దాచుకొనిరి. సిద్దప్ప కొక్క ముక్కైనను పెట్టలేదు. తరువాత ఒడలుమరచి పక్కల మీదపడి దొరలుట కారంభించిరి.

రాత్రి గాఢాంధకారము. మేఘములు ఆకాశమును కమ్ముకొనినవి. గాలులు బొబ్బలుపెట్టుట కారంభించినవి. వానకు విరామములేదు. జోరున కురియుచుండెను. అన్నలు తప్పతాగిరి గాని వంటకొనకముందు తలుపులన్నియు బిడాయించుకొనిరి. అంత మాత్రము తెలివితో ప్రవర్తించిరి. కాని లాభము లేకపోయినది. రాత్రి రెండు ఝాములైనది. దఢేలుమని చప్పుడైనది. ఆచప్పుడుకు వారలు మేల్కొనిరి. వీధితలుపు బద్దలైనది. గాలి లోపలకు రివ్వునకొట్టినది. ఆజోరుకు ఇల్లంతయు గజగజలాడిపోయినది.

భైరవుడు, 'ఏమిటది?' అని ఉలికిపడి లేచి కేక వేసెను.

'ఎవరూలేరు నేనే,' అని వామనమూర్తి బదులుచెప్పెను.

ముగ్గురన్నలు చీకటిలోనికి చూచిరి. గదిఅంతయు నీళ్ళమయమై పోయినది. ఆ నీళ్ళమీద పెద్దఫేనగోళము గిరగిర తిరుగుచుండెను. దానిమీద విలాసముగా పడుకొనినగలు కనబడిన వామనమూర్తి యుండెను. వానితలగుడ్డ కుచ్చిపుడు అంతవాన కురియుచున్నను నిక్కపొడుచుకొనియే యుండెను. అందలి నెమలిఈకెలు నడికుప్ప దాటి పోవుచుండెను. ఇంటికప్పు అంతకు ముందే ఎగిరిపోయియుండెను.

అతిథి వికట మందహాసముతో 'అయ్యో! పాపం! నేరావడంవల్ల గేస్తులకిబ్బంది అయింది కాబోలు. మీ పక్కలన్నీ తడిసిపోయా యనుకుంటాను. మీరు పాపం మీ తమ్ముడున్న గదిలోకి వెళితే బాగుంటుంది. అక్కడకప్పు నట్లాగేవుంచాను." అనెను.

ఆచివాట్లుచాలు- మెత్తమెత్తగనున్నవి. వారలకర్థమైనవి. నాకలిపోవుచు వారు తమ్ముని గదిలోనికి పరుగెత్తుకొనిపోయిరి

ము. వా- నాపేరును విలాసమును ఇక్కడ వ్రాసిపెట్టుతున్నాను. మీకుపొద్దన్నెవచ్చి చూచుకోండి. నా దర్శనము ఇక మీకు దొరకదు. అని వెనుకనుండి కేక వేసి చెప్పెను.

చిట్టచివఱకు తెల్లవారినది. ముగ్గురన్నలును సిద్దప్పగదిలోకిటికి గుండాచూచిరి ధనకటకమంతయు దగ్ధమైనది. గాలివాన చెట్లను పెల్లగించివేసినది. పాటలుపాడైనవి. అంతయు నక్కతోకరీతుగా మట్టికొట్టుకొని పోయినది. ముగ్గురన్నలు గడగడ వణకుకొనుచు వంట యింటిలోనికి పోయిచూచుకున్నారు. ఇంటిలో తినుబండారము లొక్కటి లేవు. అక్కడ పొయిదగ్గర నొకఅకున్నది. భూర్జపత్రము మీద షోకుగా 'ప్రభంజనరావు బహద్దర్' అని వ్రాసియున్నది.



# వైరాగ్యము.



(వ. రాజంరెడ్డిగారు.)



అది శాకద్వీపము. రాజుపేరు జీవనగుప్త. అతడు మహదైశ్వర్య సంపన్నుడు. సామంతరాజులెల్ల రాతని యాజ్ఞాధీనులైయుండిరి. పరదేశముల రాజులీ ద్వీపముకేసి కన్నెత్తి చూచుటకైన వెరచుచుండిరి.

అతడు ప్రతి వత్సరమును వసంతోత్సవము జరుపుచుండెను. అదివసంతకాలము. పట్టణమంతయు నలంకరింపబడెను. చతురంగబలములతోడ మహారాజు ప్రమోదోద్యానవనమునకు బయలుదేరి సింహద్వారముకడకు వచ్చునప్పటికి యొక సన్యాసి యెదురైయభివాదనంబొనర్చి నిలుచుండెను. మేళతాళములు మొదలగునవన్నియు నిమేషకాలము కట్టుబడెను. గుఱ్ఱమును దిగి రాజు సన్యాసికి వందనంబాచరించి నిలుచుండెను. ఉన్నతశరీరము— ఆజానులంబిత బాహుద్వయము— విశాలఫాలము— దివ్యతేజమును వెలిగక్కు నేత్రములు— మొదలగు వానితోడ విలసిల్లు నా సన్యాసినిగాంచి రాజనివ్వెంపడి నిలుచుండెను. కొంతవడికి తెప్పరిల్లి యిట్లనియె. మహాశయా తామెవ్వరు?

సన్యాసి= మహారాజా? నేను సన్యాసిని.

రాజు= క్షమింపుడు. సన్యాసియన నేమి?

సన్యాసి— జగత్తంతయుమిథ్యయని దెలిసికొని నిర్వికారుడై యుండువాడు సన్యాసి. అతడు పరమసత్యమును ఉపలబ్ధినొందును. పరమసత్యముమాత్రమే నిజము. దానినే బ్రహ్మమందురు. బ్రహ్మసత్యము. మిగిలినదంతయు మాయ- ఇంద్రజాలము.

రాజు- (విస్మయచిత్తమున) జగత్తంతయు మాయయేనా? మిథ్యయా! ఈసంసారము- చరాచర జంతుజాలము— సూర్యచంద్ర నక్షత్రములు- పర్వతములు— నగాలు మొదలగునవి యన్నియు మిథ్యలేనా?

సన్యాసి- నీవు చూచుచున్నదంతయు మిథ్య: మాయాకల్పనము; ఇంద్రజాలము. సంపూర్ణవైరాగ్యము గలిగినగాని యదార్థజ్ఞానము

గలుగదు. అప్పుడు జగత్తంతయు మిథ్య యని బోధగట్టును.

అతిచెప్పుచిట్టి సిద్ధాంతముల విని యెరుగడు. అందువలన సన్న్యాసి మాటలకు తలక్రిందులగుచు ముహూర్తకాలము మౌనముగ నుండియిట్లనియె. మహాత్మా! క్షమింపుము. కాలాతీతమగుచున్నది. ప్రమోదోద్యాన వనమునకేగి వసంతోత్సవమున బాల్గొన వలయును. ఇది మావంశము బుట్టినప్పటి నుండియు జరుగుచున్నది. కావున దీనినితటి కోడ నాకుజాలను. ఆపగలశక్తియు నాకు లేదు. నేను తిరిగి పురమును బ్రవేశించుట కొక మాసము దినములు బట్టును. అంత వరకు మీరిచ్చటనే యుండుడు. మీకు గావలసిన వస్తుసామగ్రిని సమకూర్చి యిచ్చుటకు సేవకుల నియోగింతును.

సన్న్యాసి- నేను సన్న్యాసిని. నాకు పదార్థము లెందుకు? సేవకులేల? ఏమియు నక్కరలేదు. మీరు వచ్చువరకిచ్చటనే యుందును. (అని నుడువుచు నిర్గమించెను.)

మంగళవాద్యములు మిన్నుముట్టెను. నిరుత్సాహముగ చూచుచున్న సైన్యవాహినుల యుత్సాహము ప్రజ్వరిల్లెను. రాజు ప్రమోదోద్యాన వనమునకేగి వసంతోత్సవమందు బాల్గొని తిరిగి పురమును బ్రవేశించి మంత్రినిచూచి యిట్లనియె. ఆసన్న్యాసి యెక్కడ? నాకడకు దీసికొనిరమ్ము.

మంత్రి సన్న్యాసిని దీసికొని వచ్చెను. శవాకారమువనున్న ఆసన్న్యాసిని చూచి యాశ్చర్యమొందు నిట్లనియె. 'మహాత్మా తమ యందిట్టిమార్పు గలుగుటకు కారణ మేమి?

సన్న్యాసి:- (చిక్కియున్న మోమున చిరునగ వంకురింప) ఈ నెల దినములనుండి నాకు తిండిలేదు.

ఈమాట వినగనే రాజుశరీరము కంపించెను. నేత్రముల నగ్నికణములు గురియజొచ్చెను. మంత్రీ? ఏమిది? నాగృహమున- నా రాజ్యమున నా కతిథియగువానికి నెలదినములుగ తిండిలేదా? శవసిద్ధముగ నున్నయీతని చూడుము. ఇంతఘోరమా!

మంత్రి చేతులు జోడించుకొని ప్రశాంత చిత్తమున నిట్లనియె= దాసునితప్పును మన్నింపుడు. మీరు వసంతోత్సవమున కేగునప్పుడీ సన్న్యాసి నాకేమియు నక్కరలేదని చెప్పియుండెను. అందువలన నేనట్టి యేర్పాటు చేయలేదు. తమ రాజ్యమందు దేనికి కొరత? ఏది లేదు?

రాజు- మహాశయా? తమకు గావలసిన పదార్థములెవ్వి?

స- కురుక్షేత్రమందు రోజుకు పదిశేర్ల పాలు ద్రావుచుంటిని.

రాజు-మంత్రీ? మనగోశాలయందలిగోవులలో పదిగోవుల పాలువీరికిబంపుచుండుము.

మంత్రి- చిత్తమహారాజా?

౮

మంత్రిసామంత పురోహిత సేనానుల తోడ రాజసభ నిండియుండెను. దీర్ఘకరములు పైకెత్తి సన్న్యాసి సభాసదుల నాశీర్వదించుచు సింహాసనము కుడిప్రక్కన నుండు పీఠము నలంకరించెను. అంతవరకును రాజు గూడ లేచి నిలచి తదనంతరము సింహాసనముమీద గూర్చుండెను.

రాజు- మంత్రీ? మనదేశమందలి ప్రజలు కుశలముగనున్నారా? సుఖులేగద!

మంత్రిలేచి ప్రత్యుత్తర మీయబోవు చుండ సన్యాసి యిట్లనియె:— నీ దేశమందు సుఖమా? కుశలమా? ఇంద్రజాలతుల్యమగు మహామాయాజాలమందగు లోకాని ప్రజలు నశింపుచున్నారు. ఇదియంతయు మిథ్య యని దెలసి దీనిని వీడినగాని నీ ప్రజకుగాని, నీకుగాని సుఖము గలుగదు. కుశలముండదు. శాంతిము లభింపదు.

సభాసదు లెల్లరు విస్మయచిత్తమున సన్యాసివాక్యములాలింపుచుండిరి. భగవానుడే యీ రూపమున వచ్చెనని దలంపజొచ్చిరి.

మంత్రి- (చేతులుజోడించుకుని) మహాశయా? నేను దార్శనికుడగాను. ఆ తర్క-వితర్కములు నాకు దెలియవు. కాని చూచిన దానిని కల్లయని నుడువుటకు మాత్ర మంగీకరింపను. నాకెనుబది వత్సరములు నిండినవి. ప్రజల సుఖ దుఃఖములతోడ నాకు పూర్తి పరిచయముగలదు. మరియొక విధముగ దలంపకుము. మహారాజా! తమ పాలన క్రింద ప్రజలు సుఖులైయున్నారు. పంటలు బాగుగా బండుచున్నవి. నెలకు మూడువర్షములు కురియుచున్నవి. వర్తకము చక్కగ నున్నది. తమ నామాంకితముగల నౌకలు దేశవిదేశముల కేగుచున్నవి. చతుష్షష్ఠి కళలు పరిపూర్ణావస్థయందున్నవి. దేశమునందు నిరంతర మానంద తరంగములు బుట్టుచున్న వనుటకు వసంతోత్సవమే సాక్ష్యము.

సన్యాసి- (వ్యాకుల కంఠమున) ఈమాటల యందేమయిన సత్యము గలదా? ఇంద్రజాలమందు సుఖముండునా? ఎండమావులయందుదకముండునా? సమస్తజీవులు మాయయను రుబ్బురోటబడి నలిగి మరణింపుచున్నవి.

మంత్రి- 'జాతస్య మరణం ధ్రువం' అను సనాతన వాక్యానుసారము పుట్టుకతోడనే చావున్నది. కావున మరణించిననేమి? మరణమనిన భయమెందుకు? మృత్యువుతరువాతనున్నది యనంతజీవితము గాదా? కాదందురా? అనంత శూన్యము. అయిననేమి? 80 వత్సరముల జీవితమును తుచ్ఛముగ నేల దలచవలయును? అట్లు దలచుట న్యాయమా? నేనెప్పుడును నాజీవితమును తుచ్ఛమని యెంచను?

సన్యాసి- రాజా? అజ్ఞానుల ప్రసంగమువలన లాభమేమి? బ్రహ్మసత్యం జగత్తుమిథ్య యను మహత్తరధర్మమును మీ రాజ్యమందు వ్యాపింపజేయుము. మానవులను అమృత పథమున నడిపించెదను. నాకవకాశమునుగల్పింపుము.

రాజు- మంత్రీ? వీరు మనరాజ్యమునందు సత్యమును ప్రచారము నొనర్చెదరు. వెంటనే తగిన యవకాశములగల్పించుము. పదిలక్షలరూప్యములు వ్యయపరచి మఠమును గట్టించుము. పదిలక్షలలీయనకు దక్షిణగనొసంగుము.

౯

వర్షాకాలముముగిసెను. శరత్కాలము ప్రారంభమాయెను. తరులతగుల్మములు ఫలపుష్పశోభితములై యలరారుచుండెను. మహత్తరమందిరమునొకదానిని గట్టించి

సన్యాసికిచ్చిరి. ఆ మందిరమందు ప్రవేసించుటకు సన్యాసిపురవీధుల బయలుదేరెను. ఆ యపూర్వ విగ్రహమునుగాంచి పురజనులాశ్చర్యపడజొచ్చిరి. ఎల్లరును వర్తకవ్యాపారములు- పనిపాటలనీడి నాతనివలె మనమును దిరుగుదమని తలంపజొచ్చిరి. "మహారాజుగారికి స్వప్నమున శివుడుప్రత్యక్షమై మన పట్టణమం దవతరించెదనని చెప్పెనట. ఈతడే మహాదేవుడని" యనుకొనసాగిరి. సన్యాసిమఠమును జేరునప్పటికి లక్షలకొలది జనులు చుట్టుమూగిరి. సన్యాసియుపన్యసించి లక్షమందికి సన్యాసమిచ్చెను. వారికి తలలు గొరిగించి, కాషాయకమండలము లొసంగెను. మఠము మీద కాషాయ పతాక మెగురజొచ్చెను.

ఈ లక్షలమంది సన్యాసులు దేశము మీదబడి బ్రహ్మసత్యము జగత్తుమిథ్య అని బోధింపజొచ్చిరి. సుశాంతిమున కాలయాపనంబొనర్చు నా పల్లెలయందు- ఫలపుష్పశోభితమగు నా యుద్యానవనములయందు- గృహస్థుల గృహములయందు 'బ్రహ్మసత్యము జగత్తు మిథ్య' యను నినాదము నిరంతరము ప్రతిధ్వనింపజొచ్చెను.

• • •   • • •   • • •

వర్తకము పూజ్యమాయెను. వ్యవసాయము కట్టుబడెను. గృహములు ఖాళీయయ్యెను. బ్రహ్మసత్యము జగత్తుమిథ్య. వర్తకవ్యవసాయములొనర్చు వారెవ్వరు ! గృహము లెందుకు ? దేశమంత సన్యాసులమయ మయ్యెను. బ్రహ్మసత్యము జగత్తుమిథ్య యను నాదముతప్ప మరియొకమాట వినబడకుండెను.

మంత్రి రాజుకడ కేగి యిట్లనియె. ప్రభో ? దేశము ధ్వంసమైనది. మహాదుర్భిక్షము ప్రారంభించినది.

రాజు:- మన దేశమున దుర్భిక్షమా ? పండ్రెండువత్సరములు వర్షములుగురియకున్నను సమృద్ధిగ ధన ధాన్యములు నిల్వయుండు మన దేశమున దుర్భిక్షమా ?

మంత్రి:- మహాప్రభో ! నే చెప్పునదినిజము. తమకు వేరుగనివేదింతునా ? మన దేశమున సంతసము నశించినది. మృత్యుభయమున దగుల్కొని ప్రజలు పరితపింపుచున్నారు. ఉత్సాహము పూజ్యము. తాళినను నాగలిని బట్టువారు లేరు. లక్షలకొలది మానవులు సన్యాసులమని తల గొరిగించుకొని కాషాయవస్త్రముల ధరించి 'బ్రహ్మసత్యము జగత్తుమిథ్య' యని దిరుగుచున్నారు. సమస్త కళలు నాశనమైనవి. మహారాజా ?

రాజు:- నేను స్వయముగ జూచినగాని నమ్మను.

మారువేషముల మంత్రియు రాజును బయలుదేరిరి. పురమందలి పెద్ద వర్తకస్థానములు కళావిహీనములై యుండెను. సంతోషరహితులై స్త్రీపురుషులు నడచుచుండిరి. వ్యవసాయదారులయం దాతురత లేదు. విచారమున గృహములయందుండిరి. సంగీతశాలలు లేవు. వర్తకశాలలు పాడుబడెను. చిత్రకళామందిరములు భస్మమాయెను. పట్టణము శవాకారమున నుండెను. మృత్యుగహ్వరమున బడజొచ్చెను. పల్లెల కేగిరి. పాడుబడియుండెను. సంతోషమును నదిమ్ము

గ్యము, దుఃఖము, మృత్యుభయము, తాండవం బాడజొచ్చెను. జను లచ్చటచ్చట గూర్చుండి "మాయసంసారము రా? మహాబంధనము రా? తప్పించుకొను టెట్లు" అని యనుకొనుచు తహతహలాడుచుండిరి. ఎచ్చట చూచినను సన్యాసులే. మూడింట యొకడు సన్యాసి. ముగ్గురుస్త్రీలలో నిద్దరు సన్యాసినిలు. ఈ విషయమంతయు రాజుచూచి మంత్రితో డనిట్లనియె. "మంత్రీ! ప్రజలిట్లు సోమరిపోతులై భయవిహ్వాలముల కాలము గడుపుటకు కారణమేమి?

మంత్రి:– ఆ సన్యాసియే కారణము. ఆ మతమే దీనికిబునాది. మానవులు తన యస్తిత్వమునే యంగీకరింపక భ్రమయనుకొనుచున్నారు. నిరర్థకు లగుచున్నారు. వారికి ప్రకృతి యానందవిహీనముగ గన్పట్టుచున్నది. ఇదివరకు జీవితముమీద ప్రేమయుండెను. ఇప్పుడు జీవితమును మృత్యువుగ భావింపుచున్నారు. ఇహజీవితమును నరకముగ దలంపుచున్నారు. స్వర్గభోగమును పొందుటకు బరితపించుచున్నారు.

మంత్రిమాటలు వినునప్పుడు రాజు కన్నుల నీరుగ్రమ్మెను. దుర్భిక్షము ప్రారంభమాయెను.

## ౯

శాకద్వీపముయొక్క స్థితి గతులు చారులవలన జంబూద్వీపాధిపతియగు హూణేశ్వరుడు విని శాకద్వీపమును జయించుటకు బయలుదేరెను. వీరి పూర్వపురుషులు వరుసగ నూరుమంది శాకద్వీపముపై దండెత్తి తీవ్రపరాభవమునకులోనై చావుదప్పి కన్నులొట్టబోయి స్వదేశమును జేరిరి. కొందరు నామరూపములు లేక శాకద్వీప వాసులచే హతులైరి. కాని నేటికి హూణేశ్వరునకు సమయముచిక్కెను. శాకద్వీపమును సునాయాసముగ జయింపగలననిదలచి 20 వేల మంది పదాతులు 10 వేలమంది అశ్వారోహులు 5 వేల యేనుంగులతోడ యుద్ధమునకు బయలుదేరెను.

హూణేశ్వరుడు శాకద్వీపమునుసమీపింపుచున్నాడను వార్త గూఢచారులవలన జీవనగుప్త మహారాజెరింగి మంత్రిని బిలచి యుద్ధప్రయత్నములు చేయుమని యాజ్ఞాపించెను. దేశమందలి పట్టణములు పల్లెలయందుగూడ శాకద్వీపమునకు చిరశత్రువగు "హూణేశ్వరుడు వచ్చుచున్నాడు. అతనిని సమరరంగమున వధించుట కెల్లరుసంసిద్ధులై యుండవలయు"నని చాటించిరి. కాని సైన్యమున చేరువారెవ్వరు? స్వరక్షణకుగాని, దేశరక్షణకుగాని, యత్నించువాడేడీ?

అందువలన సేనానులు దేశమున బయలుదేరిరి. "మన స్వాతంత్ర్యమును మన దేశస్వాతంత్ర్యమును హరించుటకు హూణేశ్వరుడు వచ్చుచున్నాడు. కావున ప్రతిపురుషుడును కత్తిదిబట్టి దేశ స్వాతంత్ర్యమును గాపాడవలయును. స్త్రీ లెల్లరు సైన్యములకు గావలసిన పదార్థముల సమకూర్పవలయును. లేనియెడల దాసులమైపోదుము. చిరదాసు లగుదుము. దాసజీవితము దుర్భరము. రండు. సైన్యమున జేరుడు." అని దేశమందెల్ల నుడుపుచుతిరిగిరి. కాని యీతనిమాట లాలించువా రెవ్వరు? అరణ్యరోదనమాయెను. సేనానులు తిరిగి పురమున ప్రవేశించిరి.

"సైన్యములు లేవు. సైన్యముల యందు చేరుటకొరకైన రాలేదు." అను మాటలువిని రాజు స్వయముగ సైన్యముల సమకూర్చుటకు బయలుదేరెను. ప్రతి యొక్క పల్లెకేగి "వీరపాంసులారా! దేశరక్షణమునకు నడుములు గట్టుడు. జంబూద్వీప సైన్యవాహినులు వచ్చినవి. హూనేశ్వరుని వధింపుడు. శకజాతియెప్పుడను దాస్యము నెఱుంగదు. మన పూర్వులు దోర్దండ ప్రతాపమున జంబూద్వీపరాజుల ననేకమారు లోడించిరి. అనేకమంది రాజుల రణరంగమున వధించిరి. ఆవిషయమును మరువకుడు. నడుములగట్టుడు. కత్తులు కటారులచేబూనుడు. రండు. సైన్యమున జేరుటకు. దాస్యజీవితము దుస్సహము." అని చెప్పుచుండెను. ప్రజలు శ్రద్ధగ వినుచుండిరి. కాని నడుముగట్టువాడెవ్వడు? ఈచెవుల వినినమాట లాచెవుల బోవుచుండెను. బ్రహ్మ సత్యము- జగత్తు మిథ్యయని జపము జేయుచుండిరి. అందు వలన రాజు తిరిగి తిరిగి వేసారి రాజధానికి వచ్చెను.

హూనేశ్వరుని సైన్యము దేశములో బ్రవేశించెను. ముఖ్యపట్టణమును సమీపించినకొలదిని సింహనాదములు మిన్నుముట్టుచుండెను. శాకద్వీపవాసులు ఈవిషయమును తటస్థముగ చూచుచు బ్రహ్మ సత్యము, జగత్తు మిథ్యయని జపము చేయుచుండిరి. రుద్రాక్షమాలలు దిరుగుచుండెను. అణుమాత్రమైన యాటంకము లేక హూనేశ్వరుని సైన్యము నగరమున బ్రవేశింపజొచ్చెను. రాజు నెత్తిన చేతులు బెట్టుకొని మంత్రిని చూచి యిట్లనియె." మంత్రీ కర్తవ్యమేమి! దేశరక్షణకొరకైన నడుముగట్టినవాడు లేడు. ధనమున్నది. అస్త్ర శస్త్రములున్నవి. కాని ప్రయోజనంబేమి"

అనునప్పుడాతని నేత్రములనుండి నీరు గారజొచ్చెను. సాయంతనము నాలుగుగంటల వేళ హూనేశ్వరుడు శాకద్వీప రాజధానీనగరమును బ్రవేశించెను. పురమంతయు స్వాధీనమాయెను. రాజమందిరమునకు వచ్చునప్పటికి చీకటిపడెను. జీవనగుప్త యేనుగురు భార్యలతోడ దొడ్డిదారిని పారిపోయెను.

౫.

జీవనగుప్త సింహాసనమున హూనేశ్వరుడు గూర్చుండి చారుల బిలచి యిట్లనియె "ప్రబల ప్రతాపాన్వితమగు శకజాతి నిర్వీర్యమైపోవుటకు కారణమేమి? ఎన్ని పురుషాంతరముల నుండియో యీజాతిని జయింప వలయునను ప్రయత్నము నేటికి సఫలమైనది.

గుప్త= మహారాజా యీదేశమున పది వత్సరములక్రిందట నొక సన్యాసి వచ్చెను. ఆతడు జగత్తంతయు మిథ్యయని బోధించెను. ఆతని యుపదేశమువలన శకజాతి యుత్సాహవిహీనమై నిర్వీర్యమై పోయినది. మనకు లోబడి దాస్యము సల్పుచున్నది.

హూ- ఆతడిపుడెచట నున్నాడు

గుప్త- మఠమందున్నాడు.

హూ. ఆతని నాకడకు దీసికొని రండు.

సేనాపతి చిత్తము అని తలయూచి కత్తితోడ వందనమాచరించి బయలుదేరెను.

సన్యాసి హూనేశ్వరునికడకు వచ్చెను. ఆతనిని చూడగ నేమరకతమాణిక్యహారముల

తనమెడనుండిదీసి సన్యాసిమెడయందువైచి చేతులుజోడించుకొనియిట్లనియె. "మహాత్మా మాపూర్వపురుషులగు రాజులనేకమంది యీద్వీపమును ముట్టడించి హతులైరి. పారిపోయిరి. కాని మాయస్త్రశస్త్రములు వీరిపై నణుమాత్రమైనను పనికిరావయ్యెను. కాని యట్టి పనిని పదివత్సరములలో శాస్త్రసాధ్యములద్వారమున సాధింపగలిగితిరి. నేను మీకెంతయుకృతజ్ఞుడను" అనియనుచు ననేక ధనకనక వస్తువాహనములిచ్చి పంపించెను. వెంటనే సైన్యాధ్యక్షుని బిలచి యిట్లనియె "సేనానీ? ఒక్క నెలదినములలో నీ సన్యాసి యీ ద్వీపమునుండి లేచి పోవలయునని యుత్తరు విచ్చుచున్నాను. ఈ వార్తను వానికి [illegible]ముము నెలదాటిన తర్వాత [illegible] వానిని వధింపుము."

# వసంతుడు.

( [illegible] సత్యనారాయణగారు, బి. ఏ. )

వెలికిరానీక మమ్ముల వెలిని బెట్టి
వడకజేసిన శిశిరభూపాలుగర్వ
మణచి లోకము సంతసమందనదిగో
చైత్రరథమున వచ్చె వసంతరాజు

చివురుటాకుల సన్నంపుజీరగట్టి
మల్లెపూవులు వసనయు మాటువీడ
స్వాగతంబిచ్చె కోకిలస్వరముతోడ
ప్రకృతికాంతామణి వసంతరాజునకు

భయములేదిక మనకును బందెతోలగా
వింత వింతరంగుల పూలవీధులందు
సంధ్యవేళ మందపవనునరస, భ్రమర
కన్యలయభినయంబుల గాంచరండు।





# కుందమాల

( కల్లాప్రగడ సూర్య నారాయణ రావుపంతులు గారు. )

———— :O: ————

## తృతీయాంకము.

( భారము మోయుచు మార్గ పరిశ్రాంతుఁడైన తాపసుఁడు ప్రవేశించును. )

అకటా! గ్రీష్మ తాపము కడుదారుణముగ నున్నది. మిక్కిలిపరిశ్రాంతుఁడనైనాఁడను. పిక్కలు కదలించుటకుఁగూడ శక్యముఁ గాకున్నది. అడుగులు బొక్కలెక్కిపోయినవి. మఱియును సుకుమారయగు సీతాదేవియుఁ గోమలులగు కుశలవులును దాపసకుమారులతోఁగూడి నైమిశారణ్యముం బ్రవేశించిరి. సూర్యాస్తమయము కాలేదు. ఇప్పటికిని వటవీధికా ముఖమును జేరలేక పోయితిని. నాకిప్పుడు నైమిశ మార్గము నెవ్వరు కనుపరచెదరు. అదుగో! లక్ష్మణ సహాయుఁడైరామచంద్రుఁడు నైమిశమునకువచ్చినాఁడు. నేను వారివెంట నంటి యరిగెదను.

(ప్రవేశకము)

(అంతట శోక సంతప్తుఁడు రాముఁడును, వానికి ముందుగ లక్ష్మణుఁడును బ్రవేశింతురు.)

లక్ష్మణః:— ఆర్యా! ఇటు, యిటు, (పరిక్రమించి)

గీ॥ మునుపుగొనిచనినాఁడ దేవిని త్యజింపనన
పరాధ, ననాధ కాననము నడుమ స్వజన
మాపదలను ముంప జాలుఘనుడ!
నిపుడుకులశేషమునురాముఁ నెటగొనెదనో?

మ॥ అపరాధం బిసుమంత లేని పతిన
న్యాయం బరణ్యంబులం
దపమార్గంబులఁ ద్రోయఁ బోయితిని నే
నారంభ మందా క్రియన్

ఇపుడీ రాఘువవంశ శేషము నే
నే వెంట గొంపోదునో
విపదబ్ధిన్ స్వజనంబు నేఁగలువఁజాల్
వీఁగుండ నెట్లేమ్తునో?

గీ॥ సంపద హరించును ప్రమాదవరణి యెపుడు
విస్మయము పరిశ్రియమ్మును వెసలనడుచు
వ్యసనము దొలంచు వినయప్రవర్తనమ్ము
శోకమునఁ గూలు ధీరతానోకహమ్ము॥

అని కదా పల్కుదురు! ఈపల్కు కడు మేలైనది. పూజ్యుఁడీతఁడుమందరమహీధరమువంటి ధైర్యము గలవాఁడు వాల్మీకి యాహ్వానమును బురస్కరించుకొని, యాయన దర్శనముకొఱకు గోమతీ తీరమునంగల తదాశ్రమపదమునకని బయలుదేరినాఁడు. శోకావేగముచే హృదయము చెదరి యాదిక నేవీడి యిప్పుడు మహావనము వైపున కేగుచున్నవాఁడు. నేనేమని ప్రబోధింతును? ఈ ప్రతీహారి పరుపెత్తుకొని పోవు మార్గమునవైనను వాల్మీకియాశ్రమముఁ జేరఁగలడు (ప్రకాశముగ) ఆర్యా! ఇటు. ఇటు.

రాముడు.— (నిట్టూర్పుతో)

ఉ॥ సేతువుఁగట్టి వారినిధిఁ
జేసిన చేతలు వ్యర్థపుచ్చితిన్ఁ;
సీత పవిత్రురాలనివ
చించిన దైవమునెంచ నగ్నిచే;
నీతరిమున్న సంతతిగ
త్రెంపను పావనమైన దాని; మో
హాతురుఁడేమి సేయఁ డితఁ
డా మహిమాత్మ నుపేక్ష సేయగన్॥

(పరిక్రమించి) ఎంతకష్టమెంత కష్టము తపస్విని ప్రవాస మాధారభూమ్యముగదా!

గీ॥ శ్వాపదభవనమువనముజనకతనయ
కెందునను చిత్తమాశ్వాస మందఁగలదు?
దేనిపైఁబర్వ దృష్టితాఁ డివురఁ గలదు?
ఆశయే లేక బ్రతుకెట్టు లాగఁగలదు?

లక్ష్మణ:— (తనలో) పూజ్యురాలి విప్రవాసమును సంతతిగను విపత్తును దలచి తలచి యీతఁడు దుఃఖించుచున్నాఁడు. ప్రస్తావాంతరముచే నితని దేవీవృత్తాంతమునుండి మరలించెదను. (ప్రకాశముగా)

పూజ్యులు దీని నవధరింపవలయు

చ॥ మరకతకాంతిఁ జెన్నలగు
మంజుల నీరగులుంపుతావు సు
స్వరమున హంస నిస్వనము
శ్రావ్యముగా నలరారుచోటు మేల్
సరసిజ సౌరభమ్ము వెద
జల్లిదిశల్ వలపించు స్థానమో
నరవర ! నీదు చెంగటఁగ
నంబడు దీనినిఁగంటె గోమతిన్॥

రాముడు:— (స్పర్శము నభినయించుచు)

మ॥ మలయు మరుత్ప్రచారమును
మౌక్తిక హారము గంధపూరముమున్
జెలిఁ ద్యజించుటే మొదలు
చెప్పఁగరాని వికారహేతువుల్
చెలఁగు నకారణం బిపుడు
చిత్తమునం గుతుకంబు గోమతీ
సలిలపు మారుతంబొలయఁ
జాన వసించును తథ్య మీదిశన్॥

లక్ష్మ:— ఇచట పల్లము విశేషముగానున్నది. అప్రమత్తులై దేవరవారు దిగవలయును.

(ఉభయులును దిగుట నభినయించెదరు.)

(లెస్సగఁబరికించి) ఈయిసుకతిన్నెలలో నడుగుల జాడలు కడు మిక్కుటముగ నున్నవి. ఈపూజ్యు

తీరమునఁ బుష్పములు నిరవశేషముగఁ గోసినారు. తోడి మెలం మాత్రమే మిగిలియున్నవి. చిగురుటాకులు సమూలముగఁ ద్రుంచుటచే నీలతాకుడుంగములనెంత పొడలు గన్పడు చున్నవి. వీనిఁబట్టి చూడ నిచ్చట నెవ్వరో మనుష్యులు కొందరు తిరుగాడుచున్నట్లు తోఁచెడిని.

క॥ జలనుమమ్ముల దైవములకు
బలులిడినా రిప్పుడిప్పుడె భక్తినిసుకలన్
మిలమిలమను పాములవలె
నలలనదుమ్ముఁగుందమాలయలరెడుఁగనుఁడీ॥

రాముడు:— కేవలముతిరుగాడుటయె కాదు. ఈనదినిఁ జేరి, కాపురముండు నిండ్లుకూడ నుండి యుండును

లక్ష్మ:— ఏమి? యీయాశ్చర్యము! ఈకుందమాల సముద్రగామినులకు తిరంగపరంపరలచే గదలి; చరణసపర్య సేయుటకో యనఁ గ్రమ క్రమముగా దేవరవారి పాదసమీపముం జేరుచున్నది. అవహితముగ దీని రచనజాడ దగియున్నది. దేవర వారవలోకింతురు గాక! (తీసి యిచ్చుచున్నాఁడు)

రామ:— (గ్రహించి, తెన్నగాఁ బరికించి గగు ర్పాటు నభినయించుచు) వత్సా! ఈపూల దండ గ్రుచ్చునేర్పు మున్ను నేఁగన్నదియే.

లక్ష్మ:— ఎచ్చట గన్నారు?

రామ:— ఇట్టి దీనిని మరియెచ్చటఁ గనఁగలము!

లక్ష్మ:— దేవిగారికడనేనా?

రామ:— 'మరియేమి'

లక్ష్మ:— ప్రభువులం దప్ప నితరులెవ్వరిట్టు లెవ రెవ్వరి విలాసము లెట్టివో తెలిసికొనఁగలరు? పూజ్యాలీ గోమతీతీరము వెంట జనవలయు. ఈకుందమాల యొచ్చటనుండి బయలుదేరినదో దీని వెంటఁబోయినన్మూలమునఁగనుఁగొందము.

రామ:— లోకపన్నిదేశము శుంభసా ద్రుశ్యము.

ఇది మన యదృష్టమే కాదు. చీమచిటుక్కు మనిన యిట్టి విప్రకృష్టప్రదేశమున విడువఁబడిన సీత యాగమనమునుసంభావించువారెవ్వరుందురు! అయినను సీనీటిపట్టును విడువకుండ మనపోవు దారి జూడుము.

లక్ష్మ:— ఇదినతీభూమి. ఇచ్చట ముత్యపుగుల్లలు చిత్రకరుకు దనమున ముండ్లవలె కాప్పియడు గిడ దస్సహముగా నున్నది. నే నెట్టెట్టు మార్గమును చూపుచునో యట్లట్లే పూజ్యాలు మెల్లమెల్లగ నడువవలయు

రామ:— అట్టులే కానిమ్ము. ఈకుందమాల నాకు మిక్కిలి ప్రియమైనదియే యగును. కాని యియ్యది దేవతోపహారమగుటచే భోగ్యమున కవర్హమైనదని సంకోచము కలుగుచున్నది. (అనివిడచుచున్నాఁడు)

లక్ష్మణ:—

ఉ॥ దాటుము దీనివేత్రలలి;
దాపునముత్తెపుగుల్ల లందుకా
ల్నాటగరాదు; వంచుము త
లన్ తరువచ్చట వంగి తెన్నఁగా
మీటుము వింటలాగి మెల
మెల్లగ నడ్డము వాలెఁగొమ్మలన్;
మేటిధృతిన్ జనన్వలె జ
మీధృతిదూల్చెడు క్రూరజంతువుల్॥

రామ:— (అటులే నడిచి) వత్సా! ఈప్రదేశమువూ జ్యులగు వాల్మీకియాశ్రమమున్నదేశమాయేమి?

లక్ష్మ:— ఆర్యులు దేనినిఁ బట్టి కని పెట్టినారు?

రామ:—

గీ॥ సన్నమగుధూమరేఖ దిక్కయము గ్రలిసె
సూక్ష్మదృష్టినిఁ జూచినఁ జూడనగును
చల్లగాలికి వినవచ్చు సామగాన
మునునుబరవశమగుచుండె దనువుగనుడీ॥

లక్ష్మ:— పూజ్యులు చక్కఁగాఁ గనిపెట్టినారు. ముందుకుఁ బోయి సేయుఁగూడఁజాలెదను. (పరిక్రమించి తరువువలె స్తంభించుట నభినయించి) యేమిది యిచ్చటనడుగు పెట్టఁగ నే హృదయము కంపించుచున్నట్లయినది. ఊరువులు స్తంభించినవి. అడుగులు తడఁబడుచున్నవి. ముందు కడుగువేయ నుత్సాహము కలుగుటలేదు. కారణమేమి? (ఆలోచించి) ఆఁ తెలిసినది. గురుజనముండు ప్రదేశమున నిల్లై యుండును. అడుగుల జాడల వలె గప్పట్టుచున్నవి. (భూమినిఁ బరీక్షించుచున్నాడు.)

రామ:— నీయీ నిరూపణము దేనినిబట్టి చేసితివి.

లక్ష్మణ:— ఇసుక తిన్నెలలో నియీ పదచిహ్నములం గాంచుఁడు. నితాంత మనోహరముగ జరణతల సౌకుమార్యము సంక్రాంతమైయున్నది. అడుగు చెదరక లలితముగ నున్నది. దీనిఁబట్టి స్త్రీపదభాగముద్యోతకమగుచున్నది. పూజ్యులు పరికింపుఁడు,

గీ॥ అడుగు లెవ్వరివో కలహంసనడల।
ననుకరింపుచు సైకతమ్మునఁ జెలంగు
శ్రమమొనై జమోగతివిలాసంబొ కాని
కూరుకొనిపోయియున్న వకుంఠగతిని॥

రామ:— (సహర్షముగ నిరూపించి) వత్సా యెవ్వరివో యని యడుగనేల! సీత పదములేయని చెప్పవచ్చు నేచూడు.

ఉ॥ అడుగు సమంబుగాఁబడియె
నట్టెటుదోది సుమంత యూదమున్
జెపకు మనోహరమ్ము వర
సీరుహరేకయునల్లదే గనం
బడు తిలకంబునద్దివద
పంక్తిద్రిపేయసిదే కనుంగవన్
బాఢగనినంతనే మనము
వ్రాంగెడునాకును దుఃఖభాజికిన్॥

లక్ష్మ:— (సహర్షముగ) మనమీ పదపంక్తి ననుసరించిపోయిన వాల్మీకియాశ్రమంబునకుఁ బోవుదుము. ఈయడుగులును నిప్పుడిపుడే పడినట్లున్నవి. ఇయ్యవి ప్రసన్నవర్తిని యగు దేవివే యని యనుకొనియెదను. (అంతసీత ప్రవేశించుచున్నది.)

సీత:— సవనమైనది. సంధ్య నుపాసించితిని. హోమమైనది. భాగీరథీ స్నానముఁగూడ నిర్వర్తించితిని. భగవతి భాగీరథికి స్వయముగా గ్రుచ్చి కుందమాల నర్పించితిని. నే నిప్పుడున్నత గంభీర శిలలంగలుగు బూవుటెండ్లం బ్రవేశించి యతిథి జన సమర్పణ కనుకూలంబులగు బూవులం గోసెదను.

లక్ష్మ:— ఈపదపంక్తి క్రమక్రమముగా నిసుకనుండి స్థల ప్రదేశమున కరిగి యదృశ్యమగుచున్నది. ఆమూదర లతానికుంజములు చల్లని నీడలచే శోభిల్లుచు దృశ్యమానంబులగుచున్నవి. అచ్చట కొంత యధివసించి శ్రమమునపనయించుకొని పూజ్యులగు వాల్మీకులం దర్శింతము.

రామ:— నీయిష్టమెట్లు చేయుదము.

(పరిక్రమించి కూర్చుందురు.)

రాము:—(నిట్టూర్పుపుచ్చి కన్నీటితో) వత్సా! వత్సా!

సీత:— ఎవరిది కొఱుమా యీ కంఠస్వరము. సజలజలధరస్తనిత గంభీరంబగు స్వర విశేషంబున నత్యంత దుఃఖ పరిపీడితనగు నాకును బులకాంకురములఁ జనింపచేయుచున్నది. ఇదియెవరిదో గనిపెట్టెదను. పరమార్థమెట్టులను గాదని చోట దృష్టి నిగుడించుట ధర్మముగాదు. ఇందు గనిపెట్టదగినదేది? నా శరీరము పర పురుషశబ్దమున నెప్పటికినిగగుర్పాటు నొందఁ జేరదు. ఇచ్చట నిరస్తశోకుఁడు సంప్రాప్తమైనారనుట నిస్సంశయము. సందేహము నివర్తింపుకొనియెదను. పరాఙ్ముఖులగు జను-

కభిముఖుల గుగుడమేని యొకప్పుడు సిగ్గుపడ వలసినవారమగుదుము. కావున చూడరాదు. (పరాఙ్ముఖియై) ఏమిది? ఒడలి ట్లుపళమగుచున్నది. వలదన్నను దృష్టి యా ప్రువకే పోవుచున్నదే! రాజనియోగముచే బరాధీనురాలనైన నాకుగతియేమి. ఏమి చేయుదును. (లెస్స గాచూచి) అహో! ఒంటుపడేసను సంతోషము, చిర ప్రవాసమను శోకము మిక్కిలి చిక్కనై యను ద్వేగము దయా శూన్యుడయ్యెనే యను నభిమానము, చిరపరిచితుడే యనునమరాగము, దర్శనీయుడని యుత్కంఠ వల్లభుడని గౌరవము కుశలవులకు దండ్రియని బిడ్డలతల్లికుండెడిగిన సద్భావమును అపరాధ మొనర్చితి నన్నా డేయన్న లజ్జ, ఆర్యపుత్ర సందర్శనమున నిన్ని యవస్థలకు లోనైనదానను. ఇప్పుడే యవస్థ ననుభవించుచున్నానో కూడ నెఱుంగను.

లక్ష్మ:— ఆవిధముగ నందలకో పిలచి కిన్నలనీరు నించుచుమూరకుంటిరేల

రాము:— ఓరుల్వేరును లేనివివిక్తస్థలమీ యరణ్యము. చెట్లనీడలచే రమణీయములైన వీయేటి యొడ్లు. జలజల ప్రవహించుసెలయేటిధారచే ప్రసన్నమై యిసుక తిన్నెలచే మనోజ్ఞమై సముద్రగామి యగుచున్న తరంగిణి దీనిం గాంచిన దండకావనవాసము స్మరణకు వచ్చి మనసు చెదరిపోయినది.

సీత:— ఆర్యపుత్రుడు వనవాసమును స్మరించుచున్నాడు. వనవాస జనమమాటో.

లక్ష్మ:— దుఃఖైక వాసమగు వనవాసము నేలస్మరణకు దెచ్చితిరి.

రాము:— వత్సా! లక్ష్మణా! దుఃఖైకవాసము వనవాసమేల స్మరణకు వచ్చెనందువా? చూడు.

ఉ॥ కిసలయ కోమలాంబుజపు
కేల్గయి దండగా బూనినేను! ప్రే
యసియును సంజవేళల వి
హారము సేయరతిప్రసంగముల్
బాసగడి వెన్నెలయెన్నో యటు
పుచ్చినప్రొద్దులు మెల్లమెల్లగా
నిసుకల నేటినీటి కెదు
రేగినపోకడలన్ స్మరించెదన్॥

సీత:— ఓయీ నిరయతోశ! ఈవిధమగు ప్రసంగముచే శరణ్యములేక శోకార్తురాలగు నీమెను మతింత యడలజేయుచున్నావు.

లక్ష్మ:— ఆర్యా శోకమునలదు.

రాము:— మందభాగ్యుడను. ఎట్లు శోకింపకుండ నుండగలను. చూడు,

తె. గీ. మొదటవనవాసదుఃఖంబు;పిదపలంక,
తదుపరిని నిర్వాసనంబు దనరెనిట్టుల;
ననునధన్యుని జేపట్టుజనకసుతకు
దుఃఖములపైన దుఃఖముల్ దొరలుచుండె.

సీత:— ఈపలుకు నిర్వాసితపట్టునం బలుక దగినది కాదు.

రాము:— హా జనకరాజపుత్రీ!

సీత:— అల్పపుణ్యభాగినియెడ నిట్టిప్రలాపము వర్జింప దగినది.

రాము:— హా! హా! వనవాస సహాయినీ!

సీత:— ఇప్పుడు గాదుగదా

రాము:— ఎచ్చటికేగితావు.

సీత:— మందభాగ్యురా లెచ్చటికి బోవలయునో అచ్చటికి.

రాము:— మాఱుబలుకవేమి?

సీత:— అసంభావనీయమగు జనమునెడ మాఱు బల్కనెట్టిది?

రాము:— (హా! యనియేడ్చుచున్నాడు.)

లక్ష్మ:— ఆర్యా! శోకమువలదు నామాటవినుము.

రాము:— శోచనీయయగు వైదేహింగూర్చి యెట్లు శోకింపకుండ నుండగలను.

సీత:- ఆర్యపుత్రా! వైదేహి శోచనీయయని పలుక వలదు. ఎవ్వరికొఱకు ప్రాణేశ్వరుఁడు దుర విల్లునో యాజనము శోచనీయము గాదుగదా

రాము:— వత్సా! లక్ష్మణా! ఎచ్చట వర్తిల్లుచున్నదో తెలిసికొనుటకవకాశములేదా?

సీత:- లేకేమి! అవకాశమున్నది. దినసాప సానమున వారింపఁబడు సమాగమముగల చక్రవాకివలె ప్రవాసమునం దిచ్చటనే యల్లాడుచున్నదని తెలిసికొనుటకు.

లక్ష్మ:- ఎచ్చటనున్నదో యని తెలిసికొనుట శక్యము గాదు.

రాము:- చిరకాలా విచ్ఛిన్నమైన రఘుకులము నాచే విచ్ఛిన్నమైనది. (అని యేడ్చుచున్నాఁడు.)

సీత:- (శోకముతో) ఆర్యపుత్రుఁడు మిక్కిలి దుఃఖించుచున్నాఁడు. ఏమి చేయుదును. నిశ్చేష్టుఁడయియున్న యీతని యశ్రు సంచయమును హస్తసించి తుడిచివేయుదునా; (ఆడుగువైచి) తగదు. జనప్రవాదమే యనువర్తింపఁదగినది. ఆర్యపుత్రుఁడు నన్నుఁ జూడకుండనుండు నంతవఱకును శోకావేగముత్కటమై వాకొడలు వివశమగుచున్నది. మునిజనసంపాతమునకీయుద్దేశ్యము సముచితము. ఆనుషంగికముగ నెవ్వరికఁటనైనఁ బడవచ్చును. కావునఁ బొదల మాటు నుండి శ్రమమగు మార్గమునఁ బోయి కుశలవుల సంభావించెదను.

(అంతట ఋషియొకడు ప్రవేశించును)

ఋషి:- పూజ్యులగు వాల్మీకులు నాకిట్లాజ్ఞాపించినారు. వత్స బాదరాయణా! రామభద్రుడు లక్ష్మణసహాయుడై తపోవనమునకు వచ్చినాడని తెలిసినది. ఏదోమాధ్యాహ్నికకార్యము లందవ్యగ్నులమై యుందుమని తెలిసికొని చూచుటకు వేళగాదనుకొని వెలుపల వేచియుండిరి గావలయు. కావున నీవుఁబోయి వారిని సందర్శించి "మాధ్యాహ్నికకృత్యము అయినవి. దర్శనము కాంక్షించుచున్నాము" అని చెప్పుము అని పూజ్యులగు వాల్మీకులవారి యాదేశమున రామచంద్రు నన్వేషించెదను.

(అని పరిక్రమించుచున్నాఁడు)

లక్ష్మ:- (చూచితొట్రుపాటుతో) ఆర్యా! యెవ్వరో తపోధనుడిట సంచరించుచున్నాఁడు.

రాము:- (అశ్రువులు తుడిచికొని ధైర్యముతో గూర్చుండును.)

ఋషి:- ఈ పూవుటీరముదాపున పురుష యుగళము వలెనున్నది. రామలక్ష్మణులు వారలుగాదుగద, (ఆలోచించి) అందుకు సందేహమేమి.

ఉ॥ మెల్లగ వీచుచున్నది స
మీరము; సింగములుం గురంగముల్
సల్లలితప్రచారము లె
సంగఁజెలంగును గూడి; గ్రీష్మమున్
జల్లపడెన్; నికుంజముల
చాయ మెలంగకయుండె నీవియున్
దెల్లము రామదేవుడె వ
నిన్ విహరించెను నీడ నేడనో॥

కేవల మతి మానుషప్రభావము చేతఁగాని యాకారము చేతఁ గాని నిశ్చయించుటకు శక్యము గాకున్నది.

( లెస్సగాఁబరికించి )

ఆ. వె.॥
వెడఁదయురమువాఁడు నిడుద బాహులవాఁడు
కర్ణయుగమునంటు కనులవాఁడు
ఎగు బుజములవాఁడు దృఢ శరీరమువాఁడు
దశరథాత్మజుండు తథ్య మితఁడు॥

కావున సమీపించి యాదార్థము తెలిసికొనియెదను.

( సమీపించి ) రాజా! స్వస్తి.

రాము:— ఆర్యా! నమస్కారము.

ఋషి:- విజయీభవ.

రాము:- పూజ్యులరగు మీరిటకేతెంచుటకుఁ గారణమేమొయెఱంగఁగోరెదను.

జామీ:- పూజ్యులగు వాల్మీకులు మాధ్యాహ్నికముం గానిచ్చి మహారాజులవారి యాగమమునకు నిరీక్షించుచున్నారు.

రాము:- చూచి। ఓహో; మాధ్యాహ్నికము దాటె నదే.

ఆ. వె. తెరుల మొదటఁ జేరి తరలెడుదచ్ఛాయ
నడిదినంపు టెండ గడిపియచట;
ఎండవేళ త్రోవ నేగెడు పాంధులు
చేరిచెట్లక్రింద దారునట్లు;-

మఱియు,

చ॥ నడి దివసంపు టెండను ఘు
నంబగు తాపము వాయువాహినిన్
గడువడి నోలలాడి శశివ
ణమ్ముల వారికణార్ద్రమారుతం
బోలయ మొగమ్ముపై జలము
లోడ సురమ్ముగ పేనుఁగొడ్డు వే
రెదు మెలమెల్ల నిప్డు; చెల
రేగె సుమాల్ కరఘాతఝాంకృతిన్.
( అందఱు నిష్క్రమింతురు )

# చరక దేవ్యష్టకం.

(పల్లె వెంకట శాస్త్రిగారు.)

౧ దాస్యారణ్యాన తేమాత ఆత్మనిగ్రహవర్ధనీ
చరక దేవిప్రదేహిత్వం మానరక్షణసంపదా॥
౨ భారతావనిసంప్రాప్త బంధమోచనదాయినీ
చరక దేవిప్రదేహిత్వం మానరక్షణసంపదా॥
3 ప్రాకృతాచారసంరక్షీ ప్రకృతిమాంద్యవినాశనీ
చరక దేవిప్రదేహిత్వం మానరక్షణసంపదా॥
౪ సుదర్శనాకృతిః భాంతీ ప్రణవనాదవిలాసినీ
చరక దేవిప్రదేహిత్వం మానరక్షణసంపదా॥
౫ సత్యజ్ఞాన సుసంభూతా శాంతధర్మ ప్రవర్ధనీ
చరక దేవి ప్రదేహిత్వం మానరక్షణ సంపదా॥
౬ విజ్ఞానలోక సామ్రాజ్ఞీ కాటకాబ్ధమహానిలే
చరక దేవి ప్రదేహిత్వం మానరక్షణ సంపదా॥
౭ భారతీయ సదా పూజ్యాం ప్రజ్ఞాం పుష్టించ వర్ధ
చరక దేవి ప్రదేహిత్వం మానరక్షణ సంపదా॥
౮ సకలలోకేన సంధ్యేయా సర్వానర్థ విదారిణీ
చరక దేవి ప్రదేహిత్వం మానరక్షణ సంపదా॥

# ప్రేమచిహ్నము.

( వామాల, రాఘవాచారిగారు. )

దసరా పండుగలయందు నూతన వస్త్రములు కొనక తప్పదుగదా? పిల్లలను వెంట బెట్టుకొని మార్కెట్టుకేగి యచ్చట గొన్ని వస్త్రములుగొని జట్కాబండి యెక్కి బందరువీధికవచ్చి యొక దుకాణమున బ్రవేశించి వస్త్రములు బేరము చేయుచుంటిని. ఆ షాహుకారు గడపంచమీదనుండి పలువిధములగు వస్త్రములదీసి మా ముందర నొకటితర్వాత నొకటి వైచుచుండెను. బీదసాదలు వచ్చిమూగిరి. ఎవరికి గావలసినవానిని వారుకొనుక్కొని పోవుచుండిరి. నేను పదిగంటలు గావచ్చెనదని తొందరపడుచుంటిని. "పండుగదినములుగదా ? మీకు కావలసినవి యేర్పరచుకొనుడు. ధరచెప్పెదను." అని వర్తకుడనుచుండెను.

అప్పుడు నేబదియేండ్ల వయసుగల యొకడు గబగబవచ్చెను. మురికిపంచ గట్టుకుని చినుగులచొక్కా దొడుగుకొని చిన్న తుండు భుజముమీద వేసుకొని యుండెను. కాని యాతని చూపు-ఆతురత-మాటల తొందర- మొదలగువానివలన వాడు సగము పిచ్చివానివలె దోచుచుండెను. అతడు దుకాణములోనికి వచ్చి గుమాస్తామీద 10రూపాయలనోటును పారవైచి "శెట్టిగారూ! నాకొక మంచి తెల్లని జరీచీరయిప్పించండీ! త్వరగా! ఇవ్వండీ! చూచుటకు బాగుండవలెను" అతడు గూర్చుండుమని చెప్పి వానిముందు 10 చీరలు పడవైచి యిందు మీ యిష్టము వచ్చిన దాని నేరుకొనుమనెను. వెర్రిగాను మౌనముగ కొంతవడి నిలుచుండి యిట్లనెను. "శెట్టిగారూ! నాకు మంచిచెడుగులు తెలియవు. మీరే మంచిదిగ నేరి యివ్వండి అడిగినడబ్బు యిచ్చెదను" అని యాతడు బట్టల నటు నిటు చూచి యందొకదానిని దీసి యిది 9-8-0 లు. మంచిది. తీసుకొని వెళ్ళుడు." అనగానే దానిని చంకబెట్టుకొని బజారులోనికిపోయి గబగబ నడచిపోయెను.

నేను బేరమును మాని యాతనివంక చూచుచుంటిని. అతడు దొంగ లేక వెర్రివాడయి యుండునని మనమున నిర్ణయించుకొంటిని. దుకాణదారుకూడ "వీడి విషయము చిత్రముగా నున్నదే? 0 8 0లు గూడ దీసికొనకుండ పారిపోయినాడు. పిచ్చివాడై యుండును!" అనియెను. నేను నా పిల్లలకు గావలసిన వస్తువులను గొని బండియెక్కి యింటి కేగితిని.

ఆదినము సాయంత్రము చెంగాయంగడినుండి తిరిగి యింటికి వెళ్ళుచుంటిని. ఉదయమున కనబడిన వాడు జరీచీర చంకనుంచుకొని గబగబ యుత్తరపు వీధిని పరుగెత్తుచున్నాడా యన్నటుల నడచుచుండెను. వానిని చూడగనే నాకు చిత్రముగదోచి వాని వెంటబడితిని. కాని నడువలేక రిక్షాయెక్కి వాని వెంట దీసికొని యేగుచుంటిని. రిక్షావాడు నన్ను పోలీసు యినస్పెక్టరనుకొని వాని వెనుకనే పరుగిడుచుండెను. కాని యాతడు వెనుకకు తిరిగి చూడలేదు. ఇట్లు స్మశానమునకేగితిమి.

దసరా యెల్లరకును పండుగయేగదా! కాని పండుగ ప్రారంభమునకు పూర్వదినము మహాలయము. మహాలయమును దలచి ధ్యానించి కన్నీరునించునట్టి భారతీయుండుండడుగదా! కాని పండుగ యెల్లరకు పండుగ యెట్లగును! అదినములయందు భర్త

కోల్పోయినభార్యలు భార్యల గోల్పోయినభర్తలు నుందుచుందురు; విలపించుచుందురు. ఈ విలాపమే వారికి పండుగయగును. అన్యోన్యమే వారిజీవనమున కాధారమగును.

అతడు స్మశానమును ప్రవేశించి యారిపోవు చున్న చితి సమ్ముఖమున నిలచెను. నిమేష కాలమేమియో ధ్యానించుచుండి తర్వాత తన చంక నున్న చీరను దీసి విప్పి యందు బడవైచెను. అది గప్పున మండెను. అమంటను చూచుచు వాతడు నిలుచుండెను. రెండు మూడు నిముసములకా మంట యారి పోయినంతనే యతడు బూడిదను గొంత దీసి కొని బయలుదేరి ప్రక్కనున్న కొలనిలోని సోపాన ములకడకు వచ్చి నిలచెను. నేను గూడ వానివెంట నేగితిని. అతనికి నాపైగాని యితరులపైగాని దృష్టి లేకుండెను. చూచుచున్నను కనబడకుంటిమి. ఆబూడిదను కొలనునందు గలిపి యిట్లనియె "కట్టు కుందువు; కట్టుకొనుము. శాస్త్రవాక్యములు వృధా యగునా? అడిగినప్పుడు దెచ్చి యివ్వక మహాపాత కము నర్పితిని. క్షమించి ధరించు."

అప్పుడు నేను వానిని సమీపించితిని. వాని చేతులు బట్టుకుని స్నేహాభరమున నిట్లంటిని "అన్నా దుస్సహానీయమగు నీచరిత్రను నాకు చెప్పరాదా?" అనినంతనే యాతడు నన్ను గౌగలించుకొనెను. వాని కన్నీటిబిందువులు నావక్షస్థలముపై రాలజొచ్చెను. కొంతవడికి తేరుకొని యిట్లనియె. "అన్నా? ఏల చెప్ప రాదు? చెప్పెదను; వినుము. నీకన్నదమ్ములున్నారా? ఉన్నయెడల నాకు దూరముందుండుము— (వెనుకకు బోవుచు) దూరముండుము. అని పకపక నవ్వ జొచ్చెను. వాని నేత్రములనుండి యగ్నికణములు గురియసాగెను. ఒక్కనిముసములో వానివికారము గట్టుబడి తిరిగిదగ్గరకువచ్చి యిట్లనియె. చెప్పెదను కాని నీకెక్కుడు సంగతులు చెప్పను. ఒకటి రెండు మాటలు. ఇష్టమేనా? ముందుచెప్పు.,,

నేను సరే చెప్పుమంటిని. అప్పుడాతడి ట్లనియె. "ఆ దుర్మార్గునికి నాసర్వస్వము ధారబోసి పెంచి పెద్దవానినిగ జేసితిని. మేమిద్దరమొక్క తల్లి బిడ్డలముగదా! మాతలిదండ్రులు మరణించిరి. అసంగతే వానికి దెలియదు. అంత చిన్నతనము- నుండి పెంచి పెద్దవానిని చేసితిని. బాగా చదువు చెప్పించితిని. "పెద్ద పరీక్షనిచ్చెను" ప్లీడరాయెను. బాగా డబ్బు సంపాదించసాగెను. అప్పుడు నేను కంటికి కనుపడుదునా? నాకొక పిల్లయుండెను. అది గూడ చచ్చిపోయినది. (కన్నీరు గడుచుకొనుచు) దానికిగూడ సరిగ పెట్టక నేను దివక అనిర్భాగ్యునకు చదువు చెప్పించితినయ్యా! అది రెండేళ్ళక్రిందట విష యము. అన్నా? ఒకటిరెండిద్దెముగాదా 14 సం॥ పిల్ల చనిపోయి నప్పటినుండియు తల్లి పిచ్చిదై పోయినది.

"దసరాపండుగలు. సప్తమిరోజున నాతమ్ముడు ప్లీడరు పెండ్లాముకొరకు మంచి పట్టుజరీచీర దెచ్చి యిచ్చెను. నాభార్య పిచ్చిదిగా? అదిచూడగానే నాకుగూడ చీర గావలయునని పట్టుబట్టెను. తీసుకు రానియెడల యురిబెట్టుకొందునసెను. ఏమిచేయు దును? పిచ్చది— చెప్పిన వినదు. తెలియదు. ప్లీడరు తమ్మునికడకేగి సంగతి సందర్భములు చెప్పి డబ్బు అడి గితిని. "కాని డబ్బేది? నాదగ్గరలేదు. మీకు యిల్లిచ్చి యన్నము పెట్టుట గాక డబ్బుకూడానా? బాగున్నది" అనెను. నాకుకోపమువచ్చెను. శరీరము కంపమెత్తెను. నోరుమూసుకొని యింటికి వచ్చితిని. ఆరాత్రిపిచ్చిదినన్ను బాధింపజొచ్చెను. నీవుచచ్చిన చావుగాని నాదగ్గర డబ్బులేదంటిని. ...ఉదయమున నేలేచి డబ్బుకు బ్రయత్నించితిని. స్నేహితుల యిండ్లుదిరిగితిని. తిరిగి తిరిగి యింటికి వచ్చునప్పటికి రెండు గంటలాయెను. ఇంక చెప్పనదేమి? నాభార్య పిచ్చిది- గొంతుకుచీరగట్టుకొని దూలమునకు వ్రేలబడి యుండెను. నన్నువీడిపోయెను."

అతడు కొంతవడి మౌనముగనుండి తిరిగియిట్లు చెప్పసాగెను. అపిచ్చిదిపోయినది. ఏమిచేయుదును? ఆత్మహత్య యొనర్చుకొనవలయునని తలంపుచుందును. కాని చేతగాదు. నేనుపిచ్చివాడనే. నాకుపిచ్చియెక్కనది. అన్నా—అసత్యమి ఘోరసత్యము. నన్నుక్షమింప జేయరాదా? గతించిన సంవత్సరమునుండి దానికిష్టమైన— పిచ్చిదానికోరిక ప్రకారము—చీర నీ చితియందర్పించు చున్నాను." • అనుచు నేడ్చెను.

నాకండ్లనీరు కారజొచ్చెను. రిక్షాయెక్కి యింటికి బయలుదేరితిని.






## ౧ రాయగడము.

మహారాష్ట్ర ఇతిహాసములందును దేశచరిత్రము లందును రాయగడము ప్రధానస్థాన మలంకరించి యున్నది. మహారాష్ట్ర దేశమందలి దుర్గములన్నిటి లోనను రాయగడము దుర్భేద్య మగుటచేతనే, యింతటి ప్రసిద్ధిగాంచుటకు కారణము. శ్రీశివాజీ యాదుర్గమునే తన కర్మక్షేత్రముగ నేర్పరచుకొనెను. ఈగడము 1674వ సంవత్సరము మొదలు 1680వ సంవత్సరము వరకును శ్రీశివాజీ హస్తముల యందున్నది. ఇక్కడనే శ్రీశివాజీ మహారాజు 1680 వ సంవత్సరమున స్వర్గస్థుడాయెను. దీనియొక్క స్థానమును, ప్రాముఖ్యమును గాంచిన ఆంగ్లేయులు, దీనికి తూర్పు జిబ్రాల్టరు (East-Gibralter) అను నామమిడిరి.

రాయగడ సామీప్యమున నెన్నియో యుద్ధములు జరిగినవి. మహారాష్ట్ర రాజ్యమును స్థాపించి, వృద్ధిచేయ కంకణమును ధరించిన వీరులు ప్రథమమున నీరాయగడమునే స్వాధీనము జేసికొన ప్రయత్నించెడివారు. ఎన్నిమారు లెన్నివిధముల ప్రయత్నించినను ఔరంగజేబీ కోటను స్వాధీనము జేసికొనలేకపోయెను. తుదకు కుతంత్రముల ప్రయోగింపవలసి వచ్చెను.

ఎట్టకేలకు 1690వ సంవత్సరమున ఔరంగజేబు మహారాష్ట్ర సైన్యమందలి కొందరు ద్రోహుల సహాయమున దీనిని స్వాధీనపరచుకొనెను. మరల దీనిని జయించి ఆరుగురు రాజులు నూటయిరువది యైదువత్సరముల కాలమున ఒకరినొకరు జయించుకొనుచు యిట రాజ్యముచేసిరి. ఈమధ్యకాలమున చెప్పదగిన విశేషము లేమియును గానరావు. తరువాత 1818వ సంవత్సరమున రాయగడము ఆంగ్లేయుల హస్తగతమైనది. ఆంగ్లేయుల ఫిరంగి గుండ్లచే చాలభాగము పాడుచేయబడినను, శ్రీశివాజీ ప్రాసాదహృదయము మాత్రమీనాటికిని రాయగడ పురాతనౌన్నత్యమును వెల్లడిచేయుచునే యున్నది.

రాయగడము పూనా నైరృతియందు యిరువది మైళ్ల దూరమున నున్నది. మహాద్ నుండి పదునారు మైళ్ల దూరమున నున్నది. ప్రస్తుతము రాయగడమునకు పోవుటకొక్క బాట మాత్రమున్నది. బొంబాయినుండి పండ్రెండు గంటలు స్టీమరు ప్రయాణముచేసిన తరువాత మోటారు నెక్కి మహాద్ చేరవలయును. అటనుండి కాలి నడకనైనను యెద్దుబండి పైనైనను రాయగడము చేరవగును. వేరు మార్గము లేదు. రాయగడము సముద్రమట్టము నుండి 2851 అడుగుల యెత్తునున్నది. కొండకు నలువది మైళ్ల దూరముగ సముద్రము కన్పట్టుచుండును. రాయగడమున్న పర్వతము, సహ్యాద్రిమాలతో గలసియుండక, విడిగనున్నది. చుట్టునున్న పర్వతపంక్తి కంటె రాయగడమున్న పర్వతముయొక్క యెత్తు తక్కువయగుటచే బయటనుండి చూచుటకు దుర్గము కానరాదు.

రాయగడమున ప్రవేశించుటకు ఒక్కమార్గమే యున్నది. అదియును, చాలకష్టమగు బాట.

మార్గము తిన్నగనుండక, అనేకవంకరలతో నిండి యున్నది. కొండయొక్క యెత్తుమూడు వేలయడుగు లైనప్పటికిని వంకర టింకరగనున్న మార్గమెనిమిది మైళ్లకు తక్కువ యుండదు.

పర్వతమందలి ప్రకృతిసౌందర్య మింతింతయని చెప్పనలవిగాదు. మృదుమైవీనులకు విందొనరించు శబ్దముతోడ బ్రవహించుచున్న నీటిబుగ్గయొకటి కలదు. బాటకు ప్రక్కగ యిటునటు. పర్వతముమీద గుహ లనేకములు కలవు. అక్కడక్కడ చిన్నచిన్న జలాశయములును దుర్గ సంరక్షకుల గృహములును కాన నగును. మూఁడువందల సోపానములు గడచినమీద నొక ద్వారము కానబడును. ఇదియే ప్రధాన ద్వారము. ఈ ద్వారమింకను పూర్తిగ శిథిలము కాలేదు. ఈద్వారమున కిరుప్రక్కలను పండ్రెండు నివాసగృహము లున్నవి, ఈగృహములు బలిష్ఠము లగు రెండు ప్రాకారములచే కాపాడ బడినవి, ఈయిండ్లు ద్వార రక్షకులకై నియమింప బడినవి, రాయగడము శత్రుదుర్భేద్యముగను బలవంతము గను చేయుట కెన్నియో ప్రయత్నములు చేయబడి నట్లు బాహ్య ప్రాకారాది కట్టుదిట్టముల వలన తెలియు చున్నది.

ప్రధాన ద్వారమునకు కొంచెము దూరముగ గంగా సాగరమను నొక పెద్ద హ్రదమున్నది. ఇందలి జలమతి శీతలము సునిర్మలము. చేరువనే నిర్మింప బడిన ప్రాసాదచ్ఛాయ జలములపై బడి ధగధగ మెరయు చున్నటుల కానుపించును. ప్రాదోపరిభాగమునుండి వీచు వాయువులు మహారాష్ట్ర రాజ్యలక్ష్మి నిరాశచే విడచుచున్న ఉచ్ఛ్వాసముల వలె వీనులకు వినబడు చుండును.

దుర్గమందొక యున్నత స్థానమున్నది. అట నిలచిన కోటయందలి ప్రతిభాగము మాత్రమే కాక, కోటయావలి చాలప్రదేశము కూడా చూడ నగును, దుర్గప్రాకారము చుట్టును బయటవిశాల ప్రదేశమున్నది. చుట్టును నదీరేఖయొకటి కలదు. దుర్గమందలి యున్నతస్థానమున నిలచిన, తోర్ణా, సజాగడు దుర్గములు బయస్కోపు బొమ్మలవలె చూడనగును.

రాయగడమున మూడు సభా మంటపములున్నవి. లోనికేగుట కొక్కొక్క మంటపమున కొక్కొక్క మార్గము మాత్రమున్నది. అందుండి యిరువురొకమారుగ లోనికేగ వీలులేదు. మూఁడింటి యందును, కొండొక దానిప్రక్క నింకొకటి గనున్నవి. అందొకటి న్యాయ సభయనియు, రెండవది వివేకసభయనియు, వ్యవహరింప బడుచుండెడివి.

ప్రాదమున కీశాన్యముగా భవాని మందిరమున్నది. దీనికొంచెము దూరమున శ్రీశివాజీ ప్రాసాదమున్నది. ప్రాసాద ప్రధానద్వారము దరినిలచి దుర్గమందలి ప్రధాన సభామంటపము కానుపించుచుండును. ఈసభామందిరము చాల విశాలమైనది. ఈమందిరమున 450అడుగులు పొడవును, 250 అడుగులు వెడల్పును గలయొక విశాల మంటపమున్నది. ఈమంటపమించుక యెత్తుగనుండి మంచి అందమగు రాతిపలకచే అమర్పబడి యున్నది. దీనిమధ్య శిలా నిర్మితమగు శ్రీ శివాజీ సింహాసనమున్నది. శ్రీశివాజీ మహారాజుయొక్క సింహాసములో శిథిలము కాకుండ మిగిలిన దిది యొక్కటియే. ఈప్రదేశము మహారాష్ట్రులకొక పవిత్ర స్థానము. వారిందు పాద రక్షలతో ప్రవేశింపరు.

ఈగడమందే మరొక సభయును మందిర మొక్కటి గలదు. శ్రీ శివాజీ సింహాసనమునకు సరిగ వెనుకవైపున ప్రవృత్తి మందిరము, విశ్రామ మందిరము, భాండాగారము, అంతఃపురము, మున్నగు భవనము లుండెడివి. భాండాగార మగ్నిదేవున కాహుతియైనది. మిగత భవనములును శిథిలము లైనవి. మరేటి యందింకను భాండాగారాది భవన శిథిల చిహ్నములు కానుపించు చున్నవి. ప్రాసాదమునకు 40అడుగుల దూరమున నొక బాట యున్నది. అదిచాలదూరము వరకున్నది. బాట

శిరుప్రక్కలను ఉన్నతములగు గోడలున్నవి. దానికిరు వైపులను అటనట శిథిలములైన దుకాణములు కలవు. పూర్వమిక్కడనే బజారు సాగుచుండెడిది. అంగడు లిక్కడు రెుత్తుగ నుండుటవలన ప్రజలు గుఱ్ఱముల మీదనుండియే వస్తువులు కొనుచుండెడి వారు.

టాకతిన్నగ తోఖమూక్ అను ప్రదేశమున కేగుము. ఇట కొలుజారినయెడల వేయియడుగుల క్రిందనున్న కొండలోయలో బడుటకన్న వేరుగత్యంతరమేమియులేదు. మహాపాపులను రాజద్రోహులను యిటనుండి క్రిందకు దోయుచు బడెడువారు. ఇక్కడనిలచి క్రిందకొకమారు దృష్టిబరపిన తలతప్పక తిరుగును. ఇచ్చటకు వస్త్రములు తయారుచేయు ఖార్ఖానా స్పష్టముగ కానుపించును. కార్ఖానారుక్కు భగ్నచిహ్నములు నేటికిని కానుపించుచున్నవి. ఈకర్మాగారము చాలపెద్దది. దీనిగోడ మూడడుగు లన్నర వెడల్పుగలిగి తొంబది తొమ్మిదడుగులు పొడవున్నది. కర్మాగారముదరి అకొండయందే పద్దెండు బావులుకలవు, అవి రాతిలో దొలుపబడినవి. ఒకదానిలోరాయి విసరిన అశబ్దమూపండ్రెండు బావులందును కూడ వినబడును. దీనివలన నాబావుల యడుగు భాగమునసారంగ మొక్కటి కలదని తెలియుచున్నది.

కార్ఖానాకొక మైలుదూరముగ జగదీశ్వరమందిరము ప్రతిష్ఠచేయబడియున్నది.

చుట్టునున్న ప్రహరీచాలవరకు శిధిలస్థయందున్నది. ఈమందిర ప్రధాన ద్వారముదగ్గరనే స్వరాజ్యసంపాదనా కంకణ ధరుడును త్యాగియు భవానీప్రియ పుత్రుడును శూరాగ్రేసరుడును ప్రజాహిత పరిపాలకుడును అగు శ్రీశివాజీచక్రవర్తి సమాధియున్నది.

ఈసమాధి శిలానిర్మితము. శ్రీశివాజీ చక్రవర్తి సమాధి ప్రక్కనే ఆయన ప్రియమగు కుక్కయొక్క సమాధియుకలదు.

రాయగడ సౌందర్యము నేడు కానరాదు. ఈస్టు జిబ్రాల్టరు యొక్క ఖ్యాతి నేడేట గలసినది. ఫిరంగిగుండ్లతో కాలచక్రముయొక్క గిర గిరలేక మై రాయగడమును రాళ్ళపాలు చేసినవి.

శ్రీశివాజీ మహాచక్రవర్తి స్వర్గము నలంకరింప నేగినను యింకెటి వైభవముగ వెలసెనాయన నంతటి అవరస్థితికి వచ్చినను మహారాష్ట్ర రాజ్యమంతరించినను ఆనాటి రాయగడముయొక్క ఔన్నత్యము శౌర్యము పరిపాలనా పద్ధతి నాయకులు వారి న్యాయమార్గములు దేశభక్తి త్యాగశక్తి మున్నగునవి మాత్రమింక నునితిహాసములయందు శిలాక్షరములవలె కన్పట్టుచున్నవి. హా! యెట్టిరాయగడమునకెట్టి స్థితి వచ్చినది!

శ్రీ శివాజీ చక్రవర్తి సమాధి నేడు లక్షలకొలది జనులచే పుణ్యక్షేత్రముగ పరిగణింప బడుచున్నది. ప్రతిసంవత్సరము వైశాఖ మాసమున శ్రీశివాజీపట్టాభిషిక్తుడైన దినమున రాయగడమున గొప్ప ఉత్సవము జరుగుచున్నది. మహారాష్ట్ర మందలి మూడు వంతులప్రజలారాయగడమున శ్రీశివాజీ పదములశిరమును చేర్చి పూజింప నాటిదినమున తప్పకవత్తురు.

యస్. జి. ఆచార్య.

X X X

## రాజనీతి.

మనపూర్వులు, సామదాన భేదదండో పాయములను చతుర్విధోపాయములలో రాజనీతి యిమిడియున్నట్లు అనేకగ్రంథములలో వ్రాసియున్నారు. ప్రపంచచరిత్ర యంతయు, దీనికి దృష్టాంతమే కాని మన మహాత్మాగాంధిగారు, సామోపాయము గాక తక్కిన మూడింటిని త్యజించవలసినదని చెప్పుచున్నారు. రాజకీయమోక్షము, అముష్మికసౌఖ్య సంపాదనకువలెనే సత్యము అహింసలమీద నాధారపడవలెనని స్పష్టముగా బోధచేయుచున్నారు. వీరివిధానము జయప్రదమైనదా కాదాయను విచారమే వీరికక్కరలేదు. ఎక్కువమంది జనులు, దీని నవలంబించినయెడల, దుష్పరిపాలనము స్తంభించునని వీరియుద్దేశ్యము. అదిసత్యమని కూడమనము నమ్మవచ్చును.

కానిఅట్లు సంభవించ నేరదనియు, ఒకవేళ సంభవించినను, పెద్దపార్టీవారు. చిన్నపార్టీవారిని లోబరుచుకొనుటకు, హింసకు సిద్ధముగుదు రనియు, యీకలియుగములోని ప్రపంచచారిత్ర ఘోషించుచున్నది. చరిత్రముల నటుంచనిచ్చి, నైతికసూత్రములనే విమర్శించెదము.—

బహుమందిలోభులు, దుష్టులుగల సమాజము అందున్న ధర్మాధర్మములు, కొంత వరకైనను వేరుగా నుండుటవలన, మన నైతిక ప్రవర్తనను, వానినిబట్టి మార్చుకొనకతప్పదు. అహింస, సత్యము మొదలగు ముఖ్య నైతికసూత్రములలోకూడ స్థూలసూక్ష్మధర్మ భేదములు పొడకట్టుచున్నవి. సామ్యబుద్ధిగల స్థితప్రజ్ఞునుసహితము లోకవ్యవహారములలోనికిదిగినపుడు అత్యుత్తమమైన ధర్మాధర్మములయందు కొద్దియో గొప్పయో మార్పు చేయకతప్పదు. అప్పుడు, అతనిబుద్ధినిబట్టియే, అతను చేయు కార్యముయొక్క యోగ్యతాయోగ్యతలను గ్రహించవలెను. గాని దానిఫలాఫలములనుబట్టి కాదు. ఒక కార్యము యొక్క నీతిమత్తను పూర్తిగ వర్ణించుటకు, దానిబాహ్యఫలములవైపున దృష్టించుటకంటె దానికర్త యొక్క శుద్ధమగుబుద్ధినే విశేషముగ మనము గమనించవలెను. కాని ప్రతివాడును తనకిష్టమైన దుర్నయములు చేయుచు, తనబుద్ధిశుద్ధముగనే యున్నదని సమర్థించుకొనకూడదు. సర్వభూతముల యందును నొకయాత్మయే యున్నదని తెలిసికొని తనబుద్ధిని సామ్యముగ చేసికొన్న స్థితప్రజ్ఞునికర్మలే మనకుమార్గదర్శకములు. అతడే, అహింస, సత్యము మొదలగు నిత్యధర్మములనుకూడ దేశకాల పరిస్థితులనుబట్టి మార్చగల యధికారము గలిగి మనకు నాయకుడుగ నుండతగినవాడు. అట్టినాయకులలో తిలకుమహారాజు, గాంధి మహాత్ముడు ముఖ్యులు, వీరుతమతమ విధానములవలన పొందతగిన ఫలములను పొందక పోవచ్చును. విపరీత ఫలములనుకూడ పొంద వచ్చును. వారు పశ్చాత్తాపమును బొంది తమవిధానములను దేశకాల పాత్రాదులను బట్టిమార్చుకొన వచ్చును. వీరిశుద్ధబుద్ధినిబట్టియే వీరికార్యములనీతి మత్తను మనము గ్రహించవలెను. వీరివంటిసామ్యబుద్ధి కలవారమనలో అనేకులుండ లేక పోయినను, తక్కినవారు తమశక్త్యనుసారము, నిష్కామబుద్ధితో రాజకీయ వ్యవహారములు మొదలగు కర్మలనుచేయుచు, యితరులకు మార్గదర్శకులగుచు, క్రమక్రమముగా పూర్ణమగుసిద్ధిని లభింపచేసికొనవచ్చును. ఇదియే భగవద్గీతలలోని ముఖ్య సారాంశము. శ్రీకృష్ణుడు గొప్పకర్మయోగియై దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసిచూపించెను. జనకమహారాజు యిటుల నిగ్రహస్థుడుగానుండి నిష్కామ కర్మలుచేసి, మోక్షమును సంపాదించుకొనగలిగెను. మహాత్ముని సాత్వికాయుధమును ప్రజల చేపట్టించ జాలనియెడల, నెహరూ! దాసువంటి స్వార్థత్యాగుల రాజసాయుధమును శాసననిర్మాణ సభలలో నుపయోగించి, రాజ్యపరిపాలన స్తంభింపచేసి రాజకీయ స్వాతంత్ర్యములు బడయునట్లు మనము చేసికొనవలెను. అహింసగాని పశుబలముగాని కృత్రిమముగాని, పరదేశీయుల దెప్పుదలగాని, యిట్టిదేరాజకీయ విధానము నవలంబించినను సమత్వముతో ఆత్మౌపమ్యదృష్టితో, నెల్లరతో వ్యవహరించు సంపూర్ణ స్వార్థత్యాగులే ఆవివిధ విధానముల నవలంబించగల యధికారులు. మితవాదులు, స్వాతంత్ర్యవాదులు, జాతీయవాదులు స్వరాజ్యవాదులు అసహాయవాదులు అనిపేర్లుపెట్టుకొని నంతమాత్రముచేత మనకునాయకు లెన్నటికిని కాజాలరు.

వల్లూరి సూర్యనారాయణరావు.

X X X

## ౩ కొన్ని గమనీయాంశములు.

౧. జర్మనీయందలి ప్రొఫెసర్ పైక్ అనునొక భూగోళశాస్త్రజ్ఞుడు యీభూమండలమునందును 10 అర్బుదములు మనుష్యులు జీవించుటకు స్థానముగలదని అంచనావేసి చెప్పెను. ప్రపంచమునందు జనసంఖ్య అంతకుమించి వృద్ధియైనచో నన్నమునకు నుజలమునకును మహాభయంకరమైన కాటకము కలుగును. ఈసిద్ధాంతియొక్క మతానుసారము ప్రస్తుతము

వలెనే జనసంఖ్య వృద్ధియగుచు పోవుచెడల 300 సంవత్సరములలో ప్రపంచ జనసంఖ్య పైసంఖ్యనువిశేషముగ మీరిపోవునని తెలుచున్నది.

౨ 1924 మార్చి 31 వ తేదీ అఖరుకు భారతదేశములో 52, 111 మోటారుకారులును, 17, 250 మోటరుసైకిల్సును, 5, 121 మోటారు లారీలును దిగుమతియైయుండెను. గతమాసములోపలనే తిరిగి 7, 684 మోటారులును కోటిరూపాయల స్పేరు టైరులును విదేశములనుండి మనదేశములోనికి దిగుమతియైనవి.

౩. 1923 –24 సంవత్సరమున భారతదేశమునుండి విదేశములకు 33కోట్ల 87 లక్షల 55వేల పౌనుల తేయాకు ఎగుమతియైనది.

౪. 1923 – 24 నందు 47 లక్షల 40 వేల గ్యాలనుల సారాయి విదేశములనుండి మనదేశములో దిగుమతియైనది.

౫ 1923– 24 నందు 6 లక్షల 38 వేల టన్నులగోధుమలును 59 వేలటన్నుల గోదుమ పిండియు నితర దేశములకు యెగుమతి యైనది,

౬. అమెరికాయందు ఫోర్డు మోటారు కంపెని కలదు. అకంపెనివారికి గతవత్సరము అన్ని ఖర్చులుపోను 37 కోట్ల రూపాయల లాభము తేలినది.

౭. 1923 – 24 నందు భారత దేశములోనికి విదేశములనుండి 69, 700 టన్నుల కాగితము దిగుమతియైనది.

౮. వైజ్ఞానికు లొకవిధమగు రంగునుతయారు చేసిరి. అది గోడ్యలకుపూసిన యెడల నవి యగ్నిచే దహింపబడవు.

౯. గ్రేటుబ్రిటనులో తయారగు వస్తువులకు ఖ్యాతిగా కొనునది యమెరికాయును హిందూదేశమునైయున్నది.

౧౦. ప్రపంచ మొత్తముమీద నుత్పత్తియగుతేయాకులో సగభాగము కేవలము గ్రేటు బ్రిటనును ఐర్లాండును తీసికొనుచున్నవి.

౧౧. స్పైనుదేశములో 400 అడుగుల యెత్తుగల పుష్పకొండలు విశేషముగా నున్నవి.

౧౨. 50 డిగ్రీల వేడియును నుప్పదిదినముల వర్షమును గల్లుప్రదేశములయందు వరణ్యములు విస్తారముగా పెరుగును.

౧౩. ఇప్పటివలెనే కిరసనాయిలు ప్రతివర్షమునందుఖర్చగుచు పోయిన యెడల 20 సంవత్సరములలో ప్రపంచములోని కిరసనాయి అంతయు అయి పోవునని యొక విశేషజ్ఞు డూహించు చున్నాడు.

౧౪. పెన్సిల్ వేనియాయందు 40 వేల నూనెయూటలు 200 మైళ్ళ వైశాల్యముగల భూమియందు స్రవించు చున్నవి.

౧౫ ప్రపంచమొత్తముమీద పెట్రోలియం యెంత యుత్పన్నమగుచున్నదో అందు అర్ధాంశమునకు పైగా అమెరికాయందుత్పన్న మగుచున్నది.

౧౬. ఇంగ్లాండునందు మిష్టరుమాల్ కంబైపవేల్ అనువాతడొక మోటారు కారును తయారుచేయుచున్నాడట. అది ప్రతిగంటకు 180 మైళ్ళుపోవునదియు 700 గుర్రముల బలముకలది యగు ననియు చెప్పు చున్నారు.

X X X

## ౪. సమ్మోహనాస్త్రము.

వారన్ హేష్టింగ్సు కాలము నాటి నుండియు, భారతరాజనీతి క్షేత్రమున శాసన వ్యవస్థల యందెయే పరివర్తనములుకలుగు చుండెనో వాని యన్నిటితో పాటుమతీయొక వైపునవొక యమోఘపరివర్తనమొకట్లు చువచ్చుచుండెను. అది భారతదేశమున క్రైస్తవమత ప్రచారమై యున్నది. ఈపరిచారకార్యము క్రిమక్రమముగ బలీయమైనది. సమ్మోహ నాస్త్రమువలె నిది భారతజాతిని మోహముగ్ధమొనర్చివైచినది విషరస ప్రయోగమువమారణమొనర్పజాలువారలకన్న మధుర క్షీరదానమునవాతమొనర్పనెంచువారలు ప్రాయశః దతాకార్యమునసఫల మనోరథు లగుదురు. క్రైస్తవమతప్రచారకులీనీతి నేయవలంబించి మహమ్మదీయులు కృపాణమునసహితము హిందూదేశమునసాధింప జాలనివిజయమునుపొందవ గల్గిరి. ప్రతివత్సరమున 10

లక్షల మంది హైందవులు క్రైస్తవారాధకు లగు చుండిరన మీ రాశ్చర్యము చెందెదరు?

మన మంటరానివారని సంఘము నుండి తరిమి వేయు నిస్సహాయులగు యీ క్రైస్తవ సంఘములు విశాల హృదయమున నాశ్లేషించి శరణమిచ్చుచున్నవి. ఈ విధముగనె ముందు జరిగిన హిందూసంఘ మింకెంత కాలము పూర్ణమైయుండగలదు. సంఘ మర్యాదల నుల్లంఘించు నస్పృశ్య కారాధకుల ఈ క్రింది విషయముల గమనింపగోరెదము.

కొంతకాలము క్రిందటనె ఈ క్రైస్తవ ప్రచారకులు తమ ప్రచారవిభాగమున ముక్తిదళము(Salvation Creanf) అనునొక శాఖను స్థాపించిరి.

అప్పటినుండియు నీ శాఖ నిరంతరముగ కృషి చేయుచుండెను. కేవలమీ శాఖమాత్రమే ప్రచారకార్యము నెంతవరకు సాగించెనో యెరిగిన యెడల ఆశ్చర్యము కలుగకపోదు. వారి సాంవత్సరిక నివేదిక నుండియే యెత్తి భారతవర్షమున నీ ముక్తిదళము క్రిందియే యే సంస్థలెంతెంత కృషిసల్పినదియు, ఈ క్రింద పొందు పరచుచున్నాము.

i. ౫ ప్రాంతిక సేనాపతులుకలరు. వీరు 11 భాషల యందు ప్రచారముసల్పుచురు.

ii. ౪౯౬౫ ప్రచారకేంద్రములుకలవు

iii. ౩౦౭ మంది యూరోపియన్ ఆఫీసరులు నాయకులు కలరు.

iv. ౨౫౯౯ దేశీయప్రచారకయోధులుకలరు.

v. ౩౩౩౭ ఈ శిక్షకులును ఇతరోద్యోగులును గలరు.

vi. ౫౦౭ ప్రైమరీ పాఠశాలలుగలవు.

vii. ౧౮౭౯౫ మంది విద్యార్థులు ఈపాఠశాలలో విద్య నభ్యసించుచుండిరి.

viii. ౨౨ వసతిగృహములు(Boarding-houses) కలవు. అందు ౯౫౫ మంది విద్యార్థులు నివసించు చుండిరి.

ix. ౩౫ భిక్షుక శరణాలయములుకలవు. అందుసదివేల మంది శరణ్యమును పొందు చున్నారు.

x. ౧౭ ఇతర శరణాలయములును కలవు. వాని క్రింద మొత్తముమీద ౩౨౮౭౦ ఎకరముల భూమి యున్నది.

xi. పతితస్త్రీలకొరకు ౫౩ ప్రవేశగృహములున్నవి. ఇందు ఇరువది మంది పతితలు శరణ్యమును శిక్షను పొందుచున్నారు.

xii. బాల్గు శిక్షాగృహములు గలవు. ఇందు ౨౫౦ మంది మనుష్యులుండిరి.

xiii. ౨ సివిలు మిలటరీ గృహములు కలవు. అందు ౧౦౦ మంది యుండిరి.

xiv. ౪ గృహములు నిరాశ్రయులగు యూరోపియనుల కొరకు గలవు. ఇందు ౮౫ గురు నివసించు చుండిరి.

xv. ౪ పెద్దవియు ౫ చిన్నవియును అస్పత్రులుకలవు. మరియు ౫ చిన్న శస్త్రచికిత్సాలయములును గలవు. వీనియందు ౫౦, ౦౦౦ మందిరోగులౌషధసేవను పొందుచున్నారు.

xvi. ఋణములిచ్చుటకు ౮ బ్యాంకులు కలవు.

xvii. ఒక కీతపత్రికమాలయమును ౩౦ చిన్నదాలుతీయు యంత్రశాలలును గలవు.

xviii. ౯ ఉద్యోగుల వసతిగృహాలు గలవు. వానియందు ౩౮౦మంది నివసించుచున్నారు.

xix. ౧౧ మాసిక, సాప్తాహిక, పాక్షికపత్రికలు కలవు. ప్రతి పత్రికయును ౭ భాషలలో ప్రకటింపబడు చున్నది. ఒక్కొక్క దానికి ౧౫ వేలమందిపాఠకులు గలరు.

xx. ౫౯౭ సేవాసంస్థలుకలవు. వీనిద్వారా ౨౯, ౮౦౩౮ మనుష్యులకుపరిచర్యచేయబడుచున్నది. హైందవసంఘవృద్ధి నాశించు మహాశయు

ఎల్లరు పై యంశముల శ్రద్ధధానులై గమ
నింతురుగాక !

X X X

## ౫. భారతదేశమునందు శ్వేత సైనికులు.

భారతదేశము యొక్క ఖజానానుండి సైన్యపోషణనిమిత్తము యెంతటి ద్రవ్యమధికవ్యయ మొనర్పబడుచున్నదో అవిషయమునుగూర్చి పత్రికాలోకమున నెంతటి సంచలనము గల్గినదియు మన మెరింగియే యున్నారు.

ఈదిగువ నుదాహరింపబడు సంఖ్యల బరిశీలించిన హిందూ సైనికు లెందరుండిరో శ్వేతసైనికు లెందరుండిరో తెల్లము కాగలదు. అంతియేగాక హిందూసైనికుల సంఖ్య తగ్గినయెడల ఆలోపమును పూర్తిచేయు విషయమున నెంతటిశ్రద్ధ చూపబడుచున్నదియుగూడ విశదము కాగలదు.

| సంవత్సరము. | శ్వేతసైనికులు. | హిందూసైనికులు. |
|---|---|---|
| 1919 | 68,989 | 2,28,295 |
| 1920 | 69,926 | 2,58,455 |
| 1921 | 69,559 | 1,50,822 |
| 1922 | 68,411 | 1,44,615 |
| 1923 | 68,568 | 1,48,446 |
| 1924 | 60,514 | 1,37.088 |

### నూటికి లెక్కమిూద వ్యత్యాసము.

| | | |
|---|---|---|
| 1919 | 27 | 73 |
| 1920 | 21 | 79 |
| 1921 | 32 | 68 |
| 1922 | ,, | ,, |
| 1923 | ,, | ,, |
| 1924 | 31 | 69 |

పైలెక్కలు, పార్లమెంటునందు జాన్ వేకేట్ గారిచే ప్రశ్నింప బడినపుడు హిందూదేశముయొక్క యుపమంత్రియగు వింటర్టన్ గారు ప్రత్యుత్తర మిచ్చుచు నెదుట బెట్టినవి.

ఇక నీయుభయసైనికుల వేతనముల మధ్యగల యంతరమునుబట్టి హిందూసైనికుల నపేక్షించి శ్వేత సైనికులక్రింద యెంతటి ధన మధికముగా ఖర్చుపెట్టబడుచున్నదో యూహించుకొనవచ్చును.

X X X

## హిందూదేశ వ్యాపారము.

భారతవర్షము ముడివస్తువులకు వ్యాపారమున పెట్టినదిపేరు. విదేశములకు ముడివస్తువులు పంపబడి తయారయిన వస్తువులు తిరిగి యీదేశమునకు తెప్పించుకొనబడుచున్నవి. ఖాద్యపదార్థములుగాక, నార, ఉన్ని, చర్మము, మొదలగు వస్తువులెక్కువగా ఎగుమతి యగుచుండును. హిందూదేశముయొక్క వ్యాపారము ఎక్కువగా గ్రేటుబ్రిటను, ఇంగ్లాండు దేశములతో సాగుచుండును. అయినను ఇతరదేశములతోటి చేయు వ్యాపారముకూడ ఏమాత్రమును తక్కువైనదికాదు. ప్రతి నూటికి యెన్ని గుణములు హెచ్చుతగ్గుగా, ఇతరదేశములతోటి మనదేశము వ్యాపారము చేయుచున్నదియు ఈక్రింద చూపబడుచున్నది.

| దేశము | నూటిలో |
|---|---|
| బ్రిటీషుద్వీపములు | 57.8 |
| జర్మనీ | 5.2 |
| జావా (శర్కర) | 90.0 |
| జపాను | 6.1 |
| అమెరికా | 5.7 |
| బెల్జియం | 2.4 |
| ఫ్రాన్సు | 1.0 |
| ఇటలీ | 1.0 |
| హాలెండు | 1.0 |

అయిరోపా మహాయుద్ధమునకు పూర్వము జర్మనీ దేశములతో హిందూదేశ మెక్కువగా వ్యాపారము చేయుచుండెడిది. కానియీలోపుగా భారతవర్షమునకు స్వాత

లంబనము మితివ్యయము బాగుగా నర్థమైనకారణమున విదేశములతో వ్యాపారము కొంచెము తగ్గిచు కొనినది. ఇండియన్ ట్రేడ్ కమిషనరగు మిష్టర్ లిండ్జెగారు, మూల్యాధికములగు వస్తువులను హిందూ దేశమిప్పుడు స్వల్పముగా కొనుచున్నదనియు, ఏకారణమున, నింగ్లాండు నెక్కువ విలువగల వస్తువులను తయారు చేయుచుండుటచే నింగ్లాండుతో భారత దేశముయొక్క వ్యాపారము సన్నగిల్లి పోవుచున్నదనియు చెప్పుచున్నారు. పూర్వమింగ్లాండు నుంచి నూటిలో 36. 8 గుణములుగా వచ్చుచుండెడి మల్లుబట్టలు మహాయుద్ధానంతరము 268 % లో నిలిచిపోయెను. ఈ విధముగానే ఉక్కు, యినుము, రైలు సామానుల యందుగూడ కొంతకాకున్న కొంతయైన తగ్గుదల కన్పడుచున్నది కేవలమొక్క మిషనరీ 4. 2 % నుండి 8. 4 % అయినది. కాని ఇంగ్లాండు నుండి బట్ట యెంతతక్కువగా వచ్చుచున్నదో అంత యెక్కువగా జపాను దేశమునుండి నేడు మనదేశమునకు వచ్చుచున్నది. మిషనరీ వ్యాపారము అమెరికాయును, రైలుసామాను జర్మనీయును, లోహము జపానును వెనుకటికన్న వృద్ధిచేసినవి.

మహాయుద్ధమునకు పూర్వము భారతదేశ వ్యాపారము యావత్తును 429 కోట్లు అయియుండెను. కాని 1924 నందు ఇచ్చటినుండి 383 కోట్లవిలువగల వస్తువులు ఎగుమతి కాబడినవి; తిరిగి 244 కోట్లవస్తువులు దిగుమతియైనవి; అనగా వ్యాపారమొత్తము 627 కోట్లుఅయినది, మొత్తముమీద నూటికి 46 గుణములు వృద్ధియైనది. 1920 సంవత్సరమున విదేశముల నుండి భారతదేశమునకు చాలఎక్కువ విలువగల వస్తువులు వచ్చినవి. కాని తిరిగి వ్యాపారము 244 కోట్లమీదనిల్వబడి యుండెను.

ఇది యంతయుసరే. కానియీ వ్యాపారమున భారతదేశమునకు కల్గిన లాభమేమి? యని విచారింపవలెను. బుభుక్షా పీడితులగు ఏదేశవాసుల కీసంఖ్య అనుదెల్పిన ఆకలితీరదు. ఏ దేశముయొక్క సంతానమునకు గాని, ఎప్పుడు, ఆదేశమువం దుత్పన్నమగునన్న ఖాద్యపదార్థము లాస్థలవాసుల యవసరములు సంపూర్తిగ తీరుపజాలి యింకను మిగిలినవి యితరదేశములకు బంపబడి, దానికిబదులుగా నిందులభ్యములుకాని జీవితోపయుక్తములగు వస్తువులు తెప్పించుకొనబడునో, అప్పుడే, నిజమగురక్ష కల్గును.

వ్యాపారులెల్లరీవిషయమును జాగరూకతతో గమనింపవలసియున్నది. భారతవాసులు తమవిలాసతమకొద్దికాలము త్యాగమొనర్చి కేవలముఆవశ్యకములును జీవనోపయోగములు నగువస్తువులతోడనే సంతృప్తిపడినచో విదేశములనుండి వచ్చునుపయోగములును విలాసార్థములునగు నధికమూల్యములగు వస్తువుల దిగుమతి మనదేశమున తగ్గిపోవగలదు. మఱియునీవిధముగాకూర్చబడిన ధనము నితరసమావశ్యకములగు కార్యములకై వినియోగించు కొనవచ్చును.

X X X

## ౭. స్త్రీ పురుషుడగుట.

కాన్స్టాంటు నోపిలునుండి "బాంబే క్రానికలు" యొక్కవిలేఖరి ఈక్రింద విచిత్రవృత్తాంతము నుపంపియున్నాడు.

ఆటోలియా పట్టణములో సయామిహానూంఅను 20 సంవత్సరముల వయస్సుగల యొక మహమ్మదీయ స్త్రీ బాలికా పాఠశాలయందు ప్రధానోపాధ్యాయినిగ నుండెను. ఆమెతనకు 14 యేండ్ల నుండియును తనశరీరముమీద పురుషాంగములు వృద్ధియగు చున్నటుల కనుగొనెను. తలిదండ్రులెంత బలవంతపెట్టినను వివాహముచేసికొనలేదు. కారణముతాను స్త్రీ కాదను కొనుట చేతనే.

ఆమె తనబాల్యము నుండియు బాలురతోడనే యాడుకొనుచు వారితోనే కలిసిమెలసి యుండుటకు నెక్కువయిష్టము కనబరచు చుండెడిది. మగవారివలెనే సంచరించు చుండెడిది. 14 వత్సరములపై బడినను రొమ్ము రాకుండెను. తలిదండ్రులు వైద్యులకుజూపించిరి. అదివారు శరీరదౌర్బల్యమని చెప్పిరి. కాని ఎంతమందియో యీమెను వివాహమాడ యాశిం-

చున్నది. అంతటిని తాను పరిత్యాగరించినది. ఇంటిలో మీసముగడ్డముత్పత్తి ఆరంభమాయెను. ఏమి చేయును. రహస్యముగా గొరుగుకొని పైకిరాకుండ చేసికొని నిత్యము స్త్రీవలెకన్పించు తంటాలు పడుచుండెను పిచ్చిపిట్ట. తాను మగవాడగా ఆడుదానగా అని లోలోపల కుమిలిపోవు చుండెను.

ఇట్టిస్థితిలో మొన్నజూన్ 18 వ తేదీని డాక్టరులందఱు ఆమెనుపరీక్షించి నిశ్చయముగ పురుషుడు అనియారోగ్యతా పత్రమునిచ్చిరట.

ఇప్పుడు సయామిహానూం సయాంబే అయి తన జీవితచరిత్రను పత్రికలకు వ్రాయుచుండెను.

ఇప్పుడితనిచుట్టు నకేకులుతిరుగు చున్నారు. యువకులువచ్చి స్త్రీలరహస్యములను వారి స్వభావములను ఇచ్ఛలనుతెల్పుమనియు, కన్యలువచ్చి సహజముగ పురుషులకుండు భావమేదని కుండదని చనువున మట్టుమాగినమ్మనివాహమాడెదవాయనియు నడుగనుద్యుక్తులగు చున్నారు; ఒక భాగ్యవంతుని కుమార్తె తనను వివాహమాడుమని సయాంబేకు ఉత్తరము వ్రాసినదట.

స్త్రీజాతికిని పురుషజాతికిని సమన్వయముగా వ్యవహరించిన సౌమ్యమూర్తిగా సయాంబే మన్నింపబడుచేసెనా.

### సయాంబే స్త్రీలకు జేయుచున్న బోధ.

“మగవారితో వైరముపెట్టుకొనకుండనుండుట కష్టమని నాకుతెలియును. అయినను వారితో పోట్లాటలు పెట్టుకొనవలదు.”

### అతడుపురుషుల కొసగిన ఉపదేశము.

“బాలికలను వారిజీవితములను పాతివ్రత్యమును చెడగొట్టి నాశనింపకుడు.”

ఈవిచిత్ర పరివర్తనమునుగూర్చి ఏమనుకొనవలెను? పుట్టుకనుండియు స్త్రీపురుషాంగములు కలసియుండి కొంతకాలమునకు పురుషాంగములు వృద్ధినొందియుండు ఇట్లగుట పూర్వము మహమ్మదీయ భిషక్కులు కనిపెట్టియున్నారు. వారువారియందే వంటి వారలనప్పుడు “ఖూన్సి ముష్కిల్” అనిపిలిచెడివారట.

X X X

### ౮. నాగులలోని ఘోరాచారములు.

మణిపురపు కొండలపైన నాగులను జాతులవారు నివసించుచుందురు. ఈప్రాంతములలో వీరసుమారు లక్షమందియుండిరి. వీరలలో మనుష్యులను బలులుగా నిచ్చియిచ్చు నాచారము పారంపరముగ వచ్చుచుండెడిది. ఇప్పుడీయాచారమంతగా యున్నట్లగుపడదు. కాని మనుష్యులబలియిచ్చు ఘోరాచారమిప్పటికిని ప్రబలియున్నది. ఈనాగులలో జమీందారీ పాయిదా వాడొకడుచనిపోయిన పక్షమున వానికర్మ చేయునపుడొక మనుష్యునిచంపి వానిపుఱ్ఱెను తీసుకొనివత్తురు.

ఎవరితోనైన వివాదమువచ్చిన వారితలలు నరికించెదరు.

వీరుపంటలు బాగుగ పండుటకును రోగములు రాకుండుటకును నరబలులనిత్తురు. ఇందునిమిత్తమై వీరుమనుష్యులను కొనుక్కొనివత్తురు. బలినిమిత్తమైకొను మనుష్యుల కొక్కొకనికొఱకు వీరు 500 రూప్యములు ఇయ్యవలసియుండును. లేదా మనుష్యుల దొంగిలించియైనదెత్తురు. బలియిచ్చుటకుముందు పదునైదు దినములనుండియు బలియగువానికి ఇష్టముగ సారాయిమిప్పించి మత్తుపూర్తిగ నెక్కునట్లు చేయుదురు. తరువాతచివర దివసమున తీసికొని పోయి శిరఃఖండన మొనర్తురు. ఆసమయమున రుధిరము చిందిమెట్లపై బడుట శుభచిహ్నమనివారు భావింతురు. తలకోసినమీద యాశవమును ఛిన్నభిన్నములుగ ఖండించి గ్రామస్థులెల్లరు తలయొక ముక్కను తీసికొనిపోయి ఇండ్లలోను, పొలములలోను, యూరివెలుపలను కట్టుకొందురు. ఇప్పటికినివీరు బానిసల నుంచుకొను నాచారమున్నది.

X X X

### ౯. వన్యమందు.

సంస్కృత సాహిత్యమునందు నల్లమందు

రూపాయి యొక్క వెలతరువాత నిచ్చుట హెచ్చినది. ఆకారణమున 1922, 23, 24 లలోవచ్చినబంగారమునకు 114 కోట్ల రూప్యము లొసగబడినవి.

1911, 12, 13 సం॥ లలోవచ్చిన వెండి 6,60,00,000 ఔన్సులు. దీనిమూల్యము 11 కోట్ల రూప్యములకు కొంచెముతక్కువ. కాని, 1922,23,24 సం॥ లో 26, 50,00,000 ఔన్సులకుఅధికముగావచ్చినది, దానిమూల్యము 55 కోట్లరూపాయలు.

దీనినిబట్టి చూడగా మహా యుద్ధానంతరము స్వర్ణ రజిత వ్యాపారము చాలవృద్ధియైనట్లు తోచుచున్నది. ఈదిగువ ఎగుమతి దిగుమతుల యొక్క సూచిక యొసగబడుచున్నది. 1921 కి ముందటిదిగా సూచింపబడు సంకములు మహా యుద్ధముయొక్క 5 వర్షముల మొత్తముమీద. ఈ అంకెలు అన్నియు నూరింటు నవనియు తెలియునది.

| 5 సం॥ లు. | 1921 | 1922 | 1923 | 1924 |
|---|---|---|---|---|
| ఎగుమతి 1490పౌ. | 1620పౌ. | 1960పౌ. | 2280పౌ. | 2980పౌ. |
| ఎగుమతి 970 | 1850 | 15·0 | 1450 | 1360 |
| + 520 | − 230 | + 390 | + 830 | + 720 |

దీనినిబట్టి యుద్ధమునకు పూర్వము దిగుమతి కన్న ఎగుమతి 5, 20, 00, 000 పౌన్లు అధికమని కన్పడుచున్నది. కాని 1922లో దిగుమతికన్న ఎగుమతి 3, 30, 00, 000పౌన్లు అధికమైనది.

అంచనావేసిచూడగా యుద్ధమునకు పూర్వము స్వర్ణ రజిత వ్యాపారమున భారతదేశము ఖర్చుపెట్టిన దానికన్న ఇప్పుడు ఖర్చుపెట్టుచున్న ద్రవ్యము చాల తక్కువని తేలినది.

# గ్రంథపరిచయము.

:o:

ఈక్రింది గ్రంథములు విమర్శనార్థము మాకార్యాలయమునకు పంపబడినవి. కృతజ్ఞతతో స్వీకరించినాము.

౧. పాపాయి.

నాళము కృష్ణరావు గారి నతిపరిచయముతో నతిస్నేహముతో నెఱిగిన వారు మాత్రము వారి 'పాపాయి, యను శోకగీతికలను ఆను కంపముతో అందుకొని చదువగలరు. ఆనందింపగలరు స్వర్గస్థులైన వీరేశలింగము పంతులుగారికి కొంతకాలము కుడిభుజమైయుండిన వీరిని — రాజమహేంద్రవరమున గౌతమీగ్రంథాలయ స్థాపకులలో ముఖ్యులయిన వీరిని యెఱుంగని యాంధ్రులు ఎందరో యుండరని మావిశ్వాసము. కృష్ణరావునకుపుత్రప్రేమ మెంతయుండెనో అది యెంత యావేగముతో వారిని కలచివైచెనో, యెంత యుత్కృష్టముగ వారిని కవిత్వమీ "పాపాయి" యందు రసస్ఫూర్తి గాంచినట్లు గావించుచున్నది. కవిత్వమును నిర్వచించునపుడు కలుగుతొట్రుపాటి గ్రంథమును పరిశీలించినపుడు మనకు గలుగ బనిలేదు. ఈకవితాసనపరతము,లో తెలుగని పుత్రప్రేమావేశముతో నల్లారుముద్దుగ పెంచిన సుతుడు, సంకశర్తయై, తనకును, అన్వయమునకును కీర్తి తేగల ధీశాలియైన కుమారుడు ఒక్కనాడకస్మాత్తుగ తన భౌతిక కాయమును వీడి చని నపుడొదవెరుగని దుఃఖావేశముతో. శోకగీతములను రచించినారు. ఇందు జనకుని దుఃఖమును, కవిత్వమునుకూడ నేక కాలమున రసస్ఫూర్తిబొంది చదువరిని పరవశునిగా చేయుచున్నవి. మనభాషలోనిట్టి కవిత్వపు పోకడలుకడుస్వల్పములు. అన్నియయుకూడ సాధునికముతేయగును. ప్రాచీన

కాలలో నిప్పటికి నిలిచియున్నది కృష్ణదేవరాయని నిర్యాణస్మారకచిహ్నమైన పెద్దనగారి చాటుపద్యము. ఆరీతిని రచింపబడిన గీతికలాంధ్రి భాషయందు గాన రావు కావున పెద్దనగారి దుఃఖమింకను మనచెవు లందు ప్రతిధ్వనించు చున్నది.

మన కృష్ణరాయని సుతస్మృతియు సాఫల్య మున్నట్లు మావిశ్వాసము. ఇందు కవికి పుత్రప్రేమాము గోదావరీ ప్రవాహమట్లు పొంగి పొరలి నిండార బారుచున్నది. ఇందు నిజమైన కవిత్వమున్నది. రస మున్నది. ఈతని కవిత్వమిందు పాకమున బడినట్లు ఎచటను బడియుండలేదు. చూడుడు కవి పుత్రుని మరణమును దలచికొనినపుడు

"మింటనొకసారి తళుకున మెఱపు మెఱసి
అంతత్రుటిలోన యదృశ్య మైనయట్లు,,

యనిపించినాడు ... ...

"శ్రుతుల సమ్మేళనము జేసి సొంపుమీఱ
"రాగమాల పింపగ వీణ బ్రద్దలయ్యె,,

నవి వ్రాసిన పంక్తులు మనహృదయమును గూడ బీటలువారించు చున్నవి. ఆసందర్భమున కవి వ్రాసిన పద్యములు చదువుడు. కవియే తనదుఃఖమును భుజింపజాలక జీవచ్ఛవమయినాడు.

"ఒక్కతరికన్నుమూయుమఱొక్కయెడను
కనులనఱవిచ్చి వెడవెడగాంతు బయట
"పగలురేయియు నాపాలి పగలెయయ్యె"

అందుచేత నాతడు అనినాడు. ఒంటిపాటున నున్న వేళ దుఃఖమాపు కొనలేక

వెల్లివిరియుచు తీరంబు పెల్లగించి
వఱ్ఱులూన్చుచు పాఱు ప్రవాహమునగ
నిండిని బిడీకృతంబయి గుండెచీల్చి
పొంగిపొరలెడి ... ... ..."

అని యేడ్చినాడు. కవికి పుత్రమోహమున వియోగ దుఃఖమెంతో, జ్ఞానదృష్టియు నంతే. కావునసే

"చీకి దేహంబు శిథిలంబు గాకయున్న
"బుధుడు సాధింప గాదగుముక్తి ఫలము

అనినిశ్చ యించుకొని

"దేహమెన్నగ గాలిలో దీపకళిక
"కలలలోవలి ముచ్చటల్ కలసుఖములు
"పుత్రసంగతి తెరలోని బొమ్మలాట

యని తెలుసుకొన్నాడు. అట్లుతెలివి గలవాడై

నేడునన్ను కాపాడుకోలేని వాడ
వానిగాపాడ నేర్తునె; కానసీవె
చెంతజేరిచి వాని రక్షింపవయ్యా!

యనియాత్మశాంతి బొంది పరమేశ్వరుని

"...నాకూర్మి సుతునియాత్మ
కవ్యయానంద సౌఖ్యంబు, నమలమైన
శాంతి నొసంగుము...
మాగుడ జన్మంబులేక మనుపుమయ్య."

అనుచుదీనుడై వేడు కొన్నాడు. మనకవి, పుత్రవియోగ దుఃఖమును బాపుకొనుటకై వ్రాసిన యీపాటలు ఆంధ్రభాషకమూల్య రత్నమై యల రారుచు, కవికి సంతతానందాయియై పుత్రుడులేని కొరంత దీర్పగలదని మావిశ్వాసము, భా॥ వేం॥ కృ॥

### ౨. శ్రీనివాస శతకము.

గ్రంథకర్త కో॥ శ్రీనివాసరావుగారు. శైలి మృదుమధురము. నీతిదాయకమైన పద్యములతో నొప్పారుచున్నది. చూడుడు.

"చిన్ననాడి గ్రుచ్చుకొన్నమాత్రంబున
సెంతబాధపెట్టి యేడిపించు
నిందు ప్రాణంబట్టి ఖండించుచున్నప్పుడు
దానికెంతబాధ! శ్రీనివాస!"

గ్రంథకర్త పేరరాజ మహేంద్రవరము వ్రాసినబడయ గలరు.

### 3 పోతన వేమనల యుగము.

వ్యాసకర్త దిగవల్లి వెంకట శివరావు గారు.
బి. ఏ. బి. యల్

ఇది చెన్నపురి రాజధాని కళాశాలవారి 1922
౪

సంవత్సరపు పవెల్ అండుహూర్ హెడ్ బహుమానము (రు 150లు) పొందిన ఆంధ్రవ్యాసము. వెల 0—8—0

౮. అభినవ భర్తృహరి (సుభాషితము) వెల 0 8 0

౯. ప్రతిజ్ఞాచాణక్యము (నాటకము) 1—0—0

అభినవభర్తృహరి శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రులవారి, సుభాషిత తారావళి సుభాషిత రత్నాకరము, సుభాషిత రత్నభాండాగారము మొదలగు గ్రంథములనుండి క్రోడీకృతములగుశ్లోకములకు తెనుగు. శైలి మంచిది. ప్రతిజ్ఞా చాణక్యము సుప్రసిద్ధ వంగనాటక కారుడగు శ్రీ ద్విజేంద్రలాల్ రాయిగారి చంద్రగుప్తము ఆధారముగాగొని యిప్పటికిని స్వతంత్రములగు పోకడలు గాన్పించుచున్నవి. మార్పులనేకములు గలవు. చంద్రగుప్త (మూల మున్న)కును దీనికిని పోలిక యేకొన్నితావుల తప్ప, యెక్కువగాలేదు. ఎక్కుడు భాగము భాషాంతరీకరణమువలె గన్పట్టినను భావవ్యక్తీకరణమున మూలమునకును దీనికిని చాలవ్యత్యాసముగన్పడు చున్నది. దీనినిబట్టి ఈగ్రంథము అనువాదమను కొనరాదు. స్వతంత్రముగ మూలమునందలికథను ఊహాలను తీసికొని వ్రాసినది. కావున నే శైలిధారాళమై, నటులకభినయవేళల యందుచ్చారణ సౌలభ్యమును మిక్కిలిగ గూర్చుచున్నది.

శైలికి ఒకపద్యము,

"వజ్రఖని, ద్రవీభూతమై ప్రస్రవించె,
గండశైలంబు చిగిరించె, గగనవీధి
చూడసొంపుగ పుష్పించె, శూన్యమైన
కఠిన మరుభూమిఁ బాఱెగంగా స్రవంతి"

౧౦. వీరప్రతాప్.

గ్రంథకర్త:—

అవటపల్లె హనుమంతరావుగారు.

ఇది ౫ అంకముల విషాదాంత నాటకము. మాథ్యూ ఆర్నాల్డ్ వ్రాసిన సోహ్ రబ్ రస్తుం" అనుపద్యకావ్యమునందలికథ నాధారముగాగొనియీనాటకము వ్రాయబడినది. ఈకథపరిష్కారదేశముదెక్కయొక్క పూర్వగాథ. వీరరౌద్రముల యుద్వేలమును ప్రదర్శించుట కీగాథయందు ధవకాశము మిక్కిలియుగలదు. ఈనాటకకవి ఈగాథ నాలంబనముగగొనినను దేశకాల పాత్రముల ననుసరించియునదేశపరిస్థితులకు ననుకూలముగ కథానకము నాంధ్రీస్యమొనర్చి యాంధ్రీకరించినాడు. భావ్యాంధ్రి సంతానము వీరసింహుని తన పూర్వీకునిగా జెప్పికొని గర్వింపనెంచితీరుదని మావిశ్వాసము. ఆంధ్రగౌరవస్మృతికి ఈనాటకకవి గొప్పయుపాధి నొసంగినాడు. గుణభూములకు నవచి పోగొట్టుకున్నను మనయాంధ్రదేశీయమగుపూర్వచరిత్రము, శిల్పమును, సాహిత్యమును సముద్ధారముగ గ్రహింపవలెను. ప్రదర్శింపవలెను. సమాజశిక్షకమోఘసాధనములగు నీనాటకము లింతవరకును మనపారస్వతమున నవ్యజాతి గౌరవప్రదర్శకము లేయగుటయు, నాంధ్రీదేశయశోగీతములనొరిత్రివర్గము సమున్నత్యర్ధ మొనర్చు నాంధ్రీయ నాటకము లవతరింపనియు స్థితిలో నీకవిసంఘు సంచల నాత్మకమగునిట్టి యుత్కృష్ట రూపము నాంధ్రస్య మొనర్చి ప్రకటించుట ప్రశంసనీయము.

వ్యాకరణ విశిష్టమును, భావభావానుగమ్యమగు శైలియెంతయు నొప్పుచున్నది. శైలికి

"అరిరాజన్య భయంకరుండనయి నే
నాంధ్రావనిన్ గ్రుమ్మరన్
సిరమెత్తన్ జవలేని భీతహృదయుల్
జీవంబులందాసచే
వరనిర్గమ్యవన ప్రదేశముల నుం
డన్ నేడటుల్ శ్వానముల్
దెరువంబడ్డ గృహంబు జొచ్చువిధిదో
తేరం జలంబూనికో"

ఆంధ్రరంగమున నిద్దృశ్య కావ్యము విశేష వ్యాప్తిగాంచుగాక! ఈనాటకమును గ్రంథకర్తగారి పేరమదిలిపట్టణమునకు వ్రాసిబడయగలరు. వెల 1 0 0

౭. చంద్రగుప్త.
౮. జగన్నాథమాహాత్మ్యము.
౯. క్రొత్తయల్లుడు.

అభినవాంధ్ర గ్రంథమాల - (రాజమండ్రి) వారిచే ప్రకటింపబడినవి.

జగన్నాథమాహాత్మ్యము కూరయామాత్య ప్రణీత పద్యకావ్యము. మృదుమధురమైన శైలికల్గియొప్పు చున్నది. క్రొత్తయల్లుడు. ఇది శ్రీపాద కామేశ్వరరావుగారు వంగభాషలోని 'శేచీకు' ననుసరించి వ్రాసిన ప్రహసనము. చాల నవ్వువచ్చును.

చంద్రగుప్త. ఇదియు శ్రీపాద కామేశ్వరరావుగారు వ్రాసిన గద్యనాటకము. "ద్విజేంద్రలాల్ రాయనివంగ నాటకమునకు తెనుగు" ద్విజేంద్రలాల్ రాయిగారు 16 గద్యనాటకములను వ్రాసినట్లు ప్రకాశకులు పీఠికలో వ్రాసిరి.

"అనువాదములు మూలగ్రంథ రచనకు ముందు మెట్టు." అనేక సుప్రసిద్ధ నాటకకవుల గ్రంథములు మన భాషలోనికి రావలసియున్నది. ఈవిషయమున వీరియుద్యమము ప్రశంసనీయము.

౧౦. బాలనీతి రత్నావళి.

గ్రంథకర్త. చాగంటి వీరభద్రకవి. ఇందు చిన్నపిల్లలకు నీతిదాయకములగు పద్యములు చాల కలవు అన్నియు నందములగు కంద పద్యములు. చూడుడు,

కం॥ చిరునగవు నెమ్మొగంబున
వరలంగా సఖులతోడ పలుకగ వలయున్
చిరచిరలాడుట వైరము
నెఱపుటయును కానిపనులు నేరకుతనయా,
"విలువయగు కాలమెల్లను
ఫల శూన్యములైన పరుష వాక్కుల యందున్]
దీలువల చెలికారంబున
నిలవ్యర్థము సేయబోకు మెన్నడు తనయా

బాలభారతీముద్రాక్షరశాల, రాజమహేంద్రవరమునకు వ్రాసినప్రతులు దొరకును.

౧౧ శ్రీచాణక్యనీతిదర్పణము.

అనువాదకుడు. మండికొండ కోటయ్య శాస్త్రిగారు.

నీతియందు చాణక్యనిబుద్ధియు ప్రతిమానమనుట జగద్విదితము. అతడు గీర్వాణభాషలో నీతిశాస్త్రమును రచించియుండెను. దానికినిది యాంధ్రీకరణము లలితములగు గీతపద్యములందు యొప్పారుచున్నది. కొన్నిటి నిదిగువ నుదహరించుచున్నాము.

"ప్రళయ మందైన సజ్జనుల్ పాపభీతి
ధర్మముల వీడజాలరు దానలోక
మునకు జేకుఱు శుభములు గనుక జగతి
సుజనులను రక్షచేయ భూభుజుల కగును"
"ఖలునికంటెను సర్పంబు ఘనమెయగును
కాలమూనన్న మైనప్డు కరచునరుని
ప్రతి పదంబున నీచులు బాధపరచి
సజ్జనుల జంపుదురుగాన సర్వవిధుల"

పాఠశాలలయందు చిన్నపిల్లలకు పఠనీయగ్రంథముగా నుంపతగినది. ఇలయూవారు ఆంధ్రగ్రంథ రత్న భాండాగారము, ఈమని, అని వ్రాసుకొన వలెను.

౧౨. శ్రీవివేకానందస్వామి వారిద్వాదశోపన్యాసములు,

౧౩. శ్రీ వివేకానంద స్వామివారి పురాణోపన్యాస చతుష్కము.

ఈరెండు గ్రంథములను పూడి నరసింహముగారిచే నాంధ్రీకరింపబడిన వివేకానందుని యుపన్యాసములు.

వివేకానందుని యమృత వాక్యముల నాకర్ణించు భాగ్యము ఆంధ్ర సంఘమునకు లభించియుండలేదు. ఏకొలదిమంది ఆంగ్ల విద్యాధికులకో తప్ప తదితరులకు వివేకానందుని మహాబోధనలు దుర్లభములైయుండెను. ఆకొరతను దీర్చిన నరసింహముగారు ధన్యులు.

గ్రంథములు గ్రంథకర్తగారిచేత పిఠాపురమునకు వ్రాసిన దొరకును.

౧౮ జీవబ్రహ్మైక్య వేదాంత రహస్యము.

ఇది 700 పుటలుగల గొప్ప వేదాంతగ్రంథము. శ్రీ పరమహంస సచ్చిదానంద యోగీశ్వరులవారిచే రచింపబడినది. సుబోధమును క్లిష్టమునుగాని ఆంధ్రవచనమున సిశాస్త్రముగా వ్రాయబడినది. శరీరశాస్త్రమునకు సంబంధించిన చిత్రపటములు, త్రివర్ణ చిత్రపటములు, రేఖా చిత్రములు, చాలగల్గిఎంతయు మనోహరముగ నున్నది. వెలయువారు డి. అ. రాజగోపాలు ౪౦ పెసివారికి వ్రాసినదొరకును.

౧౯. జాతీయ విద్య.

గ్రంథకర్త గుళ్ళపల్లి రామకృష్ణయ్యగారు.

ఇదిగుంటూరు మండలవిద్యా పరిషత్తువారిచే ప్రకటితమైనది. శ్రీదేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులువారు ప్రస్తావనను వ్రాసియున్నారు.

జాతీయవిద్య నభ్యసించుట కెందరో ఆతురు లగుచున్నను, "జాతీయవిద్యయిట్టిది; యిట్టివిద్య నభ్యసింపవలెను." అని యొక విధానము నేటివరకునిర్ణయ రూపమునవచ్చి యుండలేదు. ఆలోటునకు తీర్పు ప్రస్తుత మిందు సమర్థముగ చేయ బడినది. ఇందు, 1. జాతీయవిద్య, 2. విద్యాలక్ష్యము, 3. శిక్షాక్రమము, 4. గురుసంప్రదాయము, 5. పఠనీయములు. 6. పాఠశాలలు, 7. ప్రాథమికవిద్య, 8. యౌవనవిద్య, 9. వృత్తివిద్యలు, 10. శాస్త్రవిద్య, 11. స్త్రీవిద్య ఈయంశములు సంప్రతింప బడినవి.

గ్రంథాంతమున జాతీయ విద్యాప్రచారము చేయ కొన్ని సూచనలు వీరు గావించిరి. అందు విద్యావ్యాసములను గ్రంథరూపమున నీక్రిందియంశము లపై ప్రకటించుట అవసరమని వారు సూచించిరి.

1. గ్రామ నిర్మాణము, గ్రామారోగ్యము, గ్రామ విద్యాలయము.
2. శిశువిద్య.
3. బాలవిద్య.
4. యౌవనవిద్య.
5. శాస్త్రవిద్య.
6. వృత్తివిద్య
7. గృహపరిశ్రమలు, గ్రామపరిశ్రమలు.
8. నిమ్నజాతులకు విద్యావిధానము,
9. మతవిద్య
10. గురుకులము
11. జాతీయ విద్యాలక్ష్యము.
12. వ్యవసాయవిద్య
13. భారతీయులకుగల విలక్షణ ధర్మములు: ఆంగ్లులకుగల విలక్షణధర్మములు.
14. భాషాబోధ, గణితబోధ చరిత్రబోధ; మొదలగునవి.
15. ఉపాధ్యాయులు పొందవలసిన శిక్షాక్రమము.
16. ప్రజాసేవక సమితి (బాలభటోద్యమము.)
17. క్షాత్రశిక్ష.
18. పురాణ శ్రవణము ఉపన్యాసములు (Lantern Lectures and practical Demonstraions) ద్వారా గ్రామములలో విద్యాప్రబోధము చేయుట.
19. విద్యార్థుల నప్పుడప్పుడు వైద్యులు పరీక్షింపవలసిన యవసరము.
20. ప్రకృతిసిద్ధముగా స్త్రీపురుషులకుగల వైలక్షణ్యములు యీవైలక్షణ్యముల ననుసరించి స్త్రీవిద్యావిధాన మెట్లుండవలెను.
21. రాత్రిపాఠశాల
22. జెర్మని దేశమందలి పారిశ్రామికవిద్య. (Industrial Education in Germany).
23. ఆర్యవిద్యా సంప్రదాయములు పాశ్చాత్య విద్యా సంప్రదాయములు.
24. బ్రహ్మచర్య శిక్షాక్రమము.

జాతీయ విద్యా ప్రచారమునకు వీరు గావించుచున్న కృషికి వందనీయులు. ఈగ్రంథము హిందీ భాషలోనికి అనువదింపబడి ప్రకటింపబడిన దెంతయు ఉచితముగ నుండునని గూడ మావిశ్వాసము.


(సం. నా.)

# భారతి

## సచిత్రమాసపత్రిక

December
1926

సంపాదకుఁడు

కా. నాగేశ్వరరావు

సంపుటము 3, భాగము ౨

ఆంధ్రపత్రికా కార్యాలయము - మద్రాసు

౧౯౨౬

